# వీక్షణం

ఆర్థిక, సామాజిక మాసపత్రిక

సెప్టెంబర్ 2006 62 రు. 10

భగత్ సింగ్ శతజయంతి ప్రారంభం

* ఫోకస్ : ఇటీవలి కోర్టు తీర్పులు - సమాజం పై ప్రభావం

  మాడభూషి శ్రీధర్, సాక్షి, ఎస్. వీరయ్య, ఎం. శ్రీనివాస్‌ల వ్యాసాలు

* ప్రత్యేక తెలంగాణ ఉద్యమం - ఇటీవలి పరిణామాలు
* లోక్ సత్తా రాజకీయ పార్టీలో కొత్తదనం ఉందా ?
* ధరల పెరుగుదల పై రెండు వ్యాసాలు
* శీతల పానీయాలలో పురుగు మందులు
* లెబనాన్ పై ఇజ్రాయిల్ దాడి

# 'వీక్షణం' విస్తరణకు సహకరించండి !

తెలుగు నాట సామాజిక విశ్లేషణా వికాసానికి మీ తోడ్పాటు నందించండి !!

నాలుగు సంవత్సరాలుగా సామాజిక, ఆర్థిక రాజకీయ సమాచార సమర్పణలో, విశ్లేషణలో సాగిస్తున్న అప్రతిహతమైన, అసాధారణమైన కృషి వల్ల సామాజిక ఆర్థిక మాసపత్రి 'వీక్షణం' పాఠకుల ఆదరాభిమానాలను అపారంగా చూరగొంటున్నది. వేలాది మంది పాఠకులను సంపాదించుకున్నది. తెలుగు సీమలో పేరున్న రచయితలు, సామాజిక, ఆర్థిక, రాజకీయ విశ్లేషకులు అందరూ 'వీక్షణం' కు తమ రచనలు అందజేస్తున్నారు. వందలాది మంది అభిమానులు 'వీక్షణం' కు తమ సహాయ సహకారాలు అందించడానికి ముందుకు వస్తున్నారు. నాలుగు సంవత్సరాల వ్యవధిలో, అరవై సంచికలతో సాధించిన ఈ విజయాలు గణనీయమైనవే గాని తెలుగు సామాజిక అవసరాలతో పోల్చినప్పుడు చేయవలసింది ఇంకా ఎంతో ఉంది. తెలుగులో ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ వంటి ప్రామాణిక రాజకీయార్థిక విశ్లేషణా వేదికను నిర్మించాలనే మా కోరిక నెరవేరడానికి సాధించవలసింది ఎంతో ఉంది. అయితే ఇది మా ఒక్కరి కృషి వల్ల సాధ్యం కాదు. 'వీక్షణం' తెలుగు సమాజం తనగురించి తాను చేసుకునే అన్వేషణ. అందువల్ల 'వీక్షణం' విస్తరణ తెలుగు సమాజంలోని ఆలోచనా పరులందరి ఉమ్మడి బాధ్యత. రండి, ఈ కర్తవ్య నిర్వహణలో మీ వంతు భాగం పంచుకోండి.

★ 'వీక్షణం' చందాదారులుగా చేరండి !

★ మీరు చందాదారులయితే కనీసం మరొకరిని చందాదారుగా చేర్పండి !

★ మీ ఊళ్లో 'వీక్షణం' విడి కాపీల అమ్మకం కొరకు ఏజెన్సీని ఏర్పాటు చేయండి !

★ 'వీక్షణం' కు రచనలు పంపించండి !

★ 'వీక్షణం' కు వ్యాపార ప్రకటనలు సమకూర్చండి !

విడి ప్రతి: రు. 10, సంవత్సర చందా రు. 120, మూడు సంవత్సరాల చందా రు. 350,
ఐదు సంవత్సరాల చందా రు. 550, పది సంవత్సరాల చందా రు. 1000

ఎం.ఓ. / డి.డి. పంపవలసిన చిరునామా


**వీక్షణం**

ఆర్థిక, సామాజిక మాస పత్రిక

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029,

ఫోన్ / ఫాక్స్ : 040-66843495

# వీక్షణం

ఆర్థిక, సామాజిక మాసపత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసెర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

62 సెప్టెంబర్ 2006

వార్షిక చందా: రు.120 విడి ప్రతి : రు. 10




*సంపాదకీయం*

## మళ్లీ చౌరస్తాలో తెలంగాణ

యాభై సంవత్సరాలు ఆంధ్రప్రదేశ్‌లో అనేకసార్లు దిక్కుతోచని చౌరస్తాలో నిలబడి తెలంగాణ గత కొద్దిరోజుల నాటకీయ పరిణామాల తర్వాత మళ్లీ ఒకసారి ఏ దారి ఎంచుకోవాలో తేల్చుకోవలసిన స్థితిలో ఉంది. ఇది రాసే సమయానికి తెలంగాణ రాష్ట్ర సమితి నాయకుడు కేంద్రమంత్రి వర్గంలో పదవులను త్యజించి, యూపిఎ నుంచి బైటికి వచ్చి ఉద్యమమార్గం చేపట్టడానికి సిద్ధంగా ఉన్నారు. రెండు సంవత్సరాలకు పైగా లాబీయింగ్ ద్వారా ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర సాధన సాధ్యమవుతుందని నమ్ముతూ, నమ్మిస్తూ, ఉద్యమం వద్దని చెపుతూ వచ్చిన ఒక పార్లమెంటరీ రాజకీయ పక్షం ఇక పార్లమెంటరీయేతర పద్ధతిలో ఉద్యమం తప్పదని అనుకుంటున్నదంటే దేశ రాజకీయాలు ఎంతగా పతనమయ్యాయో అర్థమవుతుంది. వ్యవస్థ చట్రం లోపల, సామాన్యంగా కనీస సమస్యలు కూడ పరిష్కారమయ్యే స్థితి లేదని, కొత్త రాష్ట్రం ఏర్పాటు వంటి చట్టబద్ధమైన, పాలనాపరమైన పరిష్కారానికి కూడ వీధుల్లోకి రాక తప్పదని ఈ పరిణామం తెలియజేస్తున్నది. నిజానికి రాజ్యాంగబద్ధంగా అతి సులభంగా పరిష్కరించగలిగిన ఈ సమస్యను కాంగ్రెస్ మూడున్నర దశాబ్దాలు మురగబెట్టింది. గత రెండున్నర సంవత్సరాలుగాం పరిష్కారాన్ని వాయిదా వేయడానికి అనేక కుటిల ప్రయత్నాలు చేసింది.

ఆంధ్రప్రదేశ్ ప్రజలను, తెలంగాణ ప్రజలను, ఆంధ్రప్రదేశ్‌లోని రాజకీయ పక్షాలను సంప్రదించి సాధించవలసిన పరిష్కారాన్ని జాతీయ స్థాయిలో ఏకాభిప్రాయం సాధించాలనే పాచికకు బలిచేసింది. తెలంగాణతో, ఆంధ్రప్రదేశ్ తో ఏ సంబంధమూలేని సుదూర రాజకీయ పక్షాలు ఈ విషయం మీద ఏకాభిప్రాయం ప్రకటిస్తే ఎంత, ప్రకటించకపోతే అని నిలదీయ వలసిన తెరాస ఆ ఉచ్చులో చిక్కుకుంది. మూడున్నర కోట్ల తెలంగాణ వాసుల భవిష్యత్తును సోనియా గాంధీ అనే ఒక వ్యక్తికో, ఏ సంబంధమూలేని పార్టీలకో వదిలివేసింది. ఆ విషాద, వివాద కాలమంతా గడిచి ఇప్పుడు ఒక నిర్ణయాత్మక దశకు చేరుకున్న తెరాస, ఈ దశకు చేరుకోవడానికి దారి తీసిన జాతీయ పార్టీల విద్రోహాన్ని, అలక్ష్యాన్ని గుర్తుపెట్టుకున్నట్టుగానే, ప్రజల ప్రగాఢ ఆకాంక్షను కూడ గుర్తు పెట్టుకోవాలి. ఈ చౌరస్తా నుంచి ద్రోహం చేసిన పార్టీల చంకన చేరే మార్గమో, సమైక్యతా మార్గమో అవకాశవాద మార్గమో కాక ప్రజల మార్గాన్ని చేపట్టాలి. ప్రత్యేక రాష్ట్ర సాధన మాత్రమే తమ సమస్యల పరిష్కారానికి ఏకైక మార్గమో, మంత్రదండమో కాదని, అది ఒక బృహత్తర కర్తవ్య మార్గంలో ఒక మైలురాయి మాత్రమేనని తెలంగాణ ప్రజలు ఇప్పటికే గుర్తించి ఉన్నారు. అందువల్లనే ప్రత్యేక రాష్ట్రం విద్య, ఉద్యోగాలు, నీటిపారుదల, అభివృద్ధి, ఆత్మగౌరవం, భాషా సాంస్కృతిక అస్తిత్వ పరిరక్షణ వంటి లక్ష్యాల కొరకేనంటున్నారు తప్ప దానికదే లక్ష్యం అనడం లేదు. తెలంగాణ ఉద్యమకారులు ఈ రెండు సంవత్సరాల అనుభవం నుంచి ప్రతికూల పాఠాలు నేర్చుకోవలసి ఉంది, అనుకూల పాఠాలు నేర్చుకోవలసి ఉంది. ◆

# లోపలి పేజీల్లో...



## ఇటీవలి తీర్పులు రాజ్యాంగానికి అనుకూలమేనా?

ప్రపంచీకరణ ప్రభావం అన్ని రంగాల్లో పడింది. ప్రభుత్వం ప్రపంచీకరణని ఆమోదించే ముందు, కొత్త చట్టాల్ని చెయ్యవల్సి వచ్చింది. పాత చట్టాలకీ, రాజ్యాంగానికీ కొత్త భాష్యాలు చెప్పించుకోవాల్సి వచ్చింది. యీ క్రమంలో కార్పొరేట్ సెక్టర్ లాభపడింది. పేదలు మట్టికొట్టుకు పోయారు. ప్రభుత్వరంగ సంస్థలూ, జాతీయ వాణిజ్య సంస్థలూ మూతపడ్డాయి.

తీర్పులన్నీ రాజ్యాంగ లక్ష్యమైన సమానత్వ సాధన, సోషలిస్టు వ్యవస్థ స్థాపనని దృష్టిలో పెట్టుకొని ఇచ్చినవే. రాజ్యాంగ లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకోకుండా చట్టాల్ని, రాజ్యాంగాన్ని విశ్లేషించడానికి వీల్లేదని అప్పట్లో కోర్టులు తీర్పు చెప్పాయి.






**వీక్షణం**
ఆర్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040 - 66843495
ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్, అజామాబాద్, హైదరాబాద్.

సహాయ సంపాదకులు : డి.వి.రామకృష్ణారావు
సర్క్యులేషన్ మేనేజర్ : వై.రామచంద్రం
కంపోజింగ్ & లే ఔట్ : చరిత ఇంప్రెషన్స్

## పాఠకుల వీక్షణం

నేను వీక్షణం మాసపత్రికను గత సంవత్సరకాలం నుండి రెగ్యులర్‌గా చదువుతున్నాను. పత్రికలో వివిధ ఆర్థిక, సామాజిక, రాజకీయ వ్యాసాలతో పాటుగా క్రీడలకు సంబంధించిన వ్యాసాలు కూడా ప్రచురించడం అభినందనీయం. ఐదు దశాబ్దాల క్రీడా వికాసం పేరుతో గత మూడు, నాలుగు సంచికలలో ప్రచురితమైన వ్యాసాలు, మనదేశ క్రీడారంగ అస్తవ్యస్థ పరిస్థితులను చక్కగా వివరించడం జరిగింది. వంద కోట్ల మంది ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తున్న భారతదేశం ఒలింపిక్ పతకాల పట్టికలో కనీసం స్థానం సంపాదించలేకపోవడం వెనుక గల లోపాలు, కారణాలపై లోతుగా విశ్లేషించాల్సిన అవసరమున్నది. శారీరక ఆరోగ్యం, వ్యాయామంతో పాటు మానసిక ఉల్లాసాన్ని కలిగించే క్రీడలు ప్రతివ్యక్తి జీవితంలో ఒక భాగం కావాల్సిన తరుణంలో మన అస్పష్ట విద్యావ్యవస్థ పుణ్యమా అని (ముఖ్యంగా ప్రైవేటు, కార్పొరేటు పాఠశాలలు) పాఠశాల, కళాశాల విద్యార్థులకు క్రీడలు అంటరాని వస్తువుగా తయారుకావడం జరుగుచున్నది.

కావున వీక్షణం పత్రికలో ఇక ముందు కూడా క్రీడా వ్యవస్థలో లోపాలు, రావాల్సిన మార్పులపై వ్యాసాలు ప్రచురించాల్సిందిగా కోరుచున్నాను.

– ఎ. శ్రీనివాసరెడ్డి
కాజీపేట

మేము 'వీక్షణం'పత్రికను చదవాలనుకుంటున్నాం. నక్సలైట్ కేస్ కింద 9 మంది, వేరే ఇతర కేసులపైన 7 మంది మొత్తం తెలుగు వచ్చిన వారం 16 మందిమున్నాం. మేము ఈ జైలులో ఉండబట్టి ఏడాదవుతోంది. మాది అనంతపురం జిల్లా. అక్కడినుంచి మైసూర్‌కి మా కుటుంబ సభ్యులు రావాలంటే ఆర్థికంగా చాలా ఇబ్బంది. పైగా చాలా నిరుపేద కుటుంబాలు. అందుకే ఎవరూ రాలేకపోతున్నారు. కనీసం మేము పత్రికకు చందా కట్టలేని పరిస్థితిలో వున్నాం. మీరే ఎలాగైనా మాపై దయ చూపి ఉచితంగా 'వీక్షణం' పత్రికను పంపించగలరని కాంక్షిస్తున్నాం.

– ఎస్. వెంకటేష్
సెంట్రల్ జైల్, మైసూర్

బెతల్‌హామ్ సంస్మరణ వార్త ప్రచురించిన 'వీక్షణం' అందింది. ఆయన గురించి చాలా సమాచారం సేకరించి ఇవ్వడం బాగుంది.

'సంస్మరణ' వార్తల్ని పేజీలో అడుగున వెయ్యకుండా, పైనించీ ప్రారంభిస్తే బాగుండేది. 'సంస్మరణ'కి ఆ మాత్రం ప్రాధాన్యత ఇవ్వాలి – అని రంగనాయకమ్మగారు అంటున్నారు.

– గాంధీ
హైదరాబాద్

'వీక్షణం' చాలా బాగా వస్తోంది. ఇంకా అభివృద్ధి చెందాలని ఆకాంక్షిస్తున్నాను.

– కె. ముత్యం
హైదరాబాద్

వీక్షణం ఆగస్ట్ సంచికలో 'పుర' పథకం మీద, కమ్యూనిస్టుల పొత్తుల్లో అపశ్రుతుల మీద అచ్చువేసిన వ్యాసాలు సంపాదకులు చదివి ఎంపిక చేశారో, చదవకుండానే అచ్చువేశారో అర్థం కావడం లేదు. ఈ రెండు వ్యాసాలను ఎంత దీక్షగా చదవటానికి ప్రయత్నం చేసినా కొరుకుడు పడలేదు. కొన్ని వాక్యాలకు ఎటువంటి అర్థం లేదు. రచయితలు ఏం చెప్పదలచుకున్నారో బోధపడడం లేదు. ఇక నుంచి దయచేసి ఇటువంటి వ్యాసాలు మీకు అర్థమయితేనే ప్రచురించగలరని మనవి.

– సి. రాహుల్
గుంటూరు

స్థానిక సంస్థల ఎన్నికలపై ఎన్. వేణుగోపాల్ విశ్లేషణ అంటే ఏదో వుంటుందని ఊహించుకున్నాం. ఆంధ్రజ్యోతి, ఈనాడులలో ఆస్థాన విద్వాంసులు రాసినట్టుగా ఉంది. మామూలు దినపత్రికలలో వచ్చేలాంటి వ్యాసాల కోసం 'వీక్షణం' అవసరం లేదు.

– కె.ఎన్. రావు
హైదరాబాద్

మార్చి–ఏప్రిల్ వీక్షణంలో 'నేపాల్ సమస్య రాజరికమా? పేదరికమా?' అనే వ్యాసంలో శాంతి చర్చల యెడల సుధాకర్ వ్యక్తపరచిన అభిప్రాయాలు చూసాను. శాంతి చర్చల యెడల ఆయనకేర్పడిన భ్రమలకు చింతిస్తున్నాను. తన వ్యాసంలో 'చర్చల ద్వారా ప్రజలు పోరాడి సాధించుకున్నవాటికి చట్టబద్ధత కల్గించే విధంగా ఎత్తుగడలుండాల'ని సలహా ఇచ్చారు. 'మిగిలిపోయిన కష్టాల్ని పరిష్కరించే ప్రణాళికల్ని రచించగలిగేవిగా వ్యూహాలుండాల'ని విప్లవకారులకు సులువైన ఫార్ములాను సూచించారు. కామ్రేడ్ ప్రచండ ప్రతిపాదించిన కాంపిటీటివ్ మల్టీ పార్టీ డెమొక్రసీ విప్లవకారులకు అరచేతిలో వైకుంఠం చూపించిందో లేదో కానీ సుధాకర్‌గారు చూపించిన చర్చల మార్గం మాత్రం 'వైకుంఠాన్ని' చూపిస్తున్నది. చర్చలు–రాజీలు అనేవి వర్గపోరాట చరిత్రలో కొత్తపోరాట రూపాలు కావు. ఈ పోరాట రూపాలకెంతో చరిత్ర వుంది. ఈ చారిత్రక అనుభవాల్ని ఏమాత్రం దృష్టిలో పెట్టుకున్నా సుధాకర్‌గారు ప్రజల మౌలిక సమస్యల పరిష్కారానికి చర్చల వంటి సులువైన మార్గాన్ని సూచించేవారు కాదు.

ముందుగా ప్రజల మౌలిక సమస్యల పరిష్కారంలో చర్చల ప్రక్రియకున్న ప్రాధాన్యతను అర్థం చేసుకోవాలంటే చర్చలలో పాల్గొనే వైరి పక్షాల వర్గ స్వభావాలను, రాజకీయ లక్ష్యాలను అర్థం చేసుకోవల్సి ఉంటుంది. అప్పుడు మాత్రమే చర్చల ప్రక్రియకున్న ప్రాధాన్యత, పరిమితి అర్థమవుతుంది. సాధారణంగా చర్చల ప్రక్రియలో ఒక పక్షంగా ఉండే ప్రభుత్వాలు నిర్దిష్టమైన వర్గ స్వభావాన్ని, రాజకీయ లక్ష్యాన్ని కలిగి వుంటాయి. మరింత నిర్దిష్టంగా చెప్పుకోవాలంటే ప్రస్తుత వ్యవస్థలో ఈ ప్రభుత్వాలు, సామ్రాజ్యవాదుల కనుసన్నలలో వ్యవహరించే నిరంకుశ దళారీ బూర్జువా, భూస్వామ్య వర్గాల ప్రయోజనాలను కాపాడు తుంటాయి. ప్రజలపై దోపిడి వర్గాలు అమలు జరిపే దోపిడీ పీడనలకు, రాజకీయ ఆధిపత్యానికి సాధనాలుగా ఉంటాయి. సారాంశంలో ఈ ప్రభుత్వాలు, నిరంకుశ దళారీ బూర్జువా భూస్వామ్య వర్గాల

మిగతా 33 పేజీలో....

# కొత్తపుస్తకాలు











- **వ్యూహం** - మినీ కవిత్వం - అశోక్‌కుమార్ - చినుకు ప్రచురణలు, 64 పేజీలు, 1/8 డెమీ, రు. 25. ప్రతులకు : చినుకు పబ్లికేషన్స్, 27, 28, థర్డ్‌ఫ్లోర్, దత్తాస్ నయా బజార్, రాజ్ యువరాజ్ థియేటర్స్ ఎదురుగా, గాంధీనగర్, విజయవాడ - 520 003.
- **నెమలీకలు** - నాంపల్లి సుజాత నానీలు - వంశీ చైతన్య ప్రచురణలు, 70 +10 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు : శ్రీమతి నాంపల్లి సుజాత, 3-13-105/2, శ్రీనివాసపురం, రామంతపూర్, హైదరాబాద్ - 500 013.
- **కవయిత్రుల కవితామార్గం** - కవయిత్రుల కవిత్వం - పరిశీలన సిద్ధాంత గ్రంథం - శిలాలోలిత - సాహితీ స్రవంతి ప్రచురణ; 254 పేజీలు, 1/8 డెమీ, రు. 80. ప్రతులకు : ప్రజాశక్తి బుక్ హౌస్, 1-1-187/1/2, చిక్కడపల్లి, హైదరాబాద్ - 500 020.
- **సందుక** - నారాయణస్వామి కవితలు - ఝరి పొయిట్రీ సర్కిల్, 82 పేజీలు, 1/8 డెమీ, రు. 25. ప్రతులకు : విశాలాంధ్ర, ప్రజాశక్తి, నవోదయ, దిశ పుస్తకాల షాపులు, హైదరాబాదు.
- **అమ్మను జూడాలె** - ఉదయమిత్ర కథలు - పాలమూరు ప్రచురణలు, 110 పేజీలు, 1/8 డెమీ, రు. 40. ప్రతులకు నవోదయ బుక్ హౌస్, ఆర్యసమాజ్ ఎదురులైను, కాచిగూడ, హైదరాబాదు.
- **గడ్డి పరకలు** - కందుకూరి రమేష్‌బాబు, సామాన్యశాస్త్రం ప్రచురణ, 96 పేజీలు, 1/8 డెమీ, రు. 10, ప్రతులు అన్ని ప్రధాన పుస్తక కేంద్రాల్లో లభిస్తాయి.
- **మానాల** - దీర్ఘ కవిత - చెలిమి - 32 పేజీలు, 1/8 డెమీ, రు. 10. ప్రతులకు దిశ పుస్తక కేంద్రం, చిక్కడపల్లి; సహచర బుక్ మార్క్, బాగ్‌లింగంపల్లి, హైదరాబాదు.
- **వెన్నెలదారి** - జంఝావతి - విరసం, శ్రీకాకుళం యూనిట్ ప్రచురణ, 46 పేజీలు, 1/8 డెమీ, రు.20, ప్రతులకు : చలసాని ప్రసాద్, 15-ఎల్.ఐ.జీ., హెచ్.బి. కాలనీ, విశాఖపట్నం; దిశ పుస్తక కేంద్రం, హైదరాబాద్.
- **జైలురాతలు** - వరవరరావు వ్యాసాలు - ములాఖత్ ముద్ర ప్రచురణలు, 176 పేజీలు, 1/8 డెమీ, రు. 50; ప్రతులకు : దిశ, నవోదయ, సహచర పుస్తకాల షాపులు, హైదరాబాద్, ఇతర ప్రముఖ పుస్తకాల షాపులు.
- **అంతస్సూత్రం** - వరవరరావు కవితలు - నయనోదయ ప్రచురణలు, 142 పేజీలు, 1/8 డెమీ, రు. 40; ప్రతులకు : దిశ, నవోదయ, సహచర పుస్తకాల షాపులు, హైదరాబాద్, ఇతర ప్రముఖ పుస్తకాల షాపులు.










# లోక్‌సత్తా రాజకీయ పార్టీలో కొత్తదనం ఉందా ?

- ఎన్. వేణుగోపాల్

రాష్ట్ర ప్రభుత్వంలో అత్యున్నతాధికార ఐఎఎస్ హోదాను వదులుకొని పది సంవత్సరాల కింద లోక్‌సత్తా పేరుతో ఒక ప్రజాస్వామిక సంస్కరణల ఉద్యమాన్ని ప్రారంభించిన డా. జయప్రకాశ్ నారాయణ పట్ల మధ్యతరగతిలో, విద్యావంతులలో ఆకర్షణ ఉంది. ఎప్పుడు తాను లేవనెత్తుతున్న సమస్య మౌలిక అంశాలలోకి వెళ్లకపోయినా, ఆ సమస్యలను భావోద్వేగపూరితంగా, తార్కికంగా చర్చించడం, కొనసాగుతున్న రాజకీయార్థిక విధానాల చట్రం లోపలే ఆ సమస్యలకు పరిష్కారం దొరుకుతుందన్నట్టుగా అభిప్రాయాలు కలిగించడం ఆయనకు చాలమంది అభిమానులను సాధించి పెట్టాయి. ప్రత్యేకించి రాష్ట్ర రాజకీయాలలో ప్రాబల్యం ఉన్న ఒక సామాజిక వర్గం, ఒక పత్రికా సామ్రాజ్యం ఆయనకు వెన్నుదన్నుగా నిలిచాయి. ఇటు కింది నుంచి వెల్లువలా అభిమానం, అటుపై నుంచి కొన్నిసార్లు ప్రత్యక్షంగా, మరికొన్నిసార్లు పరోక్షంగా మద్దతు కలగలిసి లోక్‌సత్తా ప్రజాస్వామిక సంస్కరణల ఉద్యమం మొదటినుంచీ పార్టీయేతర ప్రజా ఉద్యమంగా చెప్పుకుంటున్నదల్లా రాజకీయ పార్టీగా మారే స్థితిని కల్పించాయి. రాజకీయరంగాన్ని సంస్కరించడానికే కొత్త స్వతంత్ర రాజకీయ ఉద్యమంగా ప్రారంభమైన లోక్‌సత్తా తానే ఒక రాజకీయ పక్షంగా మారడం సహజమైన విషయమే. రాజకీయ సంస్కరణలు ఎప్పుడైన లోపలి నుంచి జరగవలసినవే తప్ప బయటి నుంచి విమర్శల ద్వారా మాత్రమే జరిగేవి కావు. బయటి నుంచి పెద్దఎత్తున విశాల ప్రజానీకం పాల్గొన్న ఉద్యమం జరిగినప్పుడు కూడ రాజకీయ వ్యవస్థమార్పులు రాజకీయ పక్షాల నాయకత్వం లోనే, రాజకీయ నిర్మాణాల లోపలే జరుగుతుంది. లోక్‌సత్తా తన పది సంవత్సరాల చరిత్రలో ఎప్పుడూ అంతటి విశాల ప్రజా ఉద్యమం గురించి ఆలోచించలేదు, కేవలం ఒక మేధావుల, బుద్ధిజీవుల సంస్థగా మాత్రమే ప్రవర్తించింది. అందువల్ల ఇప్పటికయినా అది ఒక రాజకీయ పక్షంగా మారడం రాజకీయాల అంతర్గత చలనసూత్రాలను గుర్తించిందనడానికి నిదర్శనం.

లోక్‌సత్తా పట్ల మొత్తంగాను, డా. జయప్రకాశ్ నారాయణ పట్ల వ్యక్తిగతంగాను మధ్యతరగతి ప్రజలలో, విద్యావంతులలో, పట్టణ ప్రాంతాలలో ఒక రకమైన ఆకర్షణ ఉంది గనుక ఈ కొత్త రాజకీయ పక్షానికి కూడ ముఖ్యంగా పత్రికలలోను, ప్రచార సాధనాలలోను, పట్టణ ప్రాంతాలలోను చాలా ప్రాచుర్యం లభించింది. తెలుగు నేలలో రాజకీయాలు – ముఖ్యంగా ఎన్నికల రాజకీయాలు – చాల భ్రష్టు పట్టి ఉన్నాయి గనుక, మధ్యతరగతిలో పెద్ద ఎత్తున నిరాశా నిస్పృహలు వ్యాపించి ఉన్నాయి గనుక కొత్తొక వింతగా కూడ లోక్‌సత్తా పార్టీ పట్ల ఆదరాభిమానాలు వ్యక్తం అయి ఉండవచ్చు.

ఈ దేశంలో ఎటువంటి రాజకీయ పార్టీ అయినా, ఎంత దగుల్బాజీలు ఏర్పాటు చేసిన పార్టీ అయినా తన ప్రణాళికలో, కార్యక్రమంలో చాల సుభాషితాలు, గంభీరమైన వాగ్దానాలు, వేలెత్తి చూపడానికి వీలులేని సదాశయాలు రాసుకోవడం అలవాటే. ఆచరణలో మాత్రం ఆ ప్రవచనాలన్నిటినీ పక్కన పెట్టి పరమ దుర్మార్గంగా, అవినీతిమయంగా, దోపిడీ వర్గాల సేవలో మునిగిపోయి ఉండడం, ప్రజల పట్ల ప్రజాసంక్షేమం పట్ల ఏమాత్రం శ్రద్ధ కనబరచకపోవడం ప్రతి ఒక్కరి అనుభవంలో ఉన్నదే.

ఈ నేపథ్యంలో ఈ కొత్త రాజకీయ పక్షం ఆవిర్భావాన్ని దాని సైద్ధాంతిక, రాజకీయ వైఖరులను, భవిష్యత్ దృక్పథాన్ని, ఆచరణను, ఆ పార్టీ పట్ల ఇతర పార్టీల, ప్రజల వైఖరులను జాగ్రత్తగా పరిశీలించవలసి ఉంది.

గత పది సంవత్సరాలలో లోక్‌సత్తా అనేక కార్యక్రమాలు చేపట్టింది. కొన్ని కార్యక్రమాలలో చెప్పుకోదగిన విజయం సాధించింది. ప్రజా సంక్షేమ కార్యక్రమాలు సక్రమంగా అమలవుతున్నాయా లేవా చూడడం, ప్రభుత్వ యంత్రాంగపు అవినీతి మీద నిఘా ఏర్పాటు చేయడం, మరో స్వతంత్ర ఉద్యమానికి పిలుపునివ్వడం, ఎన్నికలు సక్రమంగా జరిగేలా, ఎన్నికలలో సంస్కరణలు అమలు జరిగేలా కార్యక్రమాలు చేపట్టడం, సూచనలు ఇవ్వడం, ఒక కోటి సంతకాల సేకరణ, పరోక్ష పన్నుల విధానంలో సంస్కరణలు మొదలయిన అనేక కార్యక్రమాలతో పాటు సమాచార హక్కు చట్టం రూపకల్పనలో, స్థానిక సంస్థలకు 73,74 రాజ్యాంగ సవరణల ప్రకారం ఎక్కువ అధికారాలు కట్టబెట్టాలనే ఆందోళనలో లోక్‌సత్తా అగ్రభాగాన ఉంది. రచనలు, ఉపన్యాసాల ద్వారా తన అభిప్రాయాలను విస్తృతంగా ప్రచారం చేసింది.

పత్రికా పాఠకులకు, ప్రచార సాధనాల శ్రోతలకు, ప్రేక్షకులకు ఇదంతా సుపరిచితమే. పత్రికలలో, ప్రచార సాధనాలలో ప్రాచుర్యమే ప్రజలలో ప్రాచుర్యం కాదు, సాధారణంగా మధ్యతరగతి ప్రచార సాధనాల మీద ఆధారపడి, వాటి ద్వారా సమాచారాన్నీ జ్ఞానాన్ని పొంది అది మాత్రమే సర్వస్వం అనుకుంటోంది. కాని తీరిక లేకపోవడం వల్ల గాని ప్రచార సాధనాలు చేరలేని ప్రజానీకమే చాల ఎక్కువ. అందువల్ల నిజంగా లోక్‌సత్తా ఒక ప్రజా ఉద్యమంగా ఏ అట్టడుగు వర్గాలకు చేరగలిగిందనేది, ఏ అట్టడుగు వర్గాల జీవన సమస్యలు లేవనెత్తగలిగిందనేది అనుమానాస్పదమే.

కాని బహుశా పది సంవత్సరాల పాటు జరిగిన ప్రచారం వల్ల స్థానిక వేదికల నుంచి అంతర్జాతీయ వేదికల దాకా వచ్చిన ప్రాచుర్యం వల్ల లోక్‌సత్తా ఇక రాజకీయ పక్షంగా మారవలసిన సమయం ఆసన్నమైనదనుకున్నట్టుంది. 'నూతన రాజకీయ సంస్కృతి – కొత్త తరానికి కొత్త రాజకీయం' అనే చర్చా పత్రాన్ని 2006 జులై 2న విడుదల చేసి, కొత్త రాజకీయ పార్టీ పెట్టబోతున్నామని ప్రకటించింది. ఆ చర్చాపత్రం మీద సమాలోచనలు జరిపి, ఆగస్ట్ 9న రాజకీయ పార్టీగా

అవిర్భవించనున్నామని ప్రకటించింది. ఈ కొత్త పార్టీ లక్ష్యాలు, నిర్మాణంతో సహా అన్ని విషయాలపై స్పష్టమైన ప్రణాళికను అక్టోబర్ 1న ప్రకటిస్తామని డా. జయప్రకాశ్ నారాయణ అన్నారు.

స్పష్టమైన ప్రణాళిక వెలువడిన తర్వా రాజకీయ పార్టీగా ఆచరణ మొదలైన తర్వాత ఇంకా వివరమైన విశ్లేషణ జరపవచ్చుగాని ఇప్పటికే వెలువడిన చర్చా పత్రం ఆధారంగా, జులై 2, ఆగస్ట్ 9 పత్రికా సమావేశాలలో ప్రకటించిన అభిప్రాయాలు ఆధారంగా లోక్‌సత్తా రాజకీయ పార్టీ ఎలా ఉండబోతుందో చర్చించవచ్చు.

చర్చా పత్రంలోను, ఇతరంగా ప్రకటించిన అభిప్రాయాల లోను కొట్టవచ్చినట్టు కనబడే అంశాలు మూడు : ఒకటి. ఏ విషయం చర్చించేటప్పుడైన వాటి లోతులలోకి, మౌలిక అంశాలలోకి వెళ్లి పరిష్కారాలు అన్వేషించకపోవడం. రెండు. సమాజం ముందర, ప్రజల ముందర ఉన్న అనేక సమస్యల లోంచి కొన్నిటిని మాత్రమే, అవి కూడ నిర్ణయాత్మకమైన, ఆధారభూతమైన సమస్యలను కాకుండా, పై పై సమస్యలను, ఆ సమస్యల పరిష్కారం జరిగినా మౌలిక స్థితిలో మార్పురాని సమస్యలను మాత్రమే ప్రస్తావించి వాటికి ఏవో అతుకుల, మాట్ల పరిష్కారాలను ప్రతి పాదించడం. మూడు. చాల ముఖ్యమైన సమస్యలు విషయంలో చెవులు బద్దలయ్యేంత మౌనాన్ని, నిశ్శబ్దాన్ని పాటించడం.

ఈ మూడు ధోరణులు ఉద్దేశ్యపూర్వకంగా వ్యక్తమయ్యాయో, యదాలాపంగా వ్యక్తమయ్యాయో తెలియదు గాని, ఈ ధోరణులు ప్రాతిపదికగా ఉన్నతర్వాత, పైపైన ఎంత గంభీరంగా, ఎంత ఉదాత్తంగా, ఎంత సదాశయంతో ఎన్ని విషయాలు రాసినా వాటికేమి విలువ ఉండదు.

'... ప్రజల ముందు ఆటను మార్చే పార్టీలు లేవు. ప్రజలు తమంతట తాము ప్రత్యామ్నాయ పార్టీలను సృష్టించుకోలేరు...

పార్టీలు రాజకీయ అధికార క్రీడలో మునిగిపోవడం, ప్రజలు తమంతట తాము ప్రత్యామ్నాయాన్ని రుపొందించుకోలేని స్థితిని – ఇవీ ఈ సంధియుగం మన ముందు ఉంచిన సవాళ్లు.

ఈ సవాళ్లను అధిగమించేందుకు మరొక పార్టీని రూపొందించి, దానిని కూడా అధికార క్రీడలు భాగస్వామిని చేడయం పరిష్కారం కాదు, కొత్త తరానికి కొత్త రాజకీయాన్ని సృష్టించాలి. ఒక కొత్తరకం ప్రత్యామ్నాయాన్ని రూపొందించాలి' అని చర్చాపత్రం రాసింది.

ఆటను మార్చే పార్టీలు లేవని అనడం, ప్రజలు తమంతట తాము ప్రత్యామ్నాయాలను రూపొందించుకోలేరని అనడం చరిత్ర, వాస్తవాలు తెలియకపోవడమైనా కావాలి. తెలిసీ వక్రీకరించడమైనా కావాలి. రాజకీయాలంటే ఎన్నికల రాజకీయాల మాత్రమే అని అర్థం చేసుకుంటే 'ఆటను మార్చే పార్టీలు' లేవనేమాట నిజమే కావచ్చు. కాని చర్చా పత్రంలోనే రాజకీయాలను అంత సంకుచితంగా కాకుండా విశాలంగా అర్థం చేసుకున్నారన్న సూచన కనిపిస్తోంది. అలాగే ప్రజలు ప్రత్యామ్నాయాన్ని రూపొందించుకోలేరన్నప్పుడు, ప్రజల కొరకు ఎవరో తెచ్చి పెడతారనే అభిప్రాయం ధ్వనిస్తోంది. అంతే ప్రజలకు, రాజకీయ నాయకులకు మధ్య ఒక అసహజ విభజన రేఖను గీయడం ద్వారా కొనసాగుతున్న రాజకీయ సంస్కృతికే బలం చేకురుతోంది. నిజానికి ప్రజలే ప్రత్యామ్నాయాలను కోరుకుంటారు. ఆ కోరిక ఉధృతిని బట్టి ప్రత్యామ్నాయ నిర్మాణాలు రూపొందుతాయి. ఆ నిర్మాణాల రూపశిల్పులు వ్యక్తులుగా కనబడవచ్చు గాని వారాపని ప్రతిభావంతులైన వ్యక్తులుగా చేయరు, సామాజిక ఆకాంక్షల వ్యక్తీకరణలుగా చేస్తారు.

సమాజానికీ రాజకీయ నిర్మాణానికీ, ప్రజలకూ నాయకులకూ మధ్య ఉండే సంబంధం పట్ల గందరగోళం చర్చా పత్రంలో అడుగడుగునా కనబడుతుంది. ఈ గందరగోళం వల్లనే ఈ నాలుగు అంశాలలో దేని గురించి మాట్లాడేటప్పుడైన చాల బోలుగా, పైపై వివరణలు, మౌలికత వైపు వెళ్లని ఉపరితల అవగాహనలు వ్యక్తమవుతాయి.

ఉదాహరణకు చర్చా పత్రం నిండా ప్రజాస్వామ్యం గురించి ప్రస్తావనలు, విశ్లేషణలు, వివరణలు కనబడతాయి. కాని ప్రజాస్వామ్యాన్ని మౌలికంగా సంఘజీవనానికి, అభివృద్ధికి, ప్రజల మధ్య ఆదాన ప్రదానాలకు, భిన్నాభిప్రాయాల మధ్య ఐక్యత, ఘర్షణలకు, సమస్యయానికి ప్రతీకగా కాక ఎన్నికల తంతుగా కుదించడం కనబడుతుంది. ప్రజాస్వామ్యం ఏర్పడాలనా, కొనసాగాలన్నా, పరిఢవిల్లాలన్నా మౌలికంగా సమానత్వం ఉండాలి. ఆర్థిక, సామాజిక, రాజకీయ సమానత్వం లోతుగా, విశాలంగా అమలు కాని సమాజంలో ప్రజాస్వామ్యం అనే మాటకు అర్థంలేదు. లోక్‌సత్తా మాత్రం సమానత్వం ఊసెత్తకుండా, అంటే సామాజిక వ్యవస్థా నిర్మాణాలలో రావలసిన మార్పుల గురించి మాట్లాడకుండా ప్రజాస్వామ్యం గురించి, ఎన్నికల సంస్కరణల గురించి మాట్లాడుతుంది. ఇది లోపలి చిరుగుల బట్టల మీద, లోపల అనారోగ్యంతో, పేదరికంతో బక్క చిక్కిన శరీరం మీద అరువు తెచ్చుకున్న కోటు తొడుక్కుని, సెంటు చల్లుకోవడం లాంటిది.

ఎన్నికలు ఎంత స్వేచ్ఛగా, న్యాయబద్ధంగా జరిగినా, కొత్త రాజకీయ సంస్కృతి అనబడే బ్రహ్మపదార్థమేదో ఉనికిలోకి వచ్చినా, సామాజిక వ్యవస్థలో మార్పులు రాకుండా అవి సాధించగలిగిందేమయినా ఉంటుందా? అసలు సామాజిక వ్యవస్థ మారనంతవరకూ ఎన్నికల సంస్కరణలకు, రాజకీయ సంస్కృతి మార్పుకు అవకాశం ఉంటుందా?

ఉదాహరణకు సమాజంలో ఆస్తి సంబంధాలు మారకుండా, భూస్వామ్య ఆర్థిక సంబంధాలు, సంస్కృతి మారకుండా, దోపిడీ పీడనలు పోకుండా, అణచివేత పోకుండా నూతన రాజకీయ సంస్కృతి ఏర్పడుతుందా? అసలు ఆ నూతన రాజకీయ సంస్కృతి గురించి ఆలోచించే వాళ్లు ఈ మౌలిక సమస్యల గురించి ప్రస్తావించనైనా ప్రస్తావించక పోవడం ఎందుచేత?

ఇటువంటి మౌలిక అంశాల జోలికి పోకపోవడం ఒక ఎత్తయితే, నిజమైన సమస్యల గురించి ప్రస్తావించిన సందర్భాలలో కూడ వాటి నిజమైన పరిష్కారాలు వైపు దృష్టి మళ్లకుండా పైపై అతుకులు, సంస్కరణలు, పూతలు, మాట్లు ప్రతిపాదించడం ఒక పద్ధతి. లోక్‌సత్తా గత చరిత్రలోను, ప్రస్తుత చర్చా పత్రంలోను కూడ అవినీతి గురించి పెద్ద ఎత్తున మాట్లాడుతోంది. అవినీతి మన సమాజంలో చాలా ముఖ్యమైన సమస్యేననడంలో ఎటువంటి సందేహం లేదు. కాని అవినీతి – లంచగొండితనం పైపై నైతిక సమస్యలు కావు. సమాజంలో, చరిత్రలు, ఆర్థిక వ్యవస్థ నిర్వహణలో, సాంస్కృతిక విలువలలో డబ్బు ప్రాధాన్యం, కూడబెట్టుకోవాలనే తపన, పక్క వారి కన్న ఎక్కువ సౌకర్యాలు

అనుభవించాలనే భోగలాలస, చూపెట్టుకోవాలనే అవినీతిని చూడవలసి ఉంటుంది. అంతే అవినీతికి వ్యతిరేక పోరాటం అనేక రంగాలకు విస్తరించవలసి ఉంటుంది. బహుశా అంతిమంగా ఆస్తి సంబంధాలలోని అసమానత మీద, సొంత ఆస్తి మీద, అధికారం మీద, కుల, వర్గ, లింగ, ప్రాంత, భాషా ఆధిపత్యాల మీద పోరాటంగా పర్యవసించవలసి ఉంటుంది. ఇవేవీ లేకుండా అవినీతి గురించి గగ్గోలు పెట్టడం అమాయకులను ఆకర్షించవచ్చు గాని సాధించేదేమి ఉండదు.

ఇక చర్చాపత్రంలోను, ఇతర చోట్ల కూడ కొట్టవచ్చినట్టు మౌనం వ్యక్తమయిన సందర్భాలున్నాయి. ఇరవై నాలుగు పేజీల చర్చాపత్రం పదిహేను సంవత్సరాలుగా దేశాన్ని అతలాకుతలం చేస్తున్న నూతన ఆర్థిక విధానాల గురించి గాని, సామ్రాజ్యవాద ప్రపంచీకరణ గురించి గాని, బాబ్రీ మసీదు విధ్వంసం నాటి నుంచి పెరిగిపోతున్న హిందూ మతోన్మాదం గురించి గాని, మండల్ కమిషన్ వ్యతిరేక ఆందోళన నాటి నుంచి పెట్రేగిపోతున్న అగ్రవర్ణ దురహంకారం గురించి గాని అక్షరం కూడ పలకలేదు. 'పాలన ప్రజలకు దూరం అయింది. హైదరాబాద్ నుండి, ఢిల్లీ నుండి కేంద్రీకృత రూపంలో సాగుతున్నది' అని కేంద్రీకరణ క్రమంలో కొంత భాగాన్ని సరిగానే గుర్తించిన చర్చాపత్రం, వాషింగ్టన్ నుంచి సాగుతున్న పాలన గురించి మాత్రం మౌనం చరిత్ర గల భారత ప్రజానికం రవి అస్తమించని బహుళజాతి సంస్థల సామ్రాజ్య రథ చక్రాలకు ఎట్లా కట్టి వేయబడ్డారో గుర్తించడానికి నిరాకరిస్తోంది.

దేశ రాజకీయ చరిత్రను స్థూలంగానైనా సరిగానే గుర్తిస్తూ, 1947-67 ఒక దశగా, 1967 తర్వాత మరొక దశగా, ప్రస్తుతం సంధిదశగా వివరించిన లోక్‌సత్తా, ఈ అరవై సంవత్సరాల క్రమంలో భారత రాజకీయ వ్యవస్థ రాజ్యాంగ లక్ష్యాలకు ఎట్లా దూరమైపోయిందో, ప్రజాసంక్షేమాన్ని ఎట్లా విస్మరించిందో, ఆ క్రమంలో చట్టబద్ధ పాలనకు దూరమై, ఎంత దుర్మార్గమైన అణచివేతను ప్రజల మీద ప్రయోగిస్తున్నదో చూడలేకపోయింది. రాజ్యాంగయంత్రం అమలు చేస్తున్న అణచివేత పట్ల మౌనం వహించడమంటే యథాతథ స్థితిని ఆమోదించడమే. ఇక నూతన రాజకీయ సంస్కృతి గురించి మాట్లాడడానికి అర్థమేమి ఉండదు.

ఈ చర్చాపత్రం మీద సమాలోచనలు జరిపి పార్టీ ఏర్పాటు గురించి నిర్ణయం తీసుకున్నామని లోక్‌సత్తా నాయకులు ప్రకటించారు. ఆ సమాలోచనలలో చర్చా పత్రం మీద విమర్శలు, చేర్పులు, మార్పులు భాగమయ్యాయో లేదో తెలియదు గాని పార్టీ ఏర్పాటు ప్రకటన పత్రికా సమావేశంలో ప్రపంచ బ్యాంకు, పోలవరం, తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు వంటి విషయాలలో లోక్‌సత్తా నాయకులు తమ వైఖరిని, లేదా తమ గోడమీది పిల్లి వాటాన్ని స్పష్టం చేశారు.

ఆర్టీసీని ప్రైవేటీకరించాలని ప్రపంచబ్యాంకు చెపుతోందన్న వార్తలు నిజమే అయితే తాము వ్యతిరేకిస్తామని డా. జయప్రకాశ్ నారాయణ అన్నారు.'నిజమే అయితే' అని సన్నాయి నొక్కు నొక్కనవసరం లేదు. ప్రపంజ బ్యాంకు పత్రాలలో ఉండి స్పష్టంగా బయటబడిన విషయాల మీద ఈ శషభిషలెందుకు? 'ప్రపంచ బ్యాంకు రుణమైనా, మరొకటైనా మన ప్రయోజనాలే పరమావధిగా ఉండాలి' అంటున్నప్పుడు ప్రపంచ బ్యాంకు ఎందుకు ఏర్పడిందో, దాని పని ఏమిటో, అది ఎవరి ప్రయోజనాలు నెరవేర్చడానికి ఉందో లోక్‌సత్తా కు తెలియదనుకోవాలా?

మొత్తం మీద తెలుగు రాజకీయ రంగం మీదికి ఒక కొత్త రాజకీయ పక్షం రావడం, అది చాల ఆదర్శాలను ప్రకటిస్తూ రావడం ఆహ్వానించ దగిందే గాని ఆ రాజకీయ పక్షం ప్రకటిస్తున్న ఆదర్శాలలో అస్పష్టత, సందిగ్ధత అనుమానాలకే ఆస్కారం ఇస్తున్నాయి. ఇది కొత్త సీసా అని స్పష్టంగానే కనబడుతున్నది. గాని అందులో ఉన్నది పాత సారానే కావచ్చుననిపిస్తున్నది. అది కల్తీ సారానా మంచి సారానా అని కొందరు అనుమానిస్తుండగా, అసలు ప్రజలను ఇంకా మత్తులో ముంచే సారా కావాలా ('మద్యనిషేధం మార్గం కాదని దాదాపు అందరు అంగీకరిస్తారు' అని లోక్‌సత్తా తాను మద్య నిషేధం వైపులేనని స్పష్టంగానే చెప్పుకుంది!), బహుళ జాతి సంస్థల పురుగుల మందుల శీతల పానీయాలు కావాలా, మన మంచినీళ్లు మనకు చాలా ఆలోచించవలసి ఉంది. ◆

# ప్రత్యామ్నాయ ఉద్యమానికి కదులుతున్న తెలంగాణ

- నాగోబా

2004లో అసెంబ్లీకి, పార్లమెంటుకు ఎన్నికలు జరిగినపుడు తెలంగాణలో ప్రధాన ఎజెండాగా ఉన్నది ప్రత్యేకరాష్ట్ర అంశమే. ప్రత్యేక రాష్ట్ర నినాదానికి, సమైక్యవాదానికి మధ్య పోరులో సమైక్యవాదం, సమైక్యవాదాన్ని సమర్థించిన శక్తులు చిత్తుగా ఓడిపోయిన సంగతి అందరు ఎరిగినదే. తెలంగాణ ప్రజలు రెండోసారి బలంగా తమ ప్రత్యేకరాష్ట్ర ఆకాంక్షను వెల్లడించారు. రెండున్నర సంవత్సరాల కాలం గడిచిపోయింది. మొదట్లో కొంత పురోగతి సాధించినట్లు కనపడినా కాంగ్రెస్ ప్రజలకిచ్చిన వాగ్దానాలను నెరవేర్చడంలో దారితప్పింది. ఎన్నికల సమయంలో టిఆర్ఎస్‌తో పొత్తు పెట్టుకున్నప్పుడు మొదటి ఎస్ఆర్‌సి సిఫారసులను గౌరవిస్తామని స్పష్టంగా ప్రకటించింది. మొదటి ఎస్ఆర్‌సి హైదరాబాద్ రాష్ట్రం కొనసాగాలని సిఫారసు చేసింది. అంటే తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడడం తమకు సమ్మతమేనని కాంగ్రెస్ ప్రకటించినట్లేగదా! అందుకే తెలంగాణ అంశం యుపిఎ కామన్ మినిమం ప్రోగ్రాంలోకి చేరింది. రాష్ట్రపతి ప్రసంగంలోకి చేరింది. ఏకాభిప్రాయ సేకరణకు ప్రణబ్ కమిటీ ఏర్పాటయ్యింది. ఇవన్నీ చేసిన కాంగ్రెస్ తెలంగాణ పట్ల సానుకూల ధోరణితోనే ఉందన్న సంకేతాలు పంపింది. అయితే కాలం గడుస్తున్న కొద్దీ కాంగ్రెస్ నిజవైఖరి వెల్లడవుతూ వస్తున్నది. ప్రణబ్ కమిటి ఏకాభిప్రాయ సాధన పేరిట కాలాన్ని హరించివేస్తున్నదే తప్ప నివేదికను ఇచ్చేందుకు సిద్ధంగా లేదని స్పష్టమవుతున్నది. కొంతకాలం నెపాన్ని బిజెపి మీదకి నెట్టివేసింది. బిజెపి తెలంగాణపై తన వైఖరిని పునఃసమీక్షించుకుని తాము తెలంగాణ రాష్ట్రానికి అనుకూలమని, యుపిఎ ప్రభుత్వం తెలంగాణ బిల్లు ప్రవేశపెడితే తాము అనుకూలంగా ఓటు వేస్తామని తెలంగాణ గడ్డమీద ప్రకటించడం, ఆ తర్వాత ఢిల్లీలో పార్టీ కేంద్ర కార్యవర్గం తీర్మానం చేయడం జరిగిపోయింది. ప్రణబ్ కమిటి ఇక సాకుల కోసం వెతుక్కోవాల్సిన స్థితిలోకి వెళ్లిపోయింది. సిపిఎం వ్యతిరేకిస్తున్నదని, ముఖ్యమంత్రి వై ఎస్ వ్యతిరేకిస్తున్నాడని, కోస్తా ఆంధ్రా, రాయలసీమ ప్రజల అభిప్రాయాలను కూడా తెల్సుకోవాల్సి ఉందని చెపుతూ తెలంగాణపై ఇంకా ఏకాభిప్రాయం ఏర్పడలేదని, నివేదిక ఇచ్చే ప్రశ్నే ఉత్పన్నం కాదని ప్రణబ్ స్పష్టం చేసాడు. తెలంగాణ ఏర్పడాలా వద్దా అనే విషయంలో తెలంగాణ వ్యతిరేకుల అభిప్రాయం సహజంగానే వ్యతిరేకంగా ఉంటుంది. పైగా వారే మెజారిటీ గనుక తెలంగాణ ప్రజల మనోభావాలకు విలువ లేకుండా పోతుంది. ప్రణబ్ కమిటి అయినా మరొకరైనా ప్రధానంగా పరిశీలించవలసింది తెలంగాణ ప్రజల మనోభావాలను తెలంగాణ డిమాండ్‌కు ఉన్న చారిత్రక, ఆర్థిక నేపథ్యాన్ని, తెలంగాణకు ఒక రాష్ట్రంగా మనుగడ సాగించగల సామర్థ్యం అంటే ప్రకృతి వనరులు, మానవ నిర్మిత వనరులు, పన్నుల రూపేణ నిధులు సమకూర్చుకునే అవకాశాలున్నాయా అన్న విషయాలనే తప్ప తెలంగాణతో ఏ సంబంధంలేని వారితో, తెలంగాణ వ్యతిరేకులతో సంప్రదించడం కాదు. ఇట్లా రకరకాల సాకులు వెదకి ప్రణబ్ కమిటి తాత్సారం చేస్తున్న సందర్భం ఇది.

మరోవైపు కాంగ్రెస్‌ని, సోనియాగాంధీని నమ్ముకుని టిఆర్ఎస్ రెండున్నర ఏళ్లలో కావల్సినంత అపకీర్తిని, ప్రజల అవిశ్వాసాన్ని మూటగట్టుకున్నది. తెలంగాణ కాంగ్రెస్ నాయకులు ఆంధ్రా పాలకవర్గంతో కుమ్మక్కై కాంట్రాక్టులు పొందుతూ, భూముల అమ్మకాలతో తలమునకలై తరించిపోతున్నారు. మంత్రి పదవులకోసం, ఛైర్మన్ పదవులకోసం, ఎమ్మెల్సీల కోసం అర్రులు చాస్తూ ఎన్నికలలో, అంతకుముందూ తెలంగాణ ప్రజల ముందు చేసిన వాగ్దానాలను నిస్సంకోచంగా మర్చిపోతున్నారు. తెలంగాణ సాధనకోసం ఉద్యమాలు చేపట్టవల్సిన టిఆర్ఎస్ నిర్వీర్యం కావడం, అధిష్ఠానంపై ఒత్తిడిపెంచి కేంద్రం తెలంగాణ అనుకూల నిర్ణయం చేసేలాగా టిఆర్ఎస్ కార్యక్రమాలు తీసుకోకపోవడంతో తెలంగాణ డిమాండుతో ఏ ఉద్యమం లేదనే భ్రమలు కలుగడం సహజమే. రాజకీయ కార్యాచరణ సన్నగిల్లినప్పటికీ ఈ రెండేళ్లలో తెలంగాణ అంతటా వందలాది సదస్సులు, సభలు వేలాదిమందితో జరిగినవి. వీటిద్వారా తెలంగాణ భావవ్యాప్తి జర్గింది. వైఎస్ ప్రభుత్వం తీసుకుంటున్న తెలంగాణ వ్యతిరేక నిర్ణయాలను ప్రజల్లోకి తీసుకుపోగలిగినాయి. ముఖ్యంగా 610 జి.వో. అమలులో నిర్లక్ష్యంపై, 610 జీవోను భూస్థాపితం చేసే జీవోపై, గిర్‌గ్లానీ సిఫారసుల అమలుకోసం, ప్రతీ నిత్యమూ జరుగుతున్న రాష్ట్రపతి ఉత్తర్వుల ఉల్లంఘనలపై, స్థానిక రిజర్వేషన్లను, సామాజిక రిజర్వేషన్లను తుంగలో తొక్కి 'అవుట్‌సోర్సింగ్' ద్వారా జరుగుతున్న నియామకాలకు వ్యతిరేకంగా తెలంగాణ ఉద్యోగ సంఘాలు దాదాపు అన్ని జిల్లాలలో బ్రహ్మాండమైన సదస్సులు నిర్వహించినాయి. రౌండ్ టేబుల్ సమావేశాలు నిర్వహించాయి. వాటి ఒత్తిడి ఫలితంగా జీవో 72 మొదట వాయిదా పడి ఆ తర్వాత ఇటీవలే రద్దయ్యింది.

పులిచింతల, పోలవరం, పోతిరెడ్డిపాడు రెగ్యులేటర్ పథకాలు ఏ విధంగా తెలంగాణ నీటి వనరులను కొల్లగొట్టనున్నాయో తెలంగాణ ప్రజాసంఘాలు విస్తృత స్థాయిలో ప్రచారం చేయగలిగినారు. న్యాయపోరాటం ద్వారా పోలవరం ప్రాజెక్టును నిలిపివేయించడంలో విజయం సాధించారు.

తెలంగాణ భాషా సాంస్కృతిక అంశాలపై కూడా ఒక బలమైన గొంతుతో ప్రతిఘటన వెల్లువెత్తింది. సాంస్కృతిక పునరుజ్జీవన స్పృహను ప్రజల్లోకి తీసుకువెళ్లడంలో తెలంగాణ రచయితలు, కవులు, కళాకారుల అపూర్వమైన కృషి సత్ఫలితాలను ఇచ్చింది. రాజకీయాలు ఏవైనా, సిద్ధాంతాలు ఏవైనా వారందరిని సంస్కృతి ఐక్యం చేయగల్గుతుందన్న స్పృహ ఇవ్వాల్టి సాంస్కృతిక ఉద్యమానికి ఉన్నది. అయితే హోలీ సందర్భంగా ఉస్మానియా యూనివర్సిటీలో 'కోలాటం' ప్రదర్శనపై దాడి జరిగినపుడు అది అనుభవంలోకి వచ్చింది. ఆనాడు తెలంగాణ

సాంస్కృతిక హక్కులపై జరిగిన దాడికి వ్యతిరేకంగా తెలంగాణ వ్యాప్తంగా వెల్లువెత్తిన నిరసనలు, ఎగిసిన ఆగ్రహజ్వాలలు ప్రజల్లో తెలంగాణ ఆకాంక్ష ఎంత ప్రబలంగా ఉన్నదో తెల్పివచ్చింది. ప్రజలను సాంస్కృతికంగా ఐక్యం చెయ్యొచ్చునన్న అంశం అనుభవంలోకి వచ్చింది. తెలంగాణ రాజకీయ శక్తుల పునరేకీకరణకు సంస్కృతి ఒక మాధ్యమంగా ఒక ప్రబలమైన శక్తిగా ఉపయోగపడగలదన్న విశ్వాసం తెలంగాణ ఉద్యమకారులకు కలిగింది.

రెండున్నరేళ్లలో జరిగిన రాజకీయ పరిణామాలు, తెలంగాణ ప్రజా సంఘాల, రచయితల, కవుల, కళాకారుల, మేధావుల కృషి మొదలగు అంశాలన్నీ విశ్లేషించుకున్నపుడు 1. ఉద్యమాన్ని ద్రోహానికి గురికాకుండా రక్షించుకోవడం, 2. ఉద్యమాన్ని ఐక్యంగా నిర్మించి కేంద్రంపై ఒత్తిడి పెంచడం 3. ప్రధాన రాజకీయ పార్టీలకు సమాంతరంగా తెలంగాణ రాష్ట్ర సాధనకోసమే పనిచేసే ప్రత్యామ్నాయ రాజకీయ శక్తిని తయారుచేయడం అనే అంశాలు ఇటీవలి కాలంలో చర్చనీయాంశాలయినాయి. ఇటీవలికాలంలో చర్చలు, రౌండ్‌టేబుల్ సమావేశాలు, సదస్సులు కూడా నిర్వహించబడినాయి. వీటి ఫలితంగా ఉద్యోగుల మధ్య, కళాకారుల మధ్య ఐక్యత సాధ్యమైంది. ఇన్నేళ్లుగా తెలంగాణ ఉద్యోగుల సమస్యలపై కదలకుండా ఉన్న టిఎన్జీవోలు ముందుకు వచ్చి తెలంగాణ ఉద్యోగ ఉపాధ్యాయ కార్మికుల ఐక్య కార్యాచరణ కమిటి నిర్మాణానికి చేయూతనిచ్చింది. జిల్లా స్థాయిలో సదస్సులు నిర్వహించి వేలాదిమంది ఎన్జీవోలను కదిలించింది. గత 5 ఏళ్లుగా తెలంగాణ ఉద్యోగుల సమస్యలపై రాజీలేని పోరాటం చేస్తున్న తెలంగాణ ఉద్యోగుల సంఘం టిఎన్జీవోలతో చేతులు కలిపింది. 52 సంఘాలతో ఏర్పాటైన తెలంగాణ జెఎసి పాలకవర్గాలలో ప్రకంపనాలు రేపుతున్నది.

సాంస్కృతిక ఉద్యమాన్ని బలోపేతం చేసేందుకు, తెలంగాణ ప్రజలను సాంస్కృతికంగా ఐక్యం చేసేందుకు, తెలంగాణ ప్రజల్లో ఉద్యమ స్ఫూర్తిని కలుగచేసేందుకు, తెలంగాణ కవులు, కళాకారులు రచయితలు గద్దర్ నేతృత్వంలో 'తెలంగాణ ధూంధాం కమిటి'గా ఏర్పడి కార్యక్రమాలకు నడుం బిగించింది. మే నెలలో హైదరాబాద్‌లో, జూన్ నెలలో ఆదిలాబాద్ జిల్లా మంచిర్యాలలో 'తెలంగాణ ధూం ధాం' కార్యక్రమాలను అపూర్వంగా నిర్వహించింది. వేలాదిమంది హాజరై తెలంగాణ సాంస్కృతిక వైభవాన్ని చూసి పులకించిపోయారు. జూలై నెలలో 'మైసమ్మతల్లికి బోనాలు - అమరవీరులకు దీపాలు' కార్యక్రమం నిర్వహించి రాజకీయంగా, సైద్ధాంతికంగా భిన్నధృవాలైన రాజకీయ నాయకులను ఒక వేదికమీదకి తీసుకువచ్చి తెలంగాణ అమరవీరులకు జోహార్లు చెప్పించింది.

ఇదిట్లా ఉండగానే ఉద్యోగుల, కళాకారుల మధ్య ఏర్పడిన ఐక్యత నుండి స్ఫూర్తిని పొంది 20కి పైగా, తెలంగాణ ప్రజా సంఘాలు ఏకమై 'తెలంగాణ ఐక్య కార్యాచరణ కమిటి'గా ఏర్పడి ఉద్యమ కార్యాచరణ రూపొందించుకుంటున్నాయి. తెలంగాణ రాష్ట్ర సాధనకోసం, 610 జీవో అమలుకోసం, పోలవరం, పులిచింతల, పోతిరెడ్డిపాడు ప్రాజెక్టుల నిలిపివేత కోసం, హైదరాబాద్ భూముల వేలం పాటలు నిలిపివేయడం కోసం డిమాండ్ చేస్తూ ఆగస్టు 21న ర్యాలీ, ధర్నాలకు పిలుపిచ్చింది.

ఇట్లా తెలంగాణలోని అన్ని సెక్షన్ల ప్రజలు ప్రత్యామ్నాయ ఉద్యమాన్ని నిర్మించే దిశగా కదులుతున్నారు. ఈ ఉద్యమంలో విద్యార్థులు కూడా భాగస్వాములు అయ్యేందుకు సమాయత్తమవుతున్నారు. సెప్టెంబర్ 17న ఉస్మానియా యూనివర్సిటీ కాంపస్‌లో పెద్దఎత్తున వేలాదిమంది విద్యార్థులతో విద్యార్థి ధూంధాం కార్యక్రమానికి రూపకల్పన జరిగింది. దాంతో విద్యార్థులు తెలంగాణా ఉద్యమంలో భాగస్వాములు కాబోతున్నారు. తెలంగాణ విద్యార్థి సంఘం ఆవిర్భావం కూడా జరగబోతున్నది. ఇది ఇటీవలి తెలంగాణ రాజకీయాలలో సంభవించిన నూతన పరిణామంగా చెప్పుకోవచ్చు. ఈ ప్రత్యామ్నాయ ఉద్యమాలవల్ల ఉద్యమంలోకి యువకులు, విద్యార్థులు, ఉద్యోగులు మొదలగు సెక్షన్లనుండి కొత్త నాయకత్వం ఎదిగివచ్చే అవకాశాలున్నాయి. ఈ కదలికలు ఇప్పటికే పాలక పార్టీలను కంపింపజేస్తున్నాయి. ముఖ్యంగా టిఆర్ఎస్ తన రాజకీయ భవితవ్యాన్ని తేల్చుకునేందుకు తీవ్ర ఒత్తిడికి గురిచేసింది. టిఆర్ఎస్ మళ్లీ ఉద్యమంలోకి వస్తే ఉద్యమానికి, పార్టీకి మేలు జరుగుతుంది. లేకుంటే తెలంగాణ ప్రజల ఆగ్రహానికి గురికాక తప్పదు.

అయితే ప్రజలు ప్రత్యామ్నాయాలు సృష్టించుకుంటారు. ముందుకు కదులుతారు. తమ గమ్యాన్ని చేరుకుంటారు. తమ ప్రజాస్వామిక ఆకాంక్షను సాకారం చేసుకుంటారు. ◆

## రచయితలకు సూచన

**ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడ అంతే. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.**

- సంపాదకులు

## చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. అంటే ఏ నెల సంచిక ఆ నెల మొదటి వారానికల్లా పాఠకులకు చేరుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారం లోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

- సర్క్యులేషన్ మేనేజర్

# జి.వో. నెం.5 రద్దుతో సమస్య తీరినట్లేనా?

- పి. నిర్మల్

ప్రపంచబ్యాంకు, ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ అంటే తమకు ఎంతో వ్యతిరేకత ఉందని, తమ జీవితాలను చిన్నాభిన్నం చేసే కుయుక్తులను అంగీకరించమని, వాటికి వ్యతిరేకంగా పోరాడతామని రాష్ట్ర ప్రజలు మరో మారు నిరూపించారు. నిజానికి జి వో నెం. 5 ప్రభుత్వ రంగ సంస్థల ఉద్యోగులకు సంబంధించిన అంశమే అయినా దానికి వ్యతిరేకంగా ప్రజల్లో విశాల సంఘీభావం కనిపించింది. ప్రపంచబ్యాంకు దుష్ఫలితాలు అనుభవంలోకి వచ్చిన ప్రజలు అది ఎక్కడ, ఏ రూపంలో అడుగుపెట్టినా తమ నిరసనను ప్రకటిస్తున్నారు. విద్యుత్ రంగ సంస్కరణల ఫలితంగా భారం మోస్తున్న ప్రజలు ప్రపంచ బ్యాంకు అసలు స్వరూపాన్ని తెలుసుకున్నారు. విద్యుత్ రంగంలో సంస్కరణలు వచ్చే క్రమంలో ప్రపంచ బ్యాంకు పాత్రపై విస్తృత చర్చ జరిగింది. దాని స్వరూప స్వభావాలు, అప్పు వల్ల దారి తీసే పరిణామాలు, అది విధించే షరతులు, ఫలితంగా వచ్చే సంస్కరణలతో ప్రజలపై పడే భారం గురించి ఎంతో చర్చ జరిగింది. తరువాత ఆచరణలో ప్రపంచ బ్యాంకు ఒక విషవలయమని ప్రజలకు అర్థమైంది. విద్యుత్ రంగంలోనే కాదు అనేక ఇతర రంగాల్లో కూడా అది అడుగుపెట్టింది. ఫలితంగా సంభవించే ప్రతికూల పరిణామాలతో ప్రజలు ఇబ్బందులు పడుతూనే ఉన్నారు. ఇలాంటి దశలో గుట్టు చప్పుడు కాకుండా ప్రభుత్వం జారీ చేసిన జి వో నెం. 5 పట్ల సహజంగానే భారీ నిరసన వ్యక్తమయ్యింది. ఉద్యోగ వర్గాల ఆగ్రహం ఎట్లా ఉంటుందో గత అసెంబ్లీ ఎన్నికల్లో ప్రత్యక్షంగా చూసి, ప్రయోజనాన్ని అనుభవిస్తున్న వై ఎస్ రాజశేఖర్ రెడ్డి ప్రభుత్వం అతి కష్టం మీద దాన్ని ఉపసంహరించుకుంది. ప్రజల్లో వ్యతిరేకమైన నిరసనను జీర్ణించుకోవడానికి వాళ్లకు చాలా సమయమే పట్టింది.

రహస్యంగా జారీ అయిన ఈ జివో ఉత్తుత్తిదేననీ, ఉద్యోగులను భయపెట్టడానికే విడుదల చేశామనీ, ఎన్నో జివోలిస్తాం, అన్నీ అమలు చేస్తామా అనీ ముఖ్యమంత్రి వై ఎస్ రాజశేఖర్‌రెడ్డి, ఆర్థిక మంత్రి కె.రోశయ్యలు తేలుకుట్టిన దొంగల్లా మాట్లాడి అపహాస్యం పాలయ్యారు. తమ ప్రభుత్వ పని తీరును తామే స్వయంగా నవ్వుల పాలు చేసుకున్నారు. తొలుత 'సరదా'కు జారీ చేశామన్నట్లు మాట్లాడి ఆ తరువాత ప్రతిపక్షాలు, ఉద్యోగ వర్గాల్లోని నిరసనను చూసి తాత్కాలికంగా నిలిపివేశారు. సవరణలు చేస్తామన్నారు. అయినా నిరసన జ్వాలలు మరింత ఉధృతమవుతున్నాయని గమనించి ముక్కుతూ మూల్గుతూ జివోను వెనక్కు తీసుకోవాల్సిన పరిస్థితిలో పడ్డారు. అప్పటికీ 'సంస్కరణలు ఆగవు' అనడం ద్వారా ప్రపంచబ్యాంకుకు తాము దాసులమే అని చెప్పకనే చెప్పుకున్నారు. ఇదీ వై ఎస్ ప్రభుత్వం అధికారంలోకి వచ్చాక అత్యంత బహిరంగంగా చాటుకున్న ప్రపంచబ్యాంకు అనుకూలత.

చంద్రబాబు నాయుడు ఆధ్వర్యంలోని గత ప్రభుత్వం ప్రపంచబ్యాంక్‌కు ఏజెంట్‌గా పని చేస్తోందని ప్రస్తుత ప్రభుత్వం, నాటి ప్రతిపక్షం ఎన్నో సార్లు విమర్శించింది. చంద్రబాబునాయుడు అధికారంలో ఉన్నప్పుడు తొలి దశలో ప్రపంచ బ్యాంకును, దాన్ని అప్పును, షరతులను, విధానాలను బహిరంగంగానే సమర్థించి, ఆ తరువాత ప్రజా వ్యతిరేకతను దృష్టిలో పెట్టుకొని రహస్యంగా వాటిని అమలు చేయడం ప్రారంభించారు. అయితే ఆచరణలో ఫలితాలు ఆయన పని తీరును పట్టి ఇస్తుంది కాబట్టి ప్రజలు సులభంగానే అసలు స్వరూపాన్ని అర్థం చేసుకోగలిగారు. అంతేకాదు దాని ప్రతికూల ప్రభావాలను స్వయంగా అనుభవించారు, ఉద్యోగాలు ఉపాధి కోల్పోయారు, రోడ్లపై పడ్డారు, అదనపు భారాలు మోసారు. ఈ ప్రజా వ్యతిరేక విధానాలు ఎన్నికల్లో ప్రతిబింబించాయి. ఫలితంగా ఆయన ఓడిపోయారు. ఉద్యోగులు తనకు వ్యతిరేకంగా పని చేశారని చంద్రబాబునాయుడే స్వయంగా ఆరోపించారు, అంగీకరించారు. వ్యతిరేకత వల్ల ప్రయోజనం పొందిన వై ఎస్ రాజశేఖర్ రెడ్డికి ఈ విషయం తెలుసు. అందుకే తొలి రోజుల్లో రైతు బాంధవునిగా, ఉద్యోగుల సంక్షేమార్థిగా కనిపించే ప్రయత్నం చేశారు. కానీ, అసలు స్వరూపం నెమ్మదిగా బయటపెట్టుకున్నారు. అదీ కూడా అత్యంత అపహాస్యం పాలయ్యే రీతిలో. మరో రకంగా ఏ ప్రభుత్వం వచ్చినా ప్రపంచబ్యాంక్‌కు తలొగ్గి తీరాల్సిన పరిస్థితిని కూడా చెప్పకనే చెప్పారు. ప్రభుత్వాలు ప్రపంచబ్యాంక్‌ను ఎదిరించలేని, నిరోధించలేని, కట్టడి చేయలేని దుస్థితిలో ఉన్నాయని నిరూపించారు. స్వార్థంతో పని చేసే పాలకులకైతే వాళ్లతో విరోధమే అవసరం లేదు, స్నేహమే వాళ్లకు శ్రీరామ రక్ష, కాసుల పంట.

**జివో నెం.5 కథాకమామీషు...**

ప్రభుత్వాన్ని అభాసుపాలు చేసిన జివో నెం. 5 జులై 18న వెలువడింది. రహస్యంగా విడుదల చేసిన ఈ జివో గుట్టును సిపిఎం రాష్ట్ర శాఖ కార్యదర్శి జులై 30వ తేదీన ఢిల్లీలో రట్టు చేశారు. మార్చి 25నాటి ఆర్థిక శాఖ అనుమతి మేరకు 'ప్రభుత్వ రంగ సంస్థల పునర్వ్యవస్థీకరణ'పై 70 పేజీల సుదీర్ఘ జివోను ఇంప్లిమెంటేషన్ సెక్రటేరియేట్ విడుదల చేసింది. ఇది ప్రపంచ బ్యాంకు షరతుల మేరకే జరిగిందని జివోను చూస్తే స్పష్టంగా అర్థమవుతుంది. గత ప్రభుత్వం ప్రపంచబ్యాంకుతో చేసిన దోస్తీలో భాగంగా విడుదలైన 'ఆర్థిక పునర్నిర్మాణ ప్రాజెక్టు పథకం'లో ప్రభుత్వరంగ సంస్థల ప్రైవేటీకరణ, ఉద్యోగుల తొలగింపు గురించి స్పష్టంగా ఉంది. ప్రపంచ బ్యాంకు మూడు దశల్లో అమలు చేయాలని చెప్పిన కార్యాచరణ గురించీ ఉంది. వాటికి నిర్దేశిత కాలపరిమితి ఉంది. మొదటి, రెండవ దశలను చంద్రబాబునాయుడు అమలుపరిస్తే, మూడవ...చివరి దశలను వై ఎస్ రాజశేఖర్‌రెడ్డి ప్రభుత్వం అమలు పరచాలని సంకల్పించింది. అందులో భాగంగానే ఈ జివో. మొత్తం 64,207 మంది ప్రభుత్వరంగ

ఉద్యోగులను 2009వ సంవత్సరం వరకు దశల వారిగా తొలగించాలని నిర్ణయించారు.

- 2006-07 ఆర్థిక సంవత్సరంలో తొమ్మిది సంస్థలకు చెందిన 36,273 మంది సిబ్బందిని, 2007-08లో 1327 మంది సిబ్బందిని, 2008-09లో 26,597 మందిని తొలగొంచాలని జివోలో పేర్కొన్నారు.
- రాష్ట్రంలోని ప్రభుత్వ రంగ సంస్థల్లో 2,14,024 మంది ఉండగా, అందులో 64,207 మంది అదనంగా ఉన్నారని, ఈ అదనపు సిబ్బందిని తొలగించాలని నిర్ణయించారు.
- ఈ తొలగింపుకు 1284 కోట్ల రూపాయలు స్వచ్ఛంద పదవీ విరమణ పథకం కోసం ఖర్చు పెట్టాలని నిర్ణయించారు.
- మొత్తం ఉద్యోగుల్లో మెజారిటీ ఆర్టీసి, సింగరేణిలది. ఆర్టీసిలో 34,784 వేల మంది, సింగరేణిలో 25,808 మంది అదనపు ఉద్యోగులున్నట్లు జివో పేర్కొంది.
- ఆర్టీసి సిబ్బందిని తొలి దశలో (2006-07), సింగరేణి సిబ్బందిని తుది దశలో (2008-09) తొలగించాలని నిర్ణయం.
- రానున్న మూడేళ్లలో 43 ప్రభుత్వ రంగ, సహకార సంస్థల్లోని 30 శాతం సిబ్బందిని తొలగించాలని నిర్ణయించినట్లు జివో చెబుతోంది.
- ఈ పని కోసం నెలకు 75 వేల రూపాయల జీతంతో కన్సల్టెంట్లను నియమించాలని జివోలో పేర్కొన్నారు.

**చంద్రబాబు నాయుడు హయాంలో సంస్కరణలు..**

- తొలి దశలో 19 ప్రభుత్వ రంగ సంస్థల్లో సంస్కరణలు అమలు చేసింది.
- రెండో దశలో 68 సంస్థల్లో అమలు చేసింది.
- ఈ రెండు దశల్లో భాగంగా 12 సంస్థలను ప్రైవేటు రంగానికి అమ్మేసారు. 24 సంస్థలను మూసి వేశారు. 32 సంస్థలను పునర్‌వ్యవస్థీకరించారు. మరో 9 సంస్థల వాటాలను విక్రయించారు.
- సిబ్బంది ఉద్వాసనకు 350 కోట్లు ఖర్చు పెట్టారు.
- తొమ్మిదేళ్ల పాలనలో 23 వేల మంది ఉద్యోగులపై వేటు వేశారు.

**అంతా చేసి పైగా విమర్శలు..**

ప్రభుత్వ రంగ సంస్థల్లో సిబ్బందిని తొలగించడానికి శ్రీకారం చుట్టిన తెలుగు దేశం ప్రభుత్వం ఇపుడు వై ఎస్ రాజశేఖర్ రెడ్డి ప్రభుత్వాన్ని విమర్శిస్తోంది. గతంలో చంద్రబాబునాయుడును కాంగ్రెస్ నాయకులు ప్రపంచ బ్యాంకు ఏజెంట్ అని పిలిస్తే, ఇపుడు తెలుగు దేశం నాయకులు వై ఎస్ రాజశేఖర్ రెడ్డి ప్రపంచ బ్యాంకుకు దాసోహం అంటున్నాడని విమర్శిస్తున్నారు. ప్రజలు ద్వంద్వ వైఖరిని చూసి నవ్వు కుంటున్నారన్న విషయం కూడా వాళ్లు గమనించడం లేదు. ఎవరు ప్రారంభించిన సంస్కరణలను ఎవరు కొనసాగిస్తున్నారనే విషయాన్ని గుర్తించలేనంత అజ్ఞానంలో ప్రజలు ఉన్నారనే అంధకార భావనతో మన ప్రజాప్రతినిధులు, రాజకీయ నాయకులు ఉన్నారు.

**ఉపసంహరణతో సిబ్బంది తొలగింపు ఆగేనా?..**

నిస్సందేహంగా ఆగదనే చెప్పొచ్చు. ప్రపంచ బ్యాంకు అప్పు కోసం వై ఎస్ రాజశేఖర్‌రెడ్డి ప్రభుత్వం ఎప్పుడో దరఖాస్తు పెట్టుకొంది. 7,800 కోట్లు కావాలని అడిగింది. గత అప్పులకు షరతుగా విధించిన సంస్కరణలను అమలు చేయకపోతే కొత్త అప్పులు పుడతాయా? ప్రపంచ బ్యాంకుకు విశ్వసనీయతను ప్రకటించుకోకపోతే వై ఎస్ ప్రభుత్వానికి అప్పు ఇస్తారా? అందుకే జివోను తాత్కాలికంగా రద్దు చేసినా సిబ్బంది తొలగింపు ఏదో రూపంలో అమలు చేసి తీరతారనే చెప్పవచ్చు. రద్దు నిర్ణయం తీసుకున్న మరుక్షణంలోనే ప్రభుత్వం సంస్కరణలను ఆపదని స్పష్టంగా తేల్చి చెప్పడమే ఇందుకు బలం. కాబట్టి ఉద్యోగ, కార్మిక వర్గాలు ఆందోళనలకు సిద్ధంగా ఉండక తప్పదు. ప్రభుత్వాలు మారినా పాలకుల విధానాలు మారవని ఇప్పటికైనా అర్థం చేసుకోవాలి. ◆

# సంస్కరణల ప్రభావమే పెరుగుతున్న ధరలు !

-విద్యాభూషణ్

ఆ మధ్య పెట్రోధరల పెంపును నిరసిస్తూ, వామపక్షాలు ధర్నాను నిర్వహించాయి. ఆ సందర్భంగా, దారినపోతున్న ఓ సాధారణ మహిళ, 'పెట్రోలు ధరలు పెరిగినందుకు వీళ్లంతా యింత గగ్గోలు పెడుతున్నారు. నిత్యం వాడుకునే పప్పుల ధరలు ఎంతపెరిగినా, సీ(చీ)మ కుట్టినట్లైనా వుండదు వీరికి' అని సణుక్కుంటూ విసవిసా నడిచి వెళ్లిపోయింది. అది చెవిన పడ్డ నాకు, ఈ సామాన్య సణుగుడు వాస్తవమే కదా అన్పించింది. ఆలోచింపచేసింది. ధరవరలు పెరిగిపోతున్నాయ్.. వేతనాలను పెంచమంటూ వేతన సవరణ కమీషన్ల (పిఆర్‌సి)ను ఏర్పాటు చేయమని ఆందోళనలు చేస్తుంటారు, సంబంధిత ఉద్యమ నేతలు. చివరకు బేరసారాలతో పదిశాతమో, పన్నెండు శాతమో వేతన పెరుగుదలను ప్రభుత్వం ప్రకటిస్తుంది. ఈ ప్రతిపాదనలు అమలయ్యే నాటికి, మళ్లీ ఏ సాధారణ ఎన్నికలో రావాలి. అప్పటివరకూ తాత్సారాలతో అలా కాలం గడిచిపోతుంది. ఈ ప్రహసనం అంతా కేవలం ప్రభుత్వ రంగ సంస్థలకో, ప్రభుత్వోద్యోగులకో మాత్రమే. అదే, ప్రైవేటురంగ కార్మికులకైతే, కనీసవేతనాలను సవరించేసి ఉత్తర్వులు జారీ చేయడంతో ప్రభుత్వం చేతులు దులిపేసుకుంటుంది. మళ్లీ ఆ ఉత్తర్వుల అమలుకు ఎన్నో ఏళ్లు ఆందోళనలు చేపట్టినా, అవి అమలుకు నోచుకోకపోయినా పట్టించుకున్న నాథుడే వుండడు. ఈ తరహా ప్రహసనానికి, రాజధాని నగరంలో బీడి కార్మికుల ఆందోళనలే మనకు ప్రత్యక్ష ఉదాహరణ. అధిక ధరల నియంత్రణలో ప్రభుత్వం యిలా చేష్టలుడిగి, ప్రేక్షకపాత్ర వహించడానికి కారణం ఏంటి?

**నేపథ్యం :**

ఆకాశాన్నంటుతున్న పప్పు దినుసుల ధరవరలను పరిశీలిస్తే :

**రాష్ట్రంలో పప్పు దినుసుల సాగు**

*(లక్షల హెక్టార్లలో)*

| పంటపేరు | 2004-05 | 2005-06 |
|---|---|---|
| శనగపంట | 3.41 | 4.21 |
| కందిపంట | 4.82 | 5.78 |
| పెసర్లు | 4.54 | 3.78 |
| మినుము | 4.27 | 4.27 |

*దిగుబడి (లక్షల టన్నుల్లో)*

| పంటపేరు | 2004-05 | 2005-06 |
|---|---|---|
| శనగ | 3.45 | 4.69 |
| కంది | 2.19 | 3.07 |
| పెసర్లు | 1.06 | 1.96 |
| మినుము | 2.59 | 2.83 |

*ధరలు (కిలోకు రూపాయల్లో)*

| పప్పులు | 2005 | 2006 |
|---|---|---|
| మినప పప్పు | 28 | 53 |
| పెసర పప్పు | 30 | 52 |
| శనగ పప్పు | 30 | 38 |
| కంది పప్పు | 29 | 36 |

ఒక సంవత్సర కాలంలో నిత్యం సామాన్యులు వినియోగించే పప్పుదినుసుల ధరలు 25 శాతం నుంచి 85 శాతం మేరకు పెరిగిన వాస్తవాన్ని గుర్తించవచ్చు. వేతన సవరణలుగానీ, కరవు భత్య పెంపుదలలుగానీ, ఈ ధరల పెరుగుదలకు సాటి కాగలవా? యిటీవల రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల వేతన సవరణనే పరిగణనలోకి తీసుకుంటే, ప్రభుత్వం 10 శాతం నుంచి 12 శాతానికి పెంచేందుకే హరిహరాదులు దిగొచ్చిన సంగతి మనకి తెలిసిందే! పెరుగుతున్న ధరల పోటీలో ఈ ఉద్యోగ వర్గాలు లబ్ది పొందినదెంత? మరో వేతన సవరణ నాటికి ఈ ధరలు యింకెంత స్థాయిలో పెరగనున్నాయన్నది ఊహకే అందనిది.

పైన పేర్కొన్న గణాంక వివరాలను పరిశీలిస్తే పంట విస్తీర్ణం కొద్దిమేరకు తగ్గినా, ఉత్పత్తి లో పెరుగుదల కన్పిస్తుంది. పెసరపంట విస్తీర్ణం 17 శాతం మేరకు తగ్గి, మినుము పంట విస్తీర్ణం లో మార్పు లేనప్పటికీ - పప్పుదినుసు దిగుబడిలో మాత్రం 33 శాతం పెరుగుదల నమోదయింది. మరి ఉత్పత్తుల అమ్మకం ధరలు చుక్కలనంటుతున్నా, రైతులకు చేరిన గిట్టుబాటు ధరలను పరికిస్తే.. గత సంవత్సరం పెసలు గిట్టుబాటు క్వింటాలుకు రు.1570 నుంచి 1600 ల మేరకే ఉండగా, ఈ సంవత్సరం రు.2300 - 2400 మాత్రమే. మినుములైతే గత సంవత్సరం క్వింటాలుకు రు.1660-1700 పలకగా, ఈ సంవత్సరం రు.2300-2400 లకు అమ్ముడయ్యాయి. అదే ముడిసరుకు వ్యాపార వర్గాలకు చేరేటప్పటికి పెసలు క్వింటాలకు రు.5,200, మినపప్పు రు.4500-5000 వరకూ ధర పలుకుతున్నట్లు వాణిజ్య వర్గాలు పేర్కొంటున్నాయి. యివి హోల్‌సేల్ ధరలు. ఇక రిటైలు వర్తకుల ద్వారా అవి వినియోగదారులకు చేరేటప్పటికీ మరో పదిహేను శాతం పెరగడం తథ్యం.

వాణిజ్యంలో ఆన్‌లైన్ మార్కెటింగ్ విధానం అమలయ్యే నాటినుంచి, ధరల పెరుగుదల-తగ్గుదలను తామే ఊహించలేకున్నామని వాణిజ్య వర్గాలు పేర్కొంటున్నాయి. దీంతో చిన్నాచితకా వ్యాపారులు మార్కెట్లలో నిలవలేని పరిస్థితి వుంది. అంటే స్వేచ్ఛా మార్కెట్ పేరిట చేపడుతున్న సంస్కరణలు పెద్ద పెద్ద వాణిజ్య వర్గాలకే అనుకూలమయి, సరుకును తాము కోరుకున్న చోటుకు తరలిస్తూ, ధరలను నిర్దేశిస్తున్నారన్న మాట. ఇటీవల చోటుచేసుకున్న బర్డ్‌ఫ్లూ భయం, పప్పుదినుసుల

వినియోగాన్ని మరింత పెంచేయడం ద్వారా డిమాండు పెరిగిందనీ, అలాగే తమిళనాడు, మధ్యప్రదేశ్, గుజరాత్, రాజస్థాన్, మహారాష్ట్ర, కేరళల్లో పప్పుదినుసుల ఉత్పత్తులు వర్షాలు-వరదల కారణంగా తగ్గిపోవడంతో యిక్కడి సరుకు ఆయా రాష్ట్రాలకు ఎగుమతి కావడం, ధరల పెరుగుదలకు మరో కారణమని వ్యాపారస్తులు అంటున్నారు. ధరల నియంత్రణా యంత్రాంగం ప్రత్యేకించి లేనందున ధరల అదుపు మంచు కొండే ! ఒకవేళ ప్రభుత్వం అందుకు సాహసించినా, వాణిజ్యవర్గాలు తగు సమధానాన్ని యివ్వగలవు.

**ధరల పెరుగుదలకు కారణాలు :**

ఈ నేపథ్యంలో మనకు అవగతమైన అంశాలు వాణిజ్యవర్గాలకు బ్యాంకుల పరపతి పెరిగి, రైతాంగానికొచ్చేసరికి బ్యాంకుల పరపతి తగ్గి, సేద్యంలో వ్యయం పెరగడంతో పప్పు ధాన్యాల సేద్యపు విస్తీర్ణం తగ్గుతూ వస్తోంది. ఇందుకు సైదోడుగా ప్రభుత్వ ప్రోత్సాహం (ఉద్యానవన సేద్యానికిచ్చే తరహాలో) కొరవడి డిమాండుకు తగ్గ ఉత్పత్తి లేదన్నది మరోకారణం. ఆహార దినుసుల ఉత్పత్తిలో రాయితీల కోత (సంస్కరణల విధాన ఫలితంగా) విధింపుకు గురై దిగుబడి వ్యయం పెరుగుతుంది. ప్రభుత్వాలు తలకెత్తుకున్న ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్ల్యుటివో) ఒప్పందాలమేరకు దిగుమతులు పెరగడంతో గిట్టుబాటు కాని పప్పుదినుసుల సేద్యం అటకెక్కుతోంది. ఈ కారణంగా డిమాండు కు తగ్గ ఉత్పత్తి రావడం లేదు. యిదే ప్రపంచ వాణిజ్య సంస్థ ఒప్పందాల్లో ఆహారధాన్యాల్లో నిర్ణీత శాతం మేరకు కచ్చితంగా దిగుమతి చేసుకోవాలన్నది మరో నిబంధన. తత్ఫలితంగానే పాలకులు రైతులకు ఫలానా పంటలనే సేద్యం చేయాలన్న హితోక్తులు మరోవైపు తమ తమ లోటుబడ్జెట్లను పూరించుకునేందుకు, చేపడుతున్న ఆర్థిక విధానాలను సమర్థించు కునేందుకు అనువుగా సుంకాలు పెంచేయడంతో, వినియోగదారుని కళ్లు బైర్లు కమ్మేస్తున్నాయ్. 'స్వేచ్ఛా వాణిజ్యం' ఉత్పత్తిదారుని పరిధిని కుదించేసి, వాణిజ్యవర్గాల పరిధిని విస్తృతం చేయడంతో, అయినకాడికి అమ్ముకునే దౌర్భాగ్యాన్ని రైతుకు, అందినకాడికి దోచుకునే అవకాశాన్ని వాణిజ్యదారునికి కల్పిస్తుంది. వ్యవసాయరంగంలో రాయితీల కోత, ఉత్పత్తిదారునికి గిట్టుబాటే లేని పరిస్థితిని కల్పిస్తే, అంతర్జాతీయ మార్కెట్‌లో ఆయా దేశాల రాయితీల ఆసరాతో వస్తున్న ఉత్పత్తుల ఎగుమతి రంగంలో పోటీ పడలేని పరిస్థితి. ఈ కారణంగానే అమెరికాకు చెందిన పది బహుళజాతి కంపెనీలు ప్రపంచంలోని 90 శాతం వ్యవసాయ మార్కెట్‌ను ఆక్రమించాయని వింటున్నాం. అంటే, ప్రపంచవ్యాప్తంగానే వ్యవసాయ ఉత్పత్తుల పంపిణీ, మార్కెటింగ్ రంగాలపై గుత్తాధిపత్యాన్ని ఈ బహుళజాతి సంస్థలకు అప్పగించడమే. ప్రపంచీకరణ విధానాల అసలు రహస్యమిదే. ఈ విధానాలనే పార్టీలతో ప్రమేయంలేని మన పాలకవర్గాలన్నీ అమలు పరుస్తున్నాయి.

**అంతర్ధానమౌతున్న 'ఆహారభద్రత' :**

1996లో ప్రపంచ ప్రజల ఆహార భద్రతా ప్రయోజనాలకోసం 186 దేశాలు సమావేశమై, 2015 నాటికి అన్నార్తుల్లో సగంమందికైనా కటిక దారిద్ర్యం నుంచి బైట పడేయ్యాలని నిర్ణయించాయి. ఈ సమావేశంలో మనదేశం సైతం పాల్గొంది. ఆహార భద్రతా నిర్వచనం మేరకైతే 'ప్రజల ఆహార అవసరాల నిమిత్తం ఆరోగ్యవంతమైన జీవితాన్ని కొనసాగించేందుకు, వారి అవసరాలకు ఆహార అలవాట్లకు, అభిరుచులకు అనువైన రక్షిత పోషకాహారం తగినంతగా ఎల్లవేళలా అందుబాటులో వుండే విధంగా, భౌతికంగా, ఆర్థికంగా ఏర్పాటు చేయడమే ఆహారభద్రత'. కానీ, నాటి ఎన్డీయే సంకీర్ణ ప్రభుత్వం ఆహార భద్రతా సదస్సు లక్ష్యాలను నాడే గాలికి వదిలేసింది. బాధ్యతాయుతంగా వ్యవహరించదల్చిన ప్రభుత్వాలైతే, సదస్సు ప్రమాణాల రీత్యా దేశంలో ప్రజలకు ఆహార సరఫరా విషయంలో, నిత్యావసర సరుకులను పంపిణీ చేసే ప్రజా పంపిణీ వ్యవస్థను మరింతగా బలోపేతం చేయాల్సి వుంది. కానీ అలా జరగలేదు. పైగా ఆనాటికి కేంద్రం వద్ద ఆరు కోట్ల టన్నుల పై చిలుకు ఆహారధాన్యాలు నిల్వ వున్నాయి. అయినా ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్ తదితర రాష్ట్రాల్లో ఆకలిచావులు నమోదయ్యాయి. తీవ్ర విమర్శలు వచ్చిన నేపథ్యంలో నాటి ఎన్డీయేప్రభుత్వం, కేంద్ర ఆహారధాన్యాలను పంపిణీ కేంద్రాలకు తరలిస్తుంది గానీ పంపిణీ బాధ్యతను రాష్ట్ర ప్రభుత్వాలే చేపట్టాలని సూచించింది. ఈ సూచనలో నిగూఢ రహస్యం ఒకటుంది. అది ప్రభుత్వ ఆహార సంస్థ గిడ్డంగుల్లో వున్న నిల్వలు ప్రజల సొత్తు. ప్రోక్యూర్‌మెంటు ద్వారా సేకరించినవి. పంపిణీని రాష్ట్రాలే భరించాలంటే, ఈ నిల్వల రవాణా ఖర్చును తిరిగి ప్రజల నెత్తిన రుద్దడమే. అలా అయినా 2000-01 సంవత్సరంలో ఆహారధాన్యాల ఉత్పత్తి 6.3 శాతం తగ్గినా, ఆహారధాన్యాల సేకరణ మాత్రం మూడు కోట్ల ఎనభై వేల టన్నుల నుంచి మూడు కోట్ల యాభై లక్షల టన్నుల మేరకు పెరిగింది. అయితే ప్రజా పంపిణీ వ్యవస్థకు విడుదల చేయాల్సిన సరుకు మొత్తం ఒక కోటి 71 లక్షల నుంచి ఒక కోటి 21 లక్షల టన్నులకు కుదించబడింది. ఇందుకు రెండేరెండు కారణాలు. ఒకటి, ప్రపంచబ్యాంకు ఆదేశాల మేరకు, ఆహారధాన్యాల సేకరణను, వాటిరవాణా, పంపిణీ వ్యవస్థలను నిర్వీర్యపర్చడమూ, ఆహార ధాన్యాల సేకరణ పేరుతో (ప్రోక్యూర్‌మెంటు) రైతాంగ ఉత్పత్తిని ఎంతోకొంత మేరకు కొనుగోలు చేస్తూ, కొంతవెసులుబాటుగా నిలుస్తున్న ప్రైవేటు వ్యాపారుల్ని ధాన్య సేకరణ నుంచి విరమింపజేయడం. 1993-2000 మధ్య కాలంలో కేంద్రం 21కోట్ల 28 లక్షల టన్నుల ధాన్యం సేకరించగా, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రజాపంపిణీ వ్యవస్థ ద్వారా విక్రయించగలిగింది కేవలం 12 కోట్ల 90 లక్షల టన్నులు మాత్రమే. కేంద్రం దగ్గరున్న నిల్వలు వినియోగంలోకి రాని కారణంగా, కోటి 80 లక్షల టన్నులు వినియోగానికే వీలుకాని ముక్కిపోయిన సరకుగా తేలింది.

2000 తర్వాత ఈ ప్రజాపంపిణీ వ్యవస్థ ఎంతగా దిగజారిందో మరోసారి చెప్పుకోనవసరం లేదు. మధురాస్వామినాథన్ అంచనా మేరకు ఐదుగురు సభ్యులున్న కుటుంబానికి నెలవారీ యాభై కేజీల బియ్యం తలవారీ తృణ ధాన్యాలు నెలకు 10 కేజీలు అవసరం. అయితే ప్రభుత్వాలు 2001లో 20 కేజీలు బియ్యం కుటుంబానికి యిస్తూ 2003 నాటికి 35 కేజీలకు పెంచారు. కానీ బియ్యం వాసి తగ్గిపోయింది. చౌకదుకాణాల్లో ఇస్తున్న ఆహారధాన్యాలు చాలా నాసిరకంగా వున్నాయని

కంప్ట్రోలర్ ఆడిటర్ జనరల్ వ్యాఖ్యానించాల్సివచ్చింది. తరువాత దారిద్ర్యరేఖకు కొంచెం ఎగువనున్న వర్గాలను అవాస్తవ గీటురాళ్లతో ఎబౌ పావర్టీ లైన్‌గా (ఎపిఎల్‌)గా ముద్రేసి (టివి ఉందనో, ఫోన్ ఉందనో, గ్యాస్ వినియోగిస్తున్నారనో కారణం చూపి) పంపిణీ వ్యవస్థ నుంచి మినహాయించారు. రేషన్ కార్డులు కేవలం గుర్తింపు కార్డులుగానే ఉపయోగపడుతున్నాయే తప్ప వీటి ద్వారా పొందే నిత్యావసర సరుకుల పరిధి కుంచించుకుపోయింది. ఈ కారణంగానే అంటే ప్రజాపంపిణీ వ్యవస్థ నిర్వీర్యం కావడం ద్వారా తరతమ భేదంలేని వినియోగదార్లంతా మార్కెట్‌పై ఎగబడటం, చెప్పిన ధరకు కొనుక్కోవడం అతిమామూలైపోయింది.

**అంతర్ధానమైన వ్యవసాయ ధరల కమీషన్ :**

పైన పేర్కొన్నట్టుగా, ప్రజాపంపిణీ వ్యవస్థను నిర్వీర్యపర్చిన ధోరణిలోనే దేశ వ్యవసాయ ధరల కమీషన్‌ను సైతం సంస్కరణల నిబంధనల మేరకు ఎత్తేసుకోవలసి వచ్చింది. ప్రపంచబ్యాంకు కంట్రీ డాక్యుమెంటు ద్వారా, ఆహారధాన్యాల ప్రొక్యూర్‌మెంట్‌ను, సేకరించిన ధాన్యం రవాణా, పంపిణీ వ్యవస్థలనూ ఆహార సంస్థ అజమాయిషీ నుంచి తప్పించి మొత్తం కార్యక్రమాన్ని ప్రైవేటు రంగానికి వదిలేయ్యాలని ఆదేశించింది. ఈ కారణంగానే రైతాంగ ఉత్పత్తులకు అనువైన గిట్టుబాటును సైతం ప్రకటించలేని పరిస్థితులు నెలకొంటున్నాయి. ఆహారధాన్యాల నిల్వలు పుష్కలంగా వున్నా కరవు ప్రాంతాలకు తరలించేలేని నిస్సహాయస్థితి. ప్రజాపంపిణీకి సైతం అవసరమైన ఆహారధాన్యాల రవాణాకు అవసరమైన నిధులు తమ వద్ద లేవన్న కారణంగానే ప్రజాపంపిణీని సక్రమంగా చేపట్టలేకపోతున్నామనీ రాష్ట్రప్రభుత్వాలు చెప్పాయి. ఈ పరిస్థితినే సుప్రసిద్ధ ఆర్థికవేత్తలు ఆరిందం చౌదరి, మలయ్ చౌదరి యిలా వ్యాఖ్యానించారు. 'సిగ్గు...సిగ్గు మనందరం తలలు వంచుకోవాలి. కొత్త ఫ్లై ఓవర్లు, భూగర్భ రైల్వేలు నిర్మించడానికి నిధులకొరత లేదు. కానీ, ప్రజాపంపిణీ ఆహారధాన్యాల రవాణాకు నిధులు లేకపోవడం ఎంత హాస్యాస్పదం'. పైగా రైతులు ఆహారధాన్యాల సేద్యాన్ని పక్కకు నెట్టేసి, పూలతోటలు, వాణిజ్య పంటల్ని మాత్రమే పండించుకోవాలని సూచించడం, వాటి ఎగుమతుల ద్వారా బతకు బండినీడ్వాలని ఆదేశించడం, ఆర్థిక సంస్కరణల అమలుకై ప్రపంచబ్యాంకు పెట్టిన షరతులనే విషయాన్ని ఎల్లరూ గుర్తెరగాలి.

**ముగింపు :**

ఇన్నేళ్ల తర్వాత మళ్లీ అధిక ధరల విషయం కేంద్ర ప్రభుత్వ స్ఫురణకు వచ్చింది. యిటీవల ఈ విషయమై కాంగ్రెస్ పాలిత రాష్ట్ర ముఖ్యమంత్రుల సమావేశం జరిపి, ధరల నియంత్రణ కమీషన్‌ను ఏర్పాటు చేయాలని నిర్ణయం తీసుకున్నారు. ఈ కమీషన్ ఏర్పాటు ఉనికిలోకి వచ్చి, ధరలపై దేశవ్యాప్త అధ్యయనం జరిపి తమ సూచనలను, సలహాలను యిచ్చేసరికి, మరో రెండేళ్లు సునాయాసంగా జరిగిపోయి, సాధారణ ఎన్నికల సమయం వచ్చేస్తుంది. యింకేముంది అరచేతిలో వైకుంఠాన్ని చూపించే హామీలతో మరోసారి ఓటర్లను బురిడీ కొట్టించవచ్చు. ఆపై మరో ఐదేళ్ళు యదేచ్ఛ! ఇందుకు పూర్వ ప్రాతిపదికగా ఆరోవేతన సంఘం ఏర్పాటుకు కూడా పనిలో పనిగా యుపిఎ ప్రభుత్వం సమాయత్తమైంది. ఇంకేముంది దీంతో రాష్ట్ర ప్రభుత్వోద్యోగులతో (వీరి వేతన సవరణ అయిపోయింది కదా) పాటు రాబోయే వేతన సవరణతో కేంద్ర ప్రభుత్వోద్యోగులనూ జోకొట్టవచ్చు. ఇక మిగిలిందల్లా కార్మికులు. వీరిలో మెజార్టీ ప్రైవేటు రంగానికి చెందిన వారే, ప్రభుత్వం సూచనలు, సలహాలు, ప్రభుత్వ ఉత్తర్వులు షరా మామూలే.. అరకొరగా మిగిలిన ప్రజాసంఘాలు-విద్యార్థులు ఒక వేళ ఉద్యమించినా, అణచివేయగలమన్న ధీమా ఎలానూ ఉంది ప్రభుత్వానికి. అందుచేత 'అధిక ధరల నియంత్రణ' ఓ ప్రత్యేకాంశం ఎంతమాత్రమూ కాదు. పాలకులు చేపడుతున్న ఆర్థిక సంస్కరణల తానులో ముక్క మాత్రమే. మనకంటే ముందుగా ఈ సంస్కరణలు అమలైన దేశాల వాస్తవ పరిస్థితులను, అనుభవాలను పరిగణనలోకి తీసుకోవాలి. అప్పుడే ఈ సమష్టి సమస్య పరిష్కారానికి తగు ప్రత్యామ్నాయాన్ని శోధించాలి! అంతవరకు 'ధరలు' పెరుగుతూనే వుంటాయి నిరాటంకంగా!! ◆

# నిత్యావసర వస్తువుల ధరలు ఎందుకు పెరుగుతున్నాయి?

- వి. చలపతిరావు

గత 7, 8 నెలల నుండి నిత్యావసర వస్తువుల ధరలు క్రమంగా పెరుగుతున్నాయి. ముఖ్యంగా పప్పుదినుసులు, బియ్యం, గోధుమలు, చింతపండు కూరగాయలు వగైరా లాంటి నిత్యావసర వస్తువుల ధరలు విపరీతంగా పెరిగి బీద, మధ్యతరగతి ప్రజలకు భారమవుతున్నాయి. ఇలా పెరుగుతున్న ధరల అదుపు కొరకు ప్రభుత్వం ఎలాంటి నియంత్రణ చర్యలు తీసుకొన్న దాఖలాలు లేవు. ఈ ధరల సమస్య దేశంలోని 40 శాతం బీదల, మరొక 40 శాతం మధ్య తరగతి ప్రజల జీవితాలను దుర్భరం చేస్తున్న మాట వాస్తవం. అయినా అటు కేంద్ర ప్రభుత్వం కాని, ఇటు రాష్ట్ర ప్రభుత్వం కాని. ధరల విషయంలో పట్టించుకొనక నిమ్మకు నీరెత్తినట్లు వుండటం విడ్డూరంగా వుంది. నిత్యావసర వస్తువుల ధరలే కాక పారిశ్రామికోత్పత్తులు ఇతర వాడకం వస్తువుల ధరలు కూడ అదుపు లేకుండా పెరుగుతున్నవి. ముఖ్యంగా గృహ నిర్మాణంలో అత్యవసరం అనుకొనే సిమెంటు ధర కూడ అదుపు లేకుండ పెరగటం గమనార్హం. ఈ స్థితి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రపంచబ్యాంకు మార్కు మార్కెట్ ఎకానమిని ప్రోత్సహించటం వలన దాపురిస్తున్నదా? మొన్న పార్లమెంటులో ధరల పెరుగుదలపై విపక్షాలు, అధికార పార్టీవారు కలిసి ప్రభుత్వాన్ని నిలదీసినప్పుడు ఆర్థిక మంత్రి చిదంబరం చెప్పిన జవాబునుబట్టి చూస్తే పై మాటే నిజమని తోస్తున్నది. 8 శాతం జి.డి.పి.తో అభివృద్ధి అవుతున్న మనదేశంలో వస్తువుల ధరలు ఇలా పెరగటం మామూలే అని ఆయన ధరల పెరుగుదలను సమర్థించాడు.

సాధారణంగా మార్కెట్లో ఏవైన వస్తువుల ధరలు పెరగటానికి కారణం, ఆ వస్తువులకి గిరాకి ఎక్కువ కావటమో లేదా ఆ వస్తువుల గిరాకికి తగ్గట్టుగా సరఫరా లేకపోవటమో అని ఆర్థికశాస్త్ర సూత్రం చెప్తుతుంది. లేదా ఆ ప్రత్యేక వస్తువులను బ్లాక్ మార్కెటు వర్తకులు అధిక లాభాల కొరకు అక్రమ నిలువలు చేసి అయినా వుండాలి, లేదా పెట్రోల్ డిజిల్ ధరలు పెరగటం వలన ట్రాన్స్‌పోర్టు ఛార్జీలు పెరిగి ధరలపై ప్రభావం పడవచ్చును. ఇవేవి కాక ఆర్థికమంత్రి చెప్పే కారణం ఇందుకు భిన్నంగా వుంది. ఆర్థికమంత్రి చెప్పేది కుంటిసాకా నిజమా ఆర్థికవేత్తలు, విశ్లేషకులు ప్రజలకు స్పష్టం చేయాలి.

ఇటీవల ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నిత్యావసర వస్తువుల ధరలు పెరగటానికి కారణం పెట్రోల్, డీజిల్ ధరలు పెరగటమేనని చిదంబరం చెప్పినదానికి భిన్నంగా చెప్పాడు. ఇందులో ఎవరు చెప్పినది నిజమో తెలియదు. పూర్వం ఇందిరాగాంధీ హయాంలో కూడ ఒకసారి చక్కెర ఇతర నిత్యావసర వస్తువుల ధరలు విపరీతంగా పెరిగాయి. ఆనాడు సరుకులు పెద్దెత్తున చీకటిబజారు గోదాంలలోకి జారుకున్నాయి. తర్వాత వచ్చిన మొరార్జీ దేశాయి ప్రభుత్వ హయాంలో చక్కెర బజారులలో తోపుడు బండ్లపై పెట్టి సరసమయిన ధరలకు అమ్మడమైనది. అంతకు పూర్వం గల 'లైసెన్స్ కోటా రాజ్' (ఇందిరాగాంధీ హయాం) విధానంలో సడలింపు తీసుకువచ్చిన ఫలితంగా నిత్యావసర వస్తువులు ఓపెన్ మార్కెట్‌లో సరసమయిన ధరలకు లభ్యమవుతున్నాయని ఆనాడు జనతా పార్టీ ప్రభుత్వం చెప్పుకుంది. ఇక్కడ చెప్పే విషయం ఏమిటంటే, నిత్యావసర వస్తువుల ధరలు నిలకడగా వుండటమో లేదా పెరగటమో అనేది కచ్చితంగా ఆయా ప్రభుత్వ విధానాలపై ఆధారపడి వుంటుందనేది నిజమయిన విషయం. ఇప్పుడు గత రెండేండ్ల నుండి కాంగ్రెస్ హయాంలో వివిధ వస్తువుల ధరలు ఆకాశాన్నంటుతున్నాయంటే ఈ ప్రభుత్వ విధాన ప్రభావమే అని చెప్పవచ్చును. ఈ సంగతి ప్రతిపక్ష పార్టీల నాయకులకే కాక కాంగ్రెస్ నాయకులకు కూడా తెలుసు. కాని ఆ పార్టీలో అంతర్గత ప్రజాస్వామ్యం లోపించటం వలన వారు ఈ విషయం గురించి ప్రశ్నించలేకపోతున్నారు.

ఒకవైపు నిత్యావసర వస్తువుల ధరలు విపరీతంగా పెరుగుతుంటే ఇంకొకవైపు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రియల్ ఎస్టేట్ వ్యాపారి అవతారం ఎత్తి హైదరాబాద్ చుట్టు వున్న ప్రభుత్వ భూములను ప్లాట్లుగా చేసి హుడా ద్వార ఎన్నడూ కని విని ఎరగని రీతిగా విపరీతమయిన ధరలకు పెద్ద ధనవంతులకు కంపెనీవారికి వేలంపాటలో అమ్మిస్తున్నది. మొన్న కోకాపేట భూముల వేలంపాటలో ఎకరా ధర ఎక్కువగా 17 కోట్ల రూపాయలకు అమ్ముడుపోయిన సంగతి అందరికి తెలిసిందే. అంటే ఇప్పటికిపుడు నిత్యావసర వస్తువుల ధరలు పెరగటం వలన బాధపడుతున్న సామాన్య ప్రజలు ఇక ముందు ముందు చిన్న ఇల్లు ప్లాటును కొనే కలలు కనటానికి వీలులేకుండ ఈ ప్రభుత్వం చేస్తోంది. భూమి, నీరు, వాయువు ఇవి ప్రకృతి ఇచ్చిన వీటిపై టాక్సులు వేయటం దేనికి అని ఎన్.టి.ఆర్. ప్రభుత్వం భూమి శిస్తును తీసివేసింది. కాని ఈ ప్రభుత్వం నివసించుటకు చారెడు భూమిని కూడ ప్రియం చేస్తోంది. మీటర్లు బిగించి తాగునీరును ప్రియం చేస్తారట. బీదలకు ఉచితవిద్య, వైద్యం కూడా దొరకకుండ ఈ ప్రభుత్వాలు కార్పొరేటు విద్యాలయాలను, వైద్యశాలలను ప్రోత్సహిస్తున్నాయి. ఇలా ప్రజలకు కావలసిన మౌలికావసరాలు, ఇంటిజాగ, మంచినీరు, ఆహారం ఇతర నిత్యావసర వస్తువులు ప్రియం కావటానికి ప్రభుత్వమే కారణం. కంచే చేను మేసినట్లు, ప్రజల సంక్షేమం గురించి చర్యలు తీసికోవలసిన ప్రభుత్వమే ఈ విధంగా ధరలు పెరగటానికి స్వయంగా కారణం కావటం పూర్తిగా అప్రజాస్వామికం. హాస్యాస్పదమైన విషయం ఏమిటంటే, నిత్యావసర ధరలు ఈ విధంగా పెరుగుతుంటే మన ఆర్థిక మంత్రి పార్లమెంటులో ద్రవ్యోల్బణం శాతం 4.87 నుండి 4.50 వరకు దిగిపోయిందని చెప్పాడు. ఇది ఎలా సాధ్యం, ప్రభుత్వం, రిజర్వ్ బ్యాంక్ వగైరా ఇతర ప్రభుత్వ ఏజెన్సీలు ఇచ్చే గణాంకాలను ఎలా నమ్మాలి. పార్లమెంటులో ఏ మెంబరు కూడ ఈ గణాంకాలలోని వాస్తవికతను ప్రశ్నించినట్లు లేదు.

కోకాకోల, పెప్సిలాంటి శీతల పానీయాలలో పురుగుమందు శాతం 17 శాతం వరకు వుంది కనుక ఇవి తాగటం వలన, ముఖ్యంగా వీటికి అలవాటు పడ్డ యువత ఆరోగ్యం ప్రమాదంలో వుందని, గత రెండు ఏండ్ల నుండి నిపుణులు హెచ్చరిస్తున్నప్పటికీ ఈ ప్రభుత్వాలు

# బహుళ దోపిడీపై ప్రజాగ్రహం

- ఇలిహాస్

## కోలా గరళం

శీతల పానీయాల్లో హానికరమైన పురుగుమందుల అవశేషాలు ఉన్నాయని మూడేళ్ల క్రింద సెంటర్‌ఫర్ సైన్స్ ఎండ్ ఎన్విరాన్‌మెంట్ (సిఎస్‌ఇ) అనే సంస్థ బైటపెట్టినప్పుడు కలిగిన సంచలనం అంతా ఇంతా కాదు. లాభాల వేటలో బహుళజాతి కంపెనీలు ఎన్ని అక్రమాలకు పాల్పడతారో కథలు, కథలుగా చదివిన వారిని కూడా ఉలిక్కిపడేలా చేసిందీ వార్త. దేశమంతటా కోలా కంపెనీలపై నిరసనలు మిన్నంటాయి. అటు వామపక్ష ప్రజా సంఘాల నుండి ఇటు విశ్వహిందూ పరిషత్, స్వదేశీ జాగరణ్ మంచ్ వంటి సంస్థల వరకూ శీతల పానీయాలకు వ్యతిరేకంగా ప్రదర్శనలు జరిపారు. ప్రభుత్వం కూడా వెంటనే ఒక జాయింట్ పార్లమెంటరీ కమిటీని ఏర్పాటు చేసి తదుపరి విచారణకు ఆదేశించింది. దేశవ్యాప్తంగా కోలా పానీయాల అమ్మకాలు గణనీయంగా పడిపోయాయి.

శీతల పానీయాల్లో హానికరమైన పురుగుమందుల అవశేషాలు ఏమి లేవని కేంద్ర ఆరోగ్య శాఖా మంత్రి అంబుమణి రాందాస్ కోలా కంపెనీలకు క్లీన్ చిట్ ఇస్తున్న దృశ్యం చూసినా చాలా మందికి సరిగ్గా మూడేళ్ల కిందట జరిగిన ఇలాంటి సంఘటన జ్ఞప్తికి వచ్చింది. మనం నిత్యం సేవించే శీతల పానీయాల్లో ప్రమాదకరమైన స్థాయిలో పురుగుమందుల అవశేషాలు ఉన్నాయని ఢిల్లీకి చెందిన సెంటర్ ఫర్ సైన్స్ ఎండ్ ఎన్విరాన్‌మెంట్ (సిఎస్‌ఇ) మొదటిసారి బయటపెట్టినప్పుడు కూడా అప్పటి కేంద్ర ఆరోగ్య శాఖా మంత్రి సుష్మాస్వరాజ్ గారు కూడా ఈ పానీయాలకు ఇలాగే క్లీన్ చిట్ ఇచ్చారు. ప్రభుత్వాల రంగు మారినా, నేతలు మారినా చివరకు అందరూ, బహుళజాతి కంపెనీల ప్రయోజనాలు కాపాడేవారేనని ఈ సంఘటన నిరూపిస్తోంది.

మూడేళ్ల కింద సిఎస్ఇ ఈ సంచలన నిజాన్ని బయట పెట్టినప్పుడు కోలా కంపెనీలు ఇప్పటి లాగానే అబద్ధాలు, అర్ధసత్యాలతో ఎదురుదాడికి దిగాయి. అసలు సమస్యను వదిలి ఈ పరిశోధన చేసిన సిఎస్ఇపై బురదచల్లడానికి ప్రయత్నిస్తున్నాయి. అయితే మొదటి సారిలాగానే ఈసారి కూడా సునీతా నారాయణ్ నేతృత్వంలో సిఎస్ఇ కోలా కంపెనీలకు ఘాటుగానే జవాబిస్తోంది.

## ప్రమాణాల ప్రహసనం

మూడేళ్ల కింద సిఎస్ఇ పురుగుమందుల రహస్యం వెల్లడించగానే కేంద్ర ప్రభుత్వం హుటాహుటిన ఈ వ్యవహారంలో నిజాన్ని నిగ్గు తేల్చడానికి ఒక సంయుక్త పార్లమెంటరి కమిటీని (జెపిసి) వేసింది. అయితే ఈ జెపిసి డాట్‌కామ్ రక్షణ రంగంలో రాజకీయ నాయకుల అవినీతిని బట్టబయలు చేసినప్పుడు కూడా అవినీతికి పాల్పడ్డ వారిపైన విచారణ చేయకుండా, అసలు తెహెల్కా ఎందుకు ఈ ఆపరేషన్ చేసిందనేది పరిశోధించడానికే తన శక్తియుక్తులన్నీ వెచ్చించిన సంగతి తెలిసిందే.

అయితే జెపిసి చివరకు శీతలపానీయాల్లో పురుగుమందుల అవశేషాలు ఉన్న సంగతి ఒప్పుకోక తప్పింది కాదు. దీంతో కేంద్ర ప్రభుత్వం ఈ పానీయాల్లో కొన్ని ప్రమాణాలు ప్రవేశపెట్టాలని నిర్ణయించింది. తదనుగుణంగా బ్యూరో ఆఫ్ ఇండియన్ స్టాండర్డ్స్ (భారతీయ ప్రమాణాల సంస్థ) బిఐఎస్ శీతలపానీయాల ప్రమాణాలను నిర్ధారించడానికి ఒక కమిటీని వేసింది. 2005 అక్టోబర్‌లోనే ఈ కమిటి ప్రమాణాలను నిర్ధారించినా వాటిని ప్రకటించకుండా శీతలపానీయాల వాటి అమ్మకాలపై నిషేధం పెట్టి అవి తయారుచేసే కంపెనీల యాజమాన్యాలను ప్రాసిక్యూట్ చేసే చర్యలు తీసికోవటం లేదు. అటు పల్లెలలో, బస్తీలలో మురికివాడలలో గుడంబా కల్తీ కల్లు తాగి బీద, కార్మిక జనం అనారోగ్యాలకు గురి అయి చివరకు అర్ధాంతరంగా ప్రాణాలను కోల్పోతున్నారు. తమ కుటుంబాలను అనాథలుగా చేసి వెళ్ళిపోతున్నారు. ఈ విధంగా పెద్ద ఎత్తున మానవ వనరుల వృద్ధి ప్రమాదంలో ఉన్నా చర్యలు తీసికోని ప్రభుత్వాలు నిత్యావసర వస్తువుల ధరలను అదుపులో పెట్టగలదని అనుకోవటం అత్యాశే అవుతుందేమో.

| శీతల పానీయం పేరు | పరీక్షించిన నమూనాలు | మొత్తం పురుగు మందుల మోతాదు | బిఐఎస్ ప్రమాణాల కన్నా ఎన్ని |
|---|---|---|---|
| పెప్సీ కోలా | 14 | 15.22 | 30.4 |
| మౌంటెన్ డ్యూ | 1 | 6.97 | 13.9 |
| మిరిండా ఆరెంజ్ | 7 | 10.68 | 21.4 |
| మిరిండా లెమన్ | 1 | 8.09 | 16.2 |
| 7 అప్ | 3 | 12.46 | 24.9 |
| కోకాకోలా | 14 | 13.38 | 26.8 |
| థమ్సప్ | 5 | 10.94 | 21.9 |
| లిమ్కా | 6 | 6.73 | 13.5 |
| ఫాంటా | 4 | 9.14 | 18.3 |

ఈనాడు సగటు రాజకీయ నాయకుడు లక్షలు ఖర్చుచేసి ఎన్నికలలో గెలిచి కోట్లు సంపాదించాలన్న ధ్యాసలో ఉన్నాడు. అలాంటి రాజకీయ నాయకులకు బ్లాక్‌మార్కెటీయర్లతో ల్యాండ్ మాఫియాలతో ఇతర అసాంఘిక శక్తులతో దోస్తి ఉంటుంది. కాని బీద, మధ్య తరగతి ప్రజల కష్టాల గురించి పట్టించుకునే తీరిక వారికెక్కడిది. కనుక సంఘ కార్యకర్తలు, వినిమయదార్ల సంఘాలు, సీనియర్ సిటిజన్లు బాధ్యత గుర్తించే రాజకీయ నాయకులు, విద్యావంతులు, లాయర్లు, డాక్టర్లు, ఆర్థికవేత్తలు కలిసి సమైక్యంగా ధరల అదుపు విషయంలో పోరాడవలసి వుంది. ◆

- పెట్టుబడిదారీ వ్యవస్థ స్వరూపాన్ని సంపూర్ణంగా అర్థం చేసుకోవడానికి కోకాకోలా ఒక చక్కని ఉదాహరణ. ప్రజల ఉమ్మడి ఆస్తులను దోచుకుని కొద్దిమంది ధనం, అధికారం ఎలా స్వంతం చేసుకుంటారో – అలా స్వంతం చేసుకున్న సంపదను, అధికారాన్ని నిలబెట్టుకునేందుకు ఎటువంటి దారుణాలకు ఒడిగడతారో కోకాకోలా ఇటీవలి చరిత్ర రుజువు చేస్తోంది. ప్రజలకు ఉపయోగపడని ఉత్పత్తులను లెక్కకు మిక్కిలిగా తయారు చేయడం, ప్రజాబాహుళ్యానికి ఏ విధంగా పనికిరాని ఈ ఉత్పత్తులను తయారుచేయడానికి ఎంతో విలువైన సహజ వనరులను దోపిడీ చేయడం, స్థానిక చట్టాలను ఇష్టారాజ్యంగా ఉల్లంఘించడం. ప్రజలు ఎదురు తిరిగితే వారిపై ప్రభుత్వ, ప్రైవేటు గూండాలతో దాడి జరిపించడం – దాదాపు అన్ని బహుళజాతి కంపెనీల చరిత్రలో ఈ అంశాలు మనకు తప్పక కనబడతాయి.
- 1991లో ఆర్థిక సరళీకరణ ప్రక్రియ మొదలవగానే భారత్‌లో రెండోసారి ప్రవేశించిన కోకాకోలా ఇక్కడ ఎంతో అమూల్యమైన నీటివనరులను కారుచౌకగా కొల్లగొట్టడం మొదలుపెట్టింది. శీతల పానీయాల తయారీలో ఉన్న చిక్కేమిటంటే, ఈ పరిశ్రమలు తాము వాడే నీటిలో దాదాపు డెబ్భై అయిదు శాతం హానికరమైన వ్యర్థజలంగా మార్చి వదిలివేస్తుంటాయి. భూగర్భ జలాలను అపరిమితంగా పీల్చేయడమే కాకుండా మిగిలిపోయిన కొద్దిపాటి జలాలను కూడా దేనికీ పనికి రానంతగా కలుషితం చేస్తోంది కోకాకోలా. 2004లో ప్రపంచవ్యాప్తంగా రెండులక్షల ఎనభైమూడువేల కోట్ల లీటర్ల మంచి నీటిని కోకాకోలా ఉపయోగించింది. అందులో దాదాపు మూడోవంతును దేనికీ పనికిరాని వ్యర్థజలంగా మార్చి భూమిపై వదిలివేసిందీ సంస్థ.
- జనాభాలో దాదాపు డెబ్భై శాతం ప్రజలు వ్యవసాయంపై ఆధారపడి జీవించే భారత్ వంటి దేశాల్లో నీటి దోపిడీ ఎంతమంది ప్రజల జీవితాలను అతలాకుతలం చేస్తుందో వేరే చెప్పనవసరం లేదు.
- ఈ అవిశ్రాంత నీటి దోపిడీని అరికట్టవలసిన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మాత్రం శీతలపానీయాల కంపెనీలకు ఇంకా ఏయే రాయితీలు ఇచ్చి ప్రోత్సహించాలా అని ఆలోచిస్తున్నాయి. ఇటీవలే శీతల పానీయాలకు ప్రత్యేక ఎక్సైజ్ పన్ను నుండి మినహాయింపునిచ్చింది కేంద్ర ప్రభుత్వం. ఇక మన రాష్ట్ర ప్రభుత్వ సంస్థ అయిన హైదరాబాద్ మెట్రో వాటర్ వర్క్స్ ఎండ్ సీవరేజ్ బోర్డ్ మౌలాలిలోని కోకాకోలా బాట్లింగ్ ప్లాంట్‌కు అనేక ఏళ్లుగా సబ్సిడీ ధరలకు లక్షల లీటర్ల మంచినీటిని సరఫరా చేస్తోంది.
- అయితే కోకాకోలా తమ జీవితాలతో చెలగాటం ఆడుతుండడం చూసి ఇక సహించలేని స్థానిక ప్రజలు దేశమంతటా ఆ సంస్థ దోపిడీకి వ్యతిరేకంగా ఉద్యమాలు నిర్మిస్తున్నారు. ఎంతో స్ఫూర్తిదాయకమైన అటువంటి పోరాటాల్లో కొన్ని...
- ముందుగా చెప్పుకోవలసింది కేరళలోని ప్లాచిమడలో – దేశంలోనే అతిపెద్ద కోకాకోలా బాట్లింగ్ ప్లాంట్ చేస్తున్న నీటిదోపిడీని ఎదిరించి విజయం సాధించిన పోరాటం గురించి. ఏప్రిల్ 2002లో మొదలుపెట్టి మార్చి 2004లో కోర్టు ఈ ప్లాంట్‌ను మూసివేయాలని ఆదేశించే వరకూ ప్లాచిమడ గ్రామస్తులు, వారికి అండగా స్వచ్ఛందసంస్థలు సలిపిన ఈ శాంతియుత పోరాటం సామ్రాజ్యవాదంపై పోరులో ఓ మహత్తర ఘట్టం. కోకాకోలా కంపెనీ, ప్రభుత్వం ఎన్ని అడ్డంకులు కల్పించినా వెరవక ఆ ఫ్యాక్టరీ గేటు ముందు అహోరాత్రులు ప్లాచిమడ గ్రామ స్తులు ఆందోళన చేశారు. ఒక బహుళజాతి కంపెనీ తన కార్యకలాపాలు కొనసాగించుకోవ డానికి లైసెన్సు నిరాకరించడం ద్వారా ప్రపంచవ్యాప్తంగా వార్తల్లో కెక్కింది ప్లాచిమడ గ్రామ పంచాయితీ.
- ఉత్తరప్రదేశ్‌లోని వారణాసి సమీపంలో మెహదీగంజ్ అనే గ్రామంలో కోకాకోలా బాట్లింగ్ ప్లాంట్ ఉంది. 2004 నవంబర్‌లో ఈ బాట్లింగ్ ప్లాంట్ నీటి దోపిడీకి వ్యతిరేకంగా దాదాపు 1500 మంది స్థానిక ప్రజలు ప్లాంట్ గేటు ముందు ప్రదర్శన జరిపారు. ప్లాంట్‌ను 'రక్షించడానికి' ప్రభుత్వం పంపిన సాయుధ బలగాలు మాత్రం స్వామిభక్తిని నిరూపించుకునేందుకు ఆ ఆందోళనకారులపై విరుచుకుపడి చితకబాదారు. అయితే ప్రజలు మాత్రం వెనక్కి తగ్గకుండా ఆనాటినుండీ తమ పోరాటం కొనసాగిస్తూనే ఉన్నారు. తాజాగా జూన్ 22వ తేదీ నుండి మెహదీగంజ్ బాట్లింగ్ ప్లాంట్‌ను మూసివేయాలని కోరుతూ చుట్టు ప్రక్కల ఇరవై గ్రామాలకు చెందిన నేతలు ఫ్యాక్టరీ గేటు ముందు నిరాహారదీక్ష మొదలుపెట్టారు. అంతకు మూడునెలల ముందు నుండీ ఆందోళనకారులు ఫ్యాక్టరీ గేటు ముందు శాంతియుతంగా బైఠాయింపు కూడా జరిపారు.
- గత మూడున్నరేళ్లుగా రాజస్థాన్‌లోని కాలదేరా, ఆ చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలు అక్కడి కోకాకోలా బాట్లింగ్ ప్లాంట్‌ను ఎత్తేయాలని పోరాడుతున్నారు. అసలే నీటి వనరులు తక్కువ ఉండే రాజస్థాన్‌లో భూగర్భం నుండి కోట్లకొద్దీ లీటర్ల నీరు జుర్రేస్తున్న కోకాకోలా కంపెనీ వేలాదిమంది ప్రజల మనుగడను సవాల్ చేస్తోంది. తమకు తాగునీరు, సాగునీరు లేకుండా చేస్తున్న ఈ బహుళజాతి దిగ్గజంపై కాలదేరా పరిసర గ్రామ ప్రజలు స్థానిక జన సంఘర్ష్ సమితి నేతృత్వంలో పోరుసలుపుతున్నారు.
- తమకు జీవజలం అందిస్తున్న నది నుండి పైప్‌లైన్ నిర్మించి, తాగేందుకు గుక్కెడు నీళ్ళు లేకుండా చేస్తున్న కోకాకోలా బాట్లింగ్ ప్లాంట్‌ను వ్యతిరేకిస్తూ ఆందోళన చేస్తున్నారు మహారాష్ట్రలోని థానే జిల్లాలోని కుడుస్ గ్రామస్తులు. అయితే కంపెనీ ప్రోద్బలంతో స్థానిక పోలీసులు ఈ ఆందోళనకు నేతృత్వం వహిస్తున్న కార్యకర్తలను వేధిస్తున్నారు.
- దేశమంతటా తమబోటివారు చేపడుతున్న ఆందోళనలను చూసి ఉత్తేజం పొందారు. తమిళనాడులోని శివగంగ ప్రాంతవాసులు. స్థానిక చక్కెర మిల్లు యాజమాన్యంతో భాగస్వామ్య ఒప్పందం చేసుకుని తమ నీటి వనరులను స్వాహా చేయడానికి సన్నాహాలు చేసుకుంటున్న కోకాకోలా కంపెనీకి వ్యతిరేకంగా వారు గళం విప్పారు. 2003 ఏప్రిల్‌లో బాట్లింగ్ ప్లాంట్ కట్టబోయే స్థలం దగ్గర దాదాపు ఏడువేలమంది ప్రజలు ఒక భారీ ప్రదర్శన జరిపారు.

లాబీయింగ్ నడుస్తోంది. 2006 మార్చి 29న కేంద్ర ఆరోగ్య మంత్రిత్వ శాఖ అయితే ఇప్పుడిప్పుడే ఈ ప్రమాణాలు ప్రకటించొద్దని సదరు కమిటీకి లేఖ కూడా పంపింది.

ఇదీ ప్రజల ఆరోగ్యం పట్ల మన పాలకులకు ఉన్న చిత్తశుద్ధి. కాసుల వేటలో మునిగి ప్రజారోగ్యానికి తిలోదకాలిస్తున్న బహుళ జాతి కంపెనీలకు ముకుతాడు వేయాల్సింది పోయి ఆ కంపెనీలకు కట్టుబానిసల్లా ప్రవర్తిస్తున్నారు మన ఏలికలు.

## ఎక్కడివి పురుగుమందుల అవశేషాలు?

కోలా పానీయాల్లో పురుగుమందుల అవశేషాలు ఉన్నాయనే వార్తలు వెలువడ్డప్పటి నుండీ సామాన్య జనంతో మొదలై చదువుకున్న మేధావుల వరకు అనేక అర్ధసత్యాలు చలామణి అవుతున్నాయి. మొన్నటికి మొన్న ఇంటర్నెట్‌లు ఓ పెద్దమనిషి ఈ వ్యవహారం పై ఓ పెద్ద వ్యాసం రాశాడు. 'అసలు కోలా కంపెనీలు కూల్‌డ్రింకుల్లో కెఫీన్‌తో పాటు పురుగుమందులు ఎందుకు కలుపుతున్నాయో వెంటనే వెల్లడించాలని' అయన డిమాండ్ చేశాడు.

కోలా కంపెనీలేమో తాము వాడుతున్న చక్కెరలో ఈ పురుగు మందుల అవశేషాలు ఉండొచ్చుని బొంకుతున్నాయి. అసలు నిజం మాత్రం వేరేగా ఉంది. హరిత విప్లవం నాటినుండే మన దేశంలో పురుగుమందుల వాడకం బాగా పెరిగింది. పంటలపై విచక్షణా హరితంగా పిచికారీ చేసిన పురుగుమందుల్లో అధికశాతం అటు వాతావరణంలో, ఇటు భూమిలో కలిసిపోతుంది. భూగర్భజలం కలుషితం అవుతుంది. ఇప్పుడు శీతలపానీయాల్లోకి చేరుతున్న గరళం ఇలా భూగర్భజలం నుండి వచ్చిందనేది నిఖార్సయిన నిజం.

ప్రతి రోజూ భూగర్భం నుండి తాము తోడుతున్న లక్షల లీటర్ల నీటిని సరిగ్గా శుద్ధి చేయకుండా వినియోగిస్తున్నాయి ఈ కోలా కంపెనీలు. పురుగుమందు అవశేషాలు తాము వాడుతున్న చక్కెర నుండి వస్తున్నాయనే కొలా కంపెనీల వాదన శుద్ధ అబద్ధం. ఎందుకంటే జెపిసి విచారణ జరిగిన రోజుల్లోనే ఈ కంపెనీలు వాడుతున్న చక్కెరను పరీక్షించడం జరిగింది. హైదరాబాద్‌లోని విమ్టాలాబ్స్‌లో జరిగిన పరీక్షల ఫలితాల ప్రకారం చక్కెరలో పురుగుమందుల అవశేషాలు 1 పిపిబి కన్నా తక్కువ ఉన్నాయని తేలింది. నిజాలు ఇలా ఉండగా కొలా కంపెనీలు మాత్రం తప్పంతా భారత్‌లో ఉత్పత్తయ్యే చక్కెరదేనని అందుకే తాము చక్కెరను విదేశాలనుండి దిగుమతి చేసుకుంటామని పరోక్షంగా కేంద్ర ప్రభుత్వాన్ని బెదిరిస్తున్నాయి.

## ఇందుగలదు అందులేదని....

వ్యవసాయంలో వినియోగిస్తున్న హానికరమైన పురుగుమందుల ప్రభావం అనేక ఆహార పదార్థాలపై పడుతోంది. చివరకు తల్లిపాలల్లో కూడా పురుగుమందుల అవశేషాలు ఉన్నాయని పరిశోధనలు సూచిస్తున్నాయి. ఇలాంటి పరిస్థితుల్లో కోలా పానీయాల్లో పురుగు మందుల అవశేషాలు ఉంటే ఇంతలా గగ్గోలుపెట్టడం ఎందుకని అటు



శీతల పానీయాల యాజమాన్యం, ఇటు కొంతమంది మేధావులు ప్రశ్నిస్తున్నారు. మనం తినే అనేక ఆహార పదార్థాల్లో విషపూరితమైన పురుగు మందుల అవశేషాలు ఉన్నమాట వాస్తవమే కానీ ఇక్కడ తేడాను మనం అర్థం చేసుకోవాలి. పాలు, గుడ్లు, కూర గాయలు, పండ్ల వంటి ఆహారపదార్థాల్లో మన శరీరానికి ఎంతో అవసరమైన విటమిన్లు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు ఉంటాయి, ఇవన్నీ మన శరీరానికి మేలు చేసేవే. శీతలపానీయాలు అలా కాదు.




వాటిలో మన శరీరానికి అవసరమయ్యేది ఏమీలేదు. ఇటువంటి పనికిరాని పానీయాలు తాగి అనారోగ్యాన్ని మూటగట్టుకోవడం అంత తెలివైన పని కాదేమో!

## మేం వెళ్లిపోతాం!

బహుళజాతి కంపెనీలపై ఏదైన ఆరోపణ వచ్చిన ప్రతీసారీ తప్పనిసరిగా వినిపించే బెదిరింపు ఒకటి ఉంటుంది, అదే పెట్టుబడుల గురించి హోండా కంపెనీ కార్మికులు సమ్మె చేసినప్పుడు, మోన్‌శాంటోపై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కేసు వేసినప్పుడు, తాజాగా కోలా కంపెనీల బండారం బైటపెటినప్పుడు ఈ కంపెనీల ప్రతినిధులు చాలా తెలివిగా తమ దేశపు రాయబారితోనో, స్థానిక వాణిజ్య సంఘంతోనో ఒక ప్రకటన ఇప్పిస్తాయి. ఇటువంటి 'దురదృష్టకరమైన వివాదాల' వలన దేశంలో పెట్టుబడులు పెట్టేందుకు ఇక ఎవరూ సాహసించరని, తద్వారా మన 'అభివృద్ధి' కుంటుపడుతుందనేది దాని సారాంశం.

ఇక మన ప్రభుత్వాల సంగతయితే చెప్పనే అఖ్ఖరలేదు. వెన్నెముక లేని నాయకులు దేశ సార్వభౌమత్వాన్ని ఈ బహుళజాతి కంపెనీలకు తాకట్టు పెట్టి చాలా కాలమే అయింది.

బహుళజాతి కంపెనీల ద్వంద్వ ప్రమాణాలకు శీతలపానీయాల్లో పురుగుమందుల అవశేషాల వివాదం తాజా ఉదాహరణ. ఎన్ని ఆటంకాలు ఎదురయినా వెరవక ఈ విషయాన్ని పరిశోధించి దేశ ప్రజలకు ఎనలేని మేలు చేసిన సిఎస్ఇ కి చెందిన సునీతా నారాయణ్ అభినందనీయురాలు. గత మూడేళ్లుగా దేశమంతటా శీతలపానీయాల విక్రయాలు పడిపోయాయంటే దానికి కారణం సునీత చేసిన కృషే.◆

### ఇంకా విషతుల్యమే!

- పరీక్షించిన అన్ని నమూనాల్లో పురుగుమందుల అవశేషాలు లభించాయి.
- ప్రతీ నమూనాలోను మూడు నుండి ఆరు రకాల పురుగు మందుల అవశేషాలు ఉన్నాయి.
- కోల్‌కతలో సేకరించిన ఒక కోకాకోలా సీసాలో లిండేన్ పురుగుమందు అత్యధికంగా 14.పిపిబి స్థాయిలో ఉంది. ఇది బ్యూరో ఆఫ్ ఇండియన్ స్టాండర్డ్స్ (బిఐఎస్) ప్రమాణాల కన్నా 140 రెట్లు ఎక్కువ.
- ఎంతో విషతుల్యమైన క్లోరొఫైరిఫాస్ అనే పురుగుమందు సగటున బిఐఎస్ ప్రమాణాల కన్నా 47 రెట్లు అధికంగా ఉంది.
- పెప్సీకోలాలో పురుగుమందుల అవశేషాలు నిర్దేశించిన ప్రమాణాలకన్నా 30 రెట్లు అధికంగా ఉండగా, అదే కోకాకోలాలో ఇది 27 రెట్లు అధికంగా ఉన్నది.

# మారుతున్న కోర్టు తీర్పులు-పర్యవసానాలు-పరిష్కారాలు

- ఎస్. వీరయ్య

కార్మిక వివాదాలు, ప్రజాజీవనానికి సంబంధించిన అనేక విషయాలలో కోర్టులజోక్యం చర్చనీయాంశమవుతున్నది. కీలకమైన సందర్భాలలో ఈ మధ్యకాలంలో కోర్టులిచ్చిన తీర్పులు ప్రజలను ఆందోళనకు గురిచేశాయి. ప్రజాస్వామ్యం మనుగడకు సంబంధించిన లోతుపాతులు చర్చించి, కాపాడుకోవల్సిన ఆవశ్యకతను చాటిచెప్పాయి. సామాన్య ప్రజల ప్రయోజనాల పరిరక్షణకు ఏం చేయాలన్న ప్రశ్నను మరోసారి ముందుకు తెచ్చాయి. కార్మికులు, ఉద్యోగుల హక్కులు, సామాజిక న్యాయం, ప్రజాస్వామ్య విలువలు, ప్రజాప్రయోజనాలు వంటి అనేక అంశాలను ప్రభావితం చేసే తీర్పులు వెలువడ్డాయి. అనేక సందర్భాలలో కోర్టులజోక్యం, ఆచరణలో పాలకులకు, పెట్టుబడిదారులకు ఊతమిస్తున్నాయి. ఆయా సందర్భాలలో న్యాయమూర్తులకు ఉద్దేశాలను కూడా ఆపాదించలేం. న్యాయవ్యవస్థలోనే వస్తున్న మార్పుల పర్యవసానమిది. ఈ పరిస్థితులను లోతుగా పరిశీలించటం, పరిష్కార మార్గాలు వెతకటం అవసరం.

### కొన్ని కీలక తీర్పులు- పర్యవసానాలు

సుప్రీంకోర్టు ఉద్యోగులకు సమ్మెహక్కు లేదన్నది. తర్వాత కొన్ని హైకోర్టులు పారిశ్రామిక కార్మికుల సమ్మెల్లో కూడా జోక్యం చేసుకున్నాయి. సమ్మెలు విరమించాలని ఆదేశించాయి. అనేక చోట్ల ధర్నాలు, ప్రదర్శనల మీద కూడా ఆంక్షలు విధించాయి. సమ్మెహక్కు లేదన్న తర్వాత, ఇతర హక్కులు మిగులుతాయా? సమ్మె చేస్తారన్న భయం ఉంటే, ప్రభుత్వంగానీ, యాజ మాన్యాలుగానీ, సమ్మెలు జరగకుండానే అనేక సమస్యలు పరిష్కరించడానికి, కార్మికుల, ఉద్యోగుల సమష్టి బేరసారాల శక్తి పెరగడానికి తోడ్పడు తుంది. సమ్మెహక్కు లేదన్న తర్వాత, ఎంత సుదీర్ఘ చర్చోప చర్చలు జరిపితే మాత్రం ఫలితం ఏముంటుంది? ఎలాగూ సమ్మె చేయలేరు గనుక, ఎప్పటికైనా అంగీక రించక ఏం చేస్తారన్న పద్ధతిలో పాలకులు, యజమానులు ప్రవ ర్తించటం ఇప్పటికే ప్రారంభ మైంది. ఈ తీర్పు కార్మికవర్గాన్ని నిరాయుధులను చేసేందుకే తోడ్పడుతున్నది.

రాజ్యాంగపరంగాగానీ, చట్టపరంగాగానీ, నైతికంగాగానీ ఏ విధంగాను సమ్మెహక్కు లేదన్నది అత్యున్నత న్యాయస్థానం. ఈ తీర్పుతో సమ్మెలు ఆగుతాయా? ఆగాయా? 1886లోనే చికాగో వీధుల్లో 8గంటల పనిదినం కోసం పోరాడిన కార్మిక నేతలకు నాటి కోర్టు ఉరిశిక్ష విధించింది. అయినా పోరాటాలు ఆగలేదు సరికదా ఆ అనుభవాలు ప్రపంచమంతా మేడే రూపంలో పోరుబాటను ఉద్బోదిస్తున్నాయి. చరిత్రలో జరిగిన సమ్మెలన్నీ చట్టాలో, రాజ్యాంగాలో పెట్టిన భిక్షకాదు. చట్టాలకు, రాజ్యాంగాలకు వాటినాపడమూ సాధ్యంకాలేదు.

మన దేశంలో 1860లోనే యజమానులు, కార్మికుల వివాదాల చట్టం రూపొందించారు. అవిధేయతా ఆరోపణలతో కార్మికులకు జరిమానాలు, జైలుశిక్ష విధించే అధికారం యజమానులకిచ్చారు. వర్క్‌మెన్స్ బ్రీచ్ ఆఫ్ కాంట్రాక్టు యాక్టు కూడా ఇలాంటిదే. దుర్భర పరిస్థితులకు తట్టుకోలేక పారిపోయే కార్మికులను నిర్బంధించి, బలవంతంగా పనిలోపెట్టేందుకు ఈ చట్టాలనుపయోగించారు. ఈ పరిస్థితుల నుండి బయటపడేందుకు కార్మికవర్గం అనేక పోరాటాలు చేసింది. 1862లోనే 1200మంది హౌరా రైల్వే కార్మికులు, 8గంటల పనిదినం కోసం నిరవధిక సమ్మె చేశారు. ఆనాటికింకా దేశంలో రాజకీయ పార్టీలుగానీ, ట్రేడ్ యూనియన్లుగానీ పుట్టలేదు. అనేక పోరాటాల పర్యవసానంగానే 1926లో ట్రేడ్ యూనియన్ చట్టం ద్వారా యూనియన్ పెట్టుకునే హక్కును చట్టబద్ధం చేయక తప్పలేదు. అనేక చట్టాలు కార్మికవర్గం పోరాడి సాధించుకున్నది.

ప్రభుత్వోద్యోగుల కద లికను నియంత్రించేందుకు 1860లోనే ప్రభుత్వం సర్వీసు రెగ్యులేషన్స్ రూపొందించేందు కు ప్రయత్నించింది కానీ వీటిలో ఎక్కడా ఉద్యోగులు రాజకీయాలలో పాల్గొనటం మీద



ఆంక్షలు విధించలేదు. దేశంలో ఆనాటికి రాజకీయ పార్టీలు లేకపోవటమే ఇందుకు కారణం. 1885 తర్వాత ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ ఆధ్వర్యంలో స్వాతంత్ర్యోద్యమం సాగటంతో, ఉద్యోగులు కూడా ఆవైపు ఆకర్షితులయ్యారు. దానిని నివారించేందుకే 1904లో రూపొందించిన ఉద్యోగుల ప్రవర్తనా నియమావళిలో రాజకీయాలలో పాల్గొనటం మీద ఆంక్షలు విధించారు.

కార్మికవర్గానికి సమ్మెహక్కు ఒకరిస్తే వచ్చింది కాదు. లేదంటే లేకుండా పోదు. ఇది కార్మికవర్గం జన్మహక్కు. కార్మికవర్గం ఆవిర్భావంతోనే, సహజంగానే సంక్రమించిన హక్కు. ఈ పోరాటాలతోనే అనేక హక్కులు చట్టబద్ధం చేసుకోగలిగాం. కొన్ని సర్వామోదం పొందిన సాంప్రదాయాలుగా మలుచుకోగలిగాం.

డిస్మిస్ అయిన కార్మికులు తప్పు చేయలేదని రుజువై, తిరిగి పనిలో చేర్చుకోవాలని న్యాయస్థానం ఆదేశించినప్పటికీ, తొలగించిన కాలానికి వేతనాలు చెల్లించనవసరం లేదని సుప్రీంకోర్టు మరో తీర్పులో చెప్పింది. ఇది యజమానుల చేతిలో మరో ఆయుధంగా మారింది. కార్మికులను, ఉద్యోగులను, యూనియన్ నాయకులను వేధించడానికి యాజమాన్యాలకు, అధికారులకు శక్తినిచ్చినట్లయ్యింది. వేధించదలచిన వారిని, ఏ ఆరోపణా లేకుండా, విచారణలేకుండా తొలగించవచ్చు. ఏండ్ల తరబడి ఉద్యోగులు న్యాయస్థానాల చుట్టూ తిరిగి, కేసు గెలిచి వస్తే, మళ్ళీ చేర్చుకోవచ్చు. ఆ కాలమంతా ఆర్థికంగా అనేక ఇబ్బందుల పాలవుతారు కార్మికులు. హైర్ అండ్ ఫైర్ పద్ధతిని బలపరచేందుకు, యజమానులకు, అధికారులకు మరింత బలం చేకూర్చేందుకే ఈ తీర్పు తోడ్పడుతున్నది.

పర్మినెంటు ఉద్యోగితో సమానంగా పని చేస్తున్నంత మాత్రాన, కాంట్రాక్టు ఉద్యోగికి సమానవేతనం అడిగే హక్కు కూడా లేదని సుప్రీంకోర్టు మరో తీర్పులో చెప్పింది. ఈ తీర్పు సమానపనికి సమాన వేతనం ఇవ్వాలని చెబుతున్న ఈక్వల్ రెమ్యూనరేషన్ చట్టాన్ని వెనక్కి నెట్టింది. శాశ్వత స్వభావం గల పనులలో కాంట్రాక్టు పద్ధతిలో ఉద్యోగులను నియమించి, అతి తక్కువ వేతనాలతో చాకిరీ చేయించుకునేందుకు ప్రభుత్వానికి, పెట్టుబడిదారులకు ఇది అవకాశమిచ్చింది. ఇప్పటిదాకా యజమానులు చట్టవిరుద్ధంగా చేస్తున్న ఈ దోపిడీని, ఈ తీర్పు చట్టబద్ధం చేస్తున్నది. కాంట్రాక్టీకరణ, క్యాజువలైజేషన్ విస్తరించడానికి ఊతమిస్తున్నది.

కాంట్రాక్టు లేబరు (అబాలిషన్ అండ్ రెగ్యులేషన్) చట్టం ప్రకారం ఏ సంస్థ లేదా రంగంలోనైనా కాంట్రాక్టు లేబరు వినియోగాన్ని నిషేధించేందుకు సంబంధిత ప్రభుత్వానికి అధికారం ఉన్నది. కాంట్రాక్టు విధానం రద్దైన చోట, అప్పటికే అనేక సంవత్సరాలుగా పని చేస్తున్న కాంట్రాక్టు కార్మికులను రెగ్యులరైజ్ చేయటం ఆనవాయితీగా వస్తున్నది. కాంట్రాక్టు విధానం నిషిద్ధం అని చెప్పటంలోనే, వారితో పర్మినెంట్ ప్రాతిపదిక మీద పని చేయించుకోవాలన్న అర్థం కూడా ఇమిడియున్నది. కానీ కాంట్రాక్టు విధానం నిషేధించినంత మాత్రాన, అప్పటికే పని చేస్తున్న కాంట్రాక్టు కార్మికులను రెగ్యులరైజ్ చేయాలని కోరే హక్కు లేదని సుప్రీంతీర్పు నిచ్చింది. దీనితో కాంట్రాక్టు కార్మికుల పరిస్థితి పెనం మీద నుండి పొయ్యిలో పడినట్లయ్యింది. వారు రెగ్యులరైజ్ కాకపోగా, కాంట్రాక్టు పద్ధతిలో ఉన్న ఉపాధి కూడా పోయింది. ఇలాంటి తీర్పులొచ్చిన తర్వాత, కాంట్రాక్టు కార్మికుల వినియోగాన్ని నిషేధించాలని ఎవరైనా కోరుకుంటారా ఇక? యాజమాన్యాల కింతకన్నా ఏమి కావాలి?

సంవత్సరాల తరబడి దినసరి వేతన ఉద్యోగులుగా పని చేసిన వారికి రెగ్యులరైజేషన్ కోరేందుకు అర్హతలేదని సుప్రీంకోర్టు చెప్పింది. దీనితో రెగ్యులరైజేషన్ కోరే హక్కును నిరాకరించటమే కాకుండా, దినసరి కూలీల పేరుతో తక్కువ వేతనంతో యాజమాన్యాలు, పాలకులు శ్రమదోపిడీ కొనసాగించేందుకు కూడా ఈ తీర్పు తోడ్పడుతున్నది. తాత్కాలిక ప్రాతిపదికన నియామకాలు కొనసాగించడం ద్వారా, అన్ని రకాలు హక్కులు, సౌకర్యాలు నిరాకరించేందుకు పాలకులకు, యాజమాన్యాలకు స్వేచ్ఛ లభించింది. వీరు రెగ్యులరైజేషన్ కోరడాన్ని నిరాకరిస్తూ, బయట కుప్పలు తెప్పలుగా నిరుద్యోగులున్నారని కూడా కోర్టు వ్యాఖ్యానించింది. ఉద్యోగులు న్యాయంకోసం పోరాడినపుడల్లా పాలకులు నిరుద్యోగుల పట్ల మొసలి కన్నీరు కార్చటం ఆనవాయితీ. ఈ వ్యాఖ్యలు, పాలకుల దుర్నీతి కొనసాగింపుకే తోడ్పడతాయి.

పని స్థలంలో నిద్రించటం, పై అధికారులను దుర్భాషలాడటం ఉద్యోగులను తొలగించడానికి తగిన కారణాలుగా సుప్రీంకోర్టు అంగీకరించింది. ఉద్యోగుల ప్రవర్తనా నియమావళికి సంబంధించి తప్పులను చిన్న తప్పులు, పెద్ద తప్పులుగా విభజించటం ఇప్పటి వరకు ఉన్న పద్ధతి. మోడల్ స్టాండింగ్ ఆర్డర్స్ కూడా ఈ విభజనను అంగీకరిస్తున్నాయి. నిద్రించటం, తిట్టటం చిన్న తప్పులవుతాయి. కానీ సుప్రీం తీర్పుతో చిన్న తప్పులకు అతిపెద్ద శిక్ష విధించేందుకు అవకాశం ఏర్పడింది.

దేవెగౌడ ప్రధానిగా ఉండగా సాక్షాత్తూ పార్లమెంటు సమావేశాలలో కునుకుతీసిన విషయం మీడియా చూపించింది. అనేక మంది మంత్రులు, అధికారులు, అధికారిక కార్యకలాపాలలో ఉండగా కునికిపాట్లు పడటం చూస్తున్నాం. ఒక సమావేశంలో రాష్ట్ర ముఖ్యమంత్రి వై.ఎస్., ఆయన వెనకే ఉండవల్లిన సూరీడూ నిద్రిస్తున్న ఫోటో పత్రికలు ముద్రించాయి. వీరందరినీ పదవుల నుండి, ఉద్యోగాల నుండి తొలగించగలమా? మరి సాధారణ ఉద్యోగులకెందుకీ శిక్ష?

సమస్య కోర్టు విచారణలో ఉండగా, దాని పరిష్కారం కోసం ధర్నాలు, ప్రదర్శనలు నిర్వహించటంగానీ, వ్యాసాలు రాయటంగానీ చేయరాదని కోర్టు చెప్పింది. ఇది యజమాన్యాలకు, పాలకులకే తోడ్పడుతుంది. ప్రధాన సమస్యలన్నీ చర్చల ద్వారా పరిష్కరించకుండా, పోరాటాలకు అవకాశం లేకుండా, న్యాయస్థానాలకు నివేదించటానికే దారి తీస్తుంది. న్యాయస్థానంలో ఉన్నదనే పేరుతో సంవత్సరాల తరబడి అన్యాయాలు కొనసాగడానికి దారితీస్తుంది.

ప్రైవేటు వృత్తి కళాశాలలో ఫీజులు నిర్ణయించుకునే స్వేచ్ఛ యాజమాన్యాలకిస్తూ సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు, పేదలు, దళితులు, గిరిజనులు, వెనుకబడిన తరగతుల వారిని హతాశులను చేసింది. చదువు "కొనగల్గిన" వారికే అవకాశం దొరికే విధానానికి అవకాశం ఇచ్చింది. అన్ని పార్టీలు ఏకాభిప్రాయంతో, చట్టాన్ని సవరించటం ద్వారానే, కోర్టు తీర్పు పర్యవసానాలను నివారించగల్గాయి.

## సహజ న్యాయ సూత్రాలు వర్తించవా?

సమ్మెహక్కు లేదని సుప్రీంకోర్టు వ్యాఖ్యానించిన సందర్భంగా సహజ న్యాయసూత్రాలను కూడా పరిగణనలోకి తీసుకోలేదు. లక్షకుపైగా ఉద్యోగులను తమిళనాడు ప్రభుత్వం, కనీసం చార్జిషీటుగానీ, మెమోగానీ, విచారణ, రుజువులుగానీ లేకుండా ఏకపక్షంగా డిస్మిస్ చేయడాన్ని కోర్టు సమర్థించింది. సమ్మె చేసిన ఉద్యోగుల మీద ప్రయోగించిన ఈ పద్ధతి, ఇతర సందర్భాలలో వినియోగించలేదు. అవినీతి కుంభకోణాల విషయంలో, రుజువులు, విచారణల పేరుతో ఏండ్ల తరబడి, ఎవరినీ శిక్షించకపోవటం చూస్తూనే ఉన్నాం. అవినీతి ఆరోపణలతో కేసులు ఎదుర్కొంటున్న సమయంలోనే, ఇంకా రుజువు కాలేదన్న సాకుతో ఏకంగా ముఖ్యమంత్రి పదవి నిర్వహిస్తూ, ఏ రుజువులూ అవసరం లేకుండానే ఉద్యోగులను మాత్రం జయలలిత శిక్షించింది. ఇదే సూత్రం ఆమెకెందుకు వర్తింపజేయలేదు? మధ్యతరగతి ప్రజలు దాచుకున్న కోట్లాది రూపాయలు కొల్లగొట్టిన హర్షద్ మెహతా చనిపోయేదాకా కేసు తేలలేదు. బోర్డులు తిప్పేస్తున్న అర్బన్ కోఆపరేటివ్ బ్యాంకుల విషయంలోనూ అదే తంతు. జాతీయ బ్యాంకులకు ఐదులక్షలకోట్లు ఎగవేసిన పెట్టుబడిదారులకు ఏ శిక్ష వేశారు? తెహల్కా కుంభకోణంలో ఉన్న నేతలనేం చేశారు? పట్టపగలు, గంటల తరబడి బాబ్రీమసీదును కూందోసిన బిజెపి, ఆర్.ఎస్.ఎస్., విశ్వహిందూపరిషత్ నాయకులను, సాక్ష్యాలు, ఆధారాలు, రుజువుల పేరుతోనే ఇంతవరకు శిక్షించలేదు. పైగా వీరిలో అనేకమంది, తర్వాత కేంద్రమంత్రులుగా పని చేశారు. విచారణ లేకుండా శిక్షిస్తే వీరంతా ఇప్పుడు జైలు గోడల మధ్య ఇనపచువ్వలు లెక్కించాలి కదా! నేరస్తులకు సైతం వర్తించే సహజ న్యాయసూత్రాలు, కార్మికవర్గానికెందుకు వర్తించవు?

పెట్టుబడిదారీ వ్యవస్థ సృష్టించేదే అవినీతి. సరళీకృత ఆర్థిక విధానాలతో అది మరింత పెరుగుతున్నది. కానీ కార్మికవర్గ పోరాటం పెట్టుబడిదారీ విధానం రద్దుకు దారితీస్తుంది. అందుకే పెట్టుబడిదారీ విధానం అమలు జరిపే ఈ పాలకులు సమ్మెహక్కు ఉండరాదని కోరుకుంటారు. సమ్మె చేసిన వారిని విచారణ లేకుండా శిక్షించే అధికారం కూడా ఉండాలంటారు. సమ్మెహక్కు మీద సుప్రీంకోర్టు వ్యాఖ్యలు ఈ పాలకవర్గాల ప్రయోజనాలు కాపాడేందుకే తోడ్పడుతాయి.

## ప్రజాస్వామ్యానికి ముప్పు

పై తీర్పులన్నీ ఆచరణలో అత్యధిక ప్రజల హక్కులను హరిస్తున్నాయి. అంతేకాదు. బంద్‌లు నిర్వహించడాన్ని కూడా సుప్రీంకోర్టు తప్పుపట్టింది. స్వాతంత్ర్యోద్యమంలో గాంధీజీ వినియోగించిన సాధనమిది. ఇది తప్పయితే స్వాతంత్ర్యోద్యమం గురించే అనేక ప్రశ్నలు తలెత్తుతాయి. ఇంతటితో ఆగలేదు. కోల్‌కతా హైకోర్టు ఏకంగా ఉదయం నుండి సాయంత్రం వరకు పనిదినాలలో ప్రదర్శనలను కూడా ప్రశ్నించింది. సమస్య పరిష్కారంకోసం ప్రదర్శనగా వెళ్లి మంత్రులకు, అధికారులకు వినతిపత్రాలివ్వటం సహజం. కార్యాలయాలు పని చేసే సమయంలో ప్రదర్శనలు నిర్వహించవద్దంటే, ఉదయం 8గంటల లోపు, రాత్రిపూట ప్రదర్శనలు నిర్వహించాలా? అప్పుడెవరికి వినతి పత్రాలివ్వాలి? ఎక్కడ ఇవ్వాలి?

పాలకులుగానీ, యాజమాన్యాలుగానీ, దౌర్జన్యకారులుగానీ, మరెవరైనా ప్రజాస్వామ్య హక్కులను హరించినప్పుడు న్యాయం కోసం న్యాయస్థానాల నాశ్రయిస్తారు. న్యాయస్థానాలు ప్రజాస్వామ్యాన్ని కాపాడే స్థానాలుగా ఉండాలని కోరుకుంటారు. సమ్మెలు, ధర్నాలు, ప్రదర్శనలు, బంద్‌ల మీద ఆంక్షలు విధించిన తర్వాత ఇక ప్రజాస్వామ్యానికి అర్థం ఏముంటుంది?

ఇంతటి కీలకాంశాలు, విధానాంశాల మీద తుది నిర్ణయం ప్రజలదీ, ప్రజల చేత ఎన్నుకోబడిన శాసనసభలదా? లేక ప్రజలకు ప్రత్యక్షంగా జవాబుదారీ కానటువంటి అధికారులు, న్యాయమూర్తులదా అన్న మౌలిక ప్రశ్న ముందుకొస్తున్నది.

## న్యాయ వ్యవస్థ పయనం ఎటువైపు?

2001లో ఆర్టీసీ పరిరక్షణ కోసం కార్మికులు సమ్మె చేసినప్పుడు, జోక్యం చేసుకోడానికి కోర్టు నిరాకరించింది. చట్టబద్ధంగా జరుగుతున్న సమ్మె పరిష్కారం బాధ్యత ప్రభుత్వానిదే నన్నది. కానీ అదే కోర్టు, గత సంవత్సరం ఆర్టీసీ పరిరక్షణ సమ్మెలో జోక్యం చేసుకున్నది. చట్టం మారలేదు. కోర్టు వైఖరి మాత్రం మారింది. మొదట సమ్మె విరమించాలని ఆదేశించింది. తర్వాత సమ్మె జరిగినా, ప్రజా ప్రయోజనాలకోసం ప్రభుత్వం ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేయాలని ఆదేశించింది. ఈ రెండూ పారిశ్రామిక వివాదాల చట్టానికి వ్యతిరేకం. ఇలాంటి ఆదేశాల పర్యవసానం కోర్టులోతుగా పరిశీలించిందా? గతంలో విద్యుత్తు ఉద్యోగుల సమ్మెలోను కోర్టు జోక్యం ఆందోళన కలిగించింది. సమ్మె విరమించనట్లయితే సమ్మెవల్ల జరిగే నష్టాన్ని యూనియన్ భరించాలని ఆదేశాలు ఇవ్వవలసి ఉంటుందని హెచ్చరించింది న్యాయస్థానం. సమ్మె విరమణకు అంగీకరించిన తర్వాత, యూనియన్ల అభిప్రాయాలను ఓర్పుతో ప్రభుత్వం వినాలని ఆదేశించింది. మంత్రివర్గ ఉపసంఘం యూనియన్‌ల ప్రతినిధుల అభిప్రాయాలు ఓర్పుతో విన్నది. ఒక్కదానికీ సమాధానం చెప్పలేదు. అదేమిటని ప్రశ్నిస్తే, కోర్టు ఓర్పుతో వినాలని చెప్పింది, విన్నాం అన్నారు మంత్రులు. కోర్టు జోక్యం ఎవరికి తోడ్పడిందో స్పష్టంగానే తేలింది.

ఆర్టీసీ, జూనియర్ డాక్టర్స్ సమ్మెలు, కేరళలో బంద్‌లు, కోల్‌కతా ప్రదర్శనల సందర్భంగా ప్రజాప్రయోజనాల గురించి న్యాయస్థానం ప్రస్తావించింది. ప్రజలంటే ఎవరు? ఆర్టీసి కార్మికులు, ఆర్టీసి ధ్వంసమైతే నష్టపోయే ప్రయాణీకులు, జూనియర్ డాక్టర్లు, ప్రభుత్వాసుపత్రులలో సౌకర్యాలు లేనట్లయితే నష్టపోయే పేదలు; ధర్నాలు, ప్రదర్శనలు, బంద్‌లు నిర్వహించే వారు, వారందరి కుటుంబీకులు ప్రజలు కాదా? ఆందోళనకారులు, ఆందోళనతో ప్రయోజనం పొందేవారు మినహాయించి, మిగతా వారు మాత్రమే ప్రజలని చెప్పగలమా?

ఆర్టీసీని ప్రైవేటీకరించినా ఫర్వాలేదని ప్రజాప్రయోజనాలు ముఖ్యమనీ హైకోర్టు వ్యాఖ్యానించింది. కోర్టు విధానపరమైన విషయాలలో వ్యాఖ్యానించవచ్చా? ఆర్టీసి ప్రైవేటు పరమైతే సాధారణ ప్రజలు నష్టపోతారు కదా! కోర్టు ఏ ప్రజల గురించి మాట్లాడినట్లు?

సమ్మెహక్కు గురించి వ్యాఖ్యానించిన సందర్భంలో సుప్రీంకోర్టు న్యాయబద్ధమైన సమస్యల పైన కూడా సమ్మె చేయరాదన్నది.

స్వాతంత్ర్యానికి ముందు పాలకులు కూడా ఇదే వాదన చేశారు కదా! నేటి వర్గ సమాజంలో ఇలాంటి వాదనలు ఎవరికి తోడ్పడతాయో తెల్సిందే! ప్రస్తుత పరిస్థితులలో సమ్మె చేయటం సరైంది కాదన్నది. ఏ పరిస్థితుల గురించి కోర్టు ప్రస్తావించింది? సరళీకృత ఆర్థిక విధానాల నేపథ్యం గురించేనా? న్యాయస్థానం సరళీకృత ఆర్థిక విధానాల కనుగుణంగా తీర్పు చెబుతున్నట్లు భావించవచ్చా? అదే అయితే మెజారిటీ ప్రజల ప్రయోజనాలెవరు కాపాడాలి? సమాన పనికి సమాన వేతనం నిరాకరించిన తీర్పులో మరింత స్పష్టంగా సుప్రీంకోర్టు చెప్పింది. ప్రభుత్వ విధాన నిర్ణయాలు, మార్కెట్ ఆర్థిక వ్యవస్థ, ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ నేపథ్యంలో సమాన వేతనం సాధ్యం కాదన్నది. న్యాయస్థానం కూడా ప్రపంచీకరణకు లోబడి తీర్పు చెబితే, కార్మికవర్గానికి మిగిలింది పోరాట మార్గమే కదా! సమస్యలు పరిష్కారం కావాలనుకున్నప్పుడు మరింత చిత్తశుద్ధితో, సమర్థవంతంగా అదనంగా పని చేయాలని కోర్టు సూచించింది. అనాదిగా పెట్టుబడిదారులూ చెబుతున్నది ఇదే కదా!

న్యాయవ్యవస్థను సమాజం నుండి వేరు చేసి చూడలేం. అన్ని రంగాల మీద ప్రభావం చూపినట్టే, న్యాయవ్యవస్థ మీద కూడా ప్రపంచీకరణ ప్రభావం ఉంటుంది. ప్రపంచీకరణ, సరళీకృత ఆర్థిక విధానాల మీద పోరాడటం ద్వారానే ప్రజాస్వామ్యాన్ని, న్యాయవ్యవస్థనూ కాపాడుకోగలం.

### రాజకీయ పార్టీలు ఏమంటున్నాయి?

సాధారణ పరిస్థితుల్లో అన్ని పార్టీలూ ప్రజాస్వామ్యం గురించీ, పేదల హక్కుల గురించే మాట్లాడతారు. కానీ న్యాయస్థానాలు సమ్మెహక్కును, బంద్‌ను, ప్రదర్శనలను ప్రశ్నించినపుడు ఏ పార్టీ ఏ వైఖరి తీసుకున్నది? సమ్మెహక్కు గురించి ఐఎల్‌ఓ రాసిన లేఖకు ఆనాటి వాజ్‌పేయి ప్రభుత్వం సుప్రీం తీర్పును సమర్థిస్తూ సమాధానమిచ్చింది. సుప్రీంతీర్పును ఆనాటి ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు హర్షించారు. సమ్మెహక్కును రాజ్యాంగంలో చేర్చుతూ రాజ్యాంగ సవరణ చేస్తామని హామీ ఇచ్చిన యుపిఏ పాలకులు, ఆ ప్రస్తావనే మరిచారు. ఇక్కడ రాష్ట్ర కాంగ్రెసు ప్రభుత్వం ఆర్టీసి సమ్మె మీద మూడో కాలుపై లేచింది.

సుప్రీం తీర్పును కేవలం వామపక్షాలు ప్రశ్నించాయి. పశ్చిమబెంగాల్ వామపక్ష ప్రభుత్వం, తమ రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల సర్వీసు రెగ్యులేషన్స్‌లో 80వ దశకంలోనే సమ్మెహక్కును చేర్చింది. మిగతా ప్రభుత్వాలెందుకీ పని చేయకూడదు? సిపిఎం పొలిట్‌బ్యూరో సభ్యులు జ్యోతిబసు న్యాయవ్యవస్థ తీరు మారే విధంగా కార్మికవర్గం పోరాడాలని బహిరంగంగానే పిలుపునిచ్చారు. ప్రదర్శనలపైన కోల్‌కతా కోర్టు వ్యాఖ్యలను ప్రశ్నించిన వామపక్ష నాయకులు కోర్టు కేసులు ఎదుర్కొంటున్నారు. ఇంతెందుకు? సమ్మెహక్కు కోసం దేశ కార్మికవర్గం చేసిన సమ్మెకు కేవలం వామపక్షాలు మాత్రమే అండగా నిలిచాయి

వృత్తి కళాశాలలు ఫీజులు నియంత్రించాలని చట్టసవరణ జరగగానే కేరళ వామపక్ష ప్రభుత్వం చట్టం చేసింది. బెంగాల్‌లో ప్రైవేటు కళాశాలలో అతితక్కువ, వాటిలో కూడా ఇప్పటికే ప్రభుత్వమే ఫీజులు నియంత్రిస్తున్నది. మిగతా ప్రభుత్వాలు ఈ పని ఎందుకు చేయటం లేదు?

ప్రస్తుత వ్యవస్థ కొనసాగాలని కోరుకునే రాజకీయ శక్తులకు న్యాయవ్యవస్థలో వస్తున్న పరిణామాలు సంతోషం కల్గిస్తున్నాయి. ఈ విధానాలు సమూలంగా మారాలని కోరుకునే రాజకీయ శక్తులు సహజంగానే న్యాయవ్యవస్థలో వస్తున్న మార్పులకు ఆందోళన చెందుతాయి. ప్రజా ఉద్యమాలకు అండగా నిలుస్తాయి. ◆

# సుప్రీంకోర్టులోనే చుక్కెదురయితే కార్మికులకు న్యాయం ఎవరిస్తారు?

- మాడభూషి శ్రీధర్

ఇప్పటి సామాజిక జీవనంలో ఉద్యోగమే ఆస్తి. ఆస్తి హక్కు ఉన్నా లేకపోయినా ఉద్యోగం కూడా పోతే మనిషి జీవన హక్కు కూడా భంగపడినట్టే. ఉద్యోగం లేకపోతే ఉద్యోగ హక్కు ఉంది అని ఏ సామాన్యుడు కోర్టుకు వెళ్లి పరిష్కారం కోరే అవకాశం లేదు. కాని వచ్చిన ఉద్యోగం కాపాడుకోవడానికి హక్కులను కార్మిక చట్టాలు ఇచ్చాయి. ఆ చట్టాలన్నీ నిజంగా కార్మిక సంక్షేమ చట్టాలు. లాభాల ఆశతో పడి డబ్బు యావలో తలమునకలై పరిశ్రమల యజమానులు కార్మికుల చిన్న లాభాలను, ప్రయోజనాలను వమ్ము చేయకుండా కాపాడడమే ఆ చట్టాల లక్ష్యం. ఉన్నట్టుండి ఉద్యోగం తొలగించినా, చిన్న తప్పులకు పెద్ద శిక్షలు వేసినా, తొలగింపు తరువాత ప్రయోజనాలు రాకుండా చేసినా కార్మిక న్యాయస్థానంలో రక్షణ లభిస్తుంది. ఆ చిన్న ఉద్యోగి మీద ఆధారపడి జీవిస్తున్న వారికి కాస్త ఊరట లభిస్తుంది. కార్మిక సంఘాలు పనివారి ప్రయోజనాలకోసం సమష్టిగా ప్రయత్నించడం, కోర్టులు చట్టాల దాకా వెళ్లకుండా సంప్రదింపుల ద్వారా చాలామంది కార్మికుల సమస్యలు ఒకేసారి పరిష్కరించడం కూడా సంక్షేమ కార్యక్రమమే. డబ్బు ప్రాధాన్యత, వ్యాపార లక్షణాలు, అవసరాలకు పరిమితమయిన ఆలోచనల వల్ల ఈ చట్టాల లక్ష్యాలు అదుబాటులోకి రాకుండా పోయే ప్రమాదం ఉంది. ఈ ప్రమాదాల నుంచి రక్షించవలసింది కార్మిక న్యాయస్థానాలు, హైకోర్టులు, సుప్రీంకోర్టు మాత్రమే.

కాని ఇటీవల కార్మిక సంక్షేమానికన్న పారిశ్రామిక ప్రయోజనాలవైపే న్యాయదేవత తరాజు ఎక్కువ మొగ్గు చూపడం ఒక ఆశ్చర్యకర పరిణామం. చాలా స్పష్టంగా, విరంగా న్యాయస్థానాలలో కార్మికుల ఉద్యోగ ప్రయోజనాల కన్న, శాసన నియమాల కృశమయిన అన్వయానికి, కఠినమయిన శిక్షలకు అనుకూల వాతావరణం కల్పిస్తున్నది. ముఖ్యంగా 2005లో వచ్చిన తీర్పులు మౌలికంగా కార్మిక చట్టాల ఉద్దేశాలనే సందేహాస్పదంగా మార్చేసాయి.



తమిళనాడు ప్రభుత్వోద్యోగుల సమ్మెపట్ల న్యాయవ్యవస్థ ప్రతిస్పందన ఈ దేశ కార్మికలోకాన్ని దిగ్భ్రాంతికి గురిచేసింది. మూకుమ్మడిగా లక్షలాదిమందిని బర్తరఫ్ చేయగల శక్తి ఒక ప్రజాస్వామిక ప్రభుత్వానికి ఉండడం, ఆ శక్తి అప్రతిహతమయినదని పరిణామాలు రుజువుచేయడం చాలా దురదృష్టకర పరిణామం. ప్రపంచ చరిత్రనే మార్చి రాసిన సమ్మె కష్టాల్లో పడింది యాజమాన్యాల వల్ల కాదు. అత్యున్నత తీర్పులవల్ల. అసలు సమ్మె చేసే హక్కులేదనే ప్రకటన రావడం భారత ప్రజాస్వామ్యంలో ఒక అనూహ్యమైన సంఘటన. దేశ స్వాతంత్ర్య సమరాన్ని తీర్చిదిద్దిన బంద్‌లు ప్రస్తుతం మరీ ఎక్కువయిపోయి, విసుగొచ్చి, బంద్ కావడానికి చేరువగా ఉన్నాయి. బంద్ పిలుపులు ఇవ్వడానికి రాజకీయ పార్టీలు, కార్మిక సంఘాలు ఒకటికి రెండుసార్లు ఆలోచించవలసిన పరిస్థితి వచ్చేసింది.

కార్మికుల సమష్టి బలాన్ని దెబ్బతీసే సూత్రాలు ఒకటొకటే పాదుకుంటున్నాయి. ధర్నాలు, బైఠాయింపులు, ఘెరావ్‌లు, సమ్మెలు యాజమాన్యాలపైన తిరుగుబాటు లక్షణాలుగా పరిగణించాలా లేక సమష్టి కార్మికశక్తిగా వారికి పెట్టుబడుల ప్రభావాలను తట్టుకునే సామర్థ్యం ఇచ్చే లక్షణాలా అర్థం కాని పరిస్థితి వచ్చింది. ఒకవైపు సమ్మె చేసే హక్కులేదనే సమ్మెటపోటు వంటి తీర్పు, మరోవైపు బలవంతపు బంద్‌లు వద్దనే తీర్పులు ఒక వింత వాతావరణం కల్పించాయి. కలకత్తా న్యాయమూర్తి కారు కదలడానికి అడ్డుపడిన ప్రదర్శన ఎందుకని నిషేధించడం మరో సంఘటన.

పాలకవర్గాలు, యాజమాన్యాలు, పారిశ్రామికవేత్తల లాభాల ఆశ కారణంగా హక్కుల మీద వేటు పడడం ఇదివరకు పరిణామాలు. చట్టసభలు, చట్టాలు కార్మిక హక్కులను హరించడం లేదు. అవే పాత చట్టాలు, అవే పాత సంక్షేమ నియమాలు ఇప్పుడు కొత్త కొత్త అన్వయాల సొగసులు అద్దుకుని క్రమశిక్షణను శాసిస్తున్నాయి. ఏ తప్పు చేసినా

సరే కార్మికుడు వెంటనే కఠినమైన శిక్షలకు గురి అయ్యేందుకు అన్ని రంగాలు అనుకూలంగా ఉన్నాయి. ప్రజలకు అసౌకర్యాలు కలిగిస్తు న్నాయన్న ఒక పెద్ద ప్రయోజనం కొన్ని వర్గాల హక్కులను, చివరకి ఒక సామాన్య కార్మికుడి జీవన కారణమయిన ఉద్యోగాన్ని హరించే ప్రమాదం స్థిరపడిపోతున్నది. నిరంతరంగా హక్కుల హరణ సాగుతున్నది. ఒక సామాన్య ఉద్యోగిని ఎట్టి పరిస్థితిలోనైనా సరే ఉద్యోగం నుంచి తొలగించి తీరాలనే యాజమాన్యాల పట్టుదలకు లిటిగేషన్ పట్టుగొమ్మగా మారిపోయింది. కొన్ని యాజమాన్యాల కన్న తీర్పులే కఠినంగా ఉండడం విశేషం. కార్మిక న్యాయస్థానం కింది స్థాయిలో న్యాయం చేసినా, దాన్ని హైకోర్టు సమర్థించినా, కొన్ని ధర్మ సూక్ష్మాల పరిశీలన సరిగా జరగలేదని అత్యున్నత న్యాయస్థానం యాజమాన్య అనుకూల తీర్పులు అనేకం 2005లో వచ్చాయి. ఒక తాత్కాలిక కార్మికుడు జిల్లా కార్మిక న్యాయస్థానం నుంచి గెలుస్తూపోయి యాజమాన్యంతో సుప్రీంకోర్టు దాకా సాగిన పోరాటంలో అమరుడవుతున్నాడు.

బెన్నెట్ కాలమన్ కార్మికులు ఇద్దరు అనుచిత ప్రవర్తన కారణంగా ఉద్యోగం కోల్పోయారు. వారి బర్తరఫ్ సక్రమమే అని తీర్పు వచ్చింది. అంతే కాదు వారికి గ్రాట్యుటీ ఇవ్వవలసిన అవసరం లేదని కూడా న్యాయస్థానం వివరించింది. పై అధికారితో కొట్లాడినందుకు మధ్యప్రదేశ్ ఎలక్ట్రిసిటీ బోర్డు ఉద్యోగి బర్తరఫ్‌ను చట్టబద్ధమే అన్నారు. భారత్ ఫోర్జ్‌లో ఉద్యోగి నిద్రపోయినందుకు బర్తరఫ్ చేయడం అన్యాయమన్న కేసు సుప్రీం కోర్టు దాకా వచ్చింది. పనిసమయంలో నిద్రపోవడం ఎంత తీవ్రమయిన అక్రమశిక్షణ అంటే దానికి బర్తరఫ్ మాత్రమే సరయిన, సరిపోయిన శిక్ష అని సుప్రీం కోర్టు వివరించింది. మహీంద్రా మహీంద్రా కేసులో తన పై అధికారిని దుర్భాషలాడినందుకు ఉద్యోగం తొలగించడం సరయిందే అని పదకొండు సంవత్సరాల సుదీర్ఘ న్యాయపోరాటం తరువాత తేలిపోయింది. అనుచిత ప్రవర్తనను క్షమించవలసిన అవసరం లేదు. కాని అందుకు దారితీసిన పరిస్థితులను కూడా సమీక్షించి ఆ తప్పుకు ఎంత తీవ్రమయిన శిక్ష అవసరం అని ఆలోచించవలసిన చోటనే న్యాయం దొరకకపోతే ఏం చేయడం?

భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ వర్సెస్ ఎం. చంద్రశేఖరరెడ్డి 2005(1) సుప్రీం 447 కేసులో ఒక ఉద్యోగి తాకట్టు పెట్టిన ఆస్తి పత్రాలను సంస్థకు తెలియకుండా మాయం చేసినందుకు క్రమశిక్షణా చర్య తీసుకున్నారు. ఉద్యోగం నుంచి తొలగించారు. తొలగింపు అన్యాయం అని కార్మిక న్యాయస్థానానికి వెళ్లారు. ఆ తప్పుకు అంత తీవ్ర శిక్ష అనవసరం అని అతని ఉద్యోగం అతనికి ఇవ్వాలని కార్మిక న్యాయస్థానం ఆదేశించింది. హైకోర్టుకూడా ఆ తీర్పునే సమర్థించింది. యాజమాన్యం సుప్రీంకోర్టులో అప్పీలు చేసింది. న్యాయమూర్తులు శ్రీ ఎన్. సంతోష్ హెగ్డే, శ్రీ ఎస్.బి. సిన్హాలతో కూడిన ధర్మాసనం యాజమాన్యం తొలగింపు నిర్ణయం అతను చేసిన తప్పుతో పోల్చితే న్యాయస్థానం ఆశ్చర్యపోయేంత ఎక్కువ శిక్ష అయితే తప్ప కార్మిక న్యాయస్థానం జోక్యం చేసుకోవడానికి వీల్లేదని, ఈ కేసులో దిగ్భ్రాంతి చెందేంత గొప్పగా శిక్ష లేదని, అతన్ని తొలగించడం సమంజసమే అని సుప్రీంకోర్టు తీర్పు చెప్పింది. మహీంద్రా మహీంద్రా కేసులో 2005(2) సుప్రీం 140 న్యాయమూర్తులు ఎన్ సంతోష్ హెగ్డే, తరుణ్ చటర్జీ, పికె బాలసుబ్రమణ్యం ఇదే తీర్పును పునరుద్ఘాటించారు. సెక్షన్ 11 ఎ కింద కార్మిక న్యాయస్థానాలకు జోక్యం చేసుకునే విచక్షణ ఉన్నప్పటికీ అది అప్రతిహతమయింది కాదని, దానిమీద పరిమితులు ఉన్నాయని సుప్రీంకోర్టు వివరించింది. తప్పు కొంచెమయితే శిక్ష కోర్టు అంతరాత్మను కలవరపరిచేంత తీవ్రమయిన సందర్భంలో, కార్మికుడిది తప్పు కాదనిపించే మరే పరిస్థితి అయినా ఉందనడానికి సాక్ష్యం ఉంటే తప్ప, కార్మిక న్యాయస్థానం యాజమాన్యం విధించిన శిక్షను మార్చవద్దని సుప్రీంకోర్టు సూత్రీకరించింది. ఈ కేసులో తన పై అధికారిని దూషించాడని, తీవ్ర పదజాలం వాడాడని కార్మికుడిని తొలగించారు. తొలగింపు చాలా క్రూరంగా ఉందని కార్మిక న్యాయస్థానం అతన్ని తిరిగి నియమించాలని ఆదేశించింది. మూడింట రెండువంతుల వెనక్కి వేతనాలు కూడా ఇవ్వాలని ఆదేశించింది. యాజమాన్యం శిక్షలో కోర్టు జోక్యం చేసుకోకుండా ఉండాల్సింది అని సుప్రీంకోర్టు అతని తొలగింపు శిక్షను ఖరారు చేసింది.

ఉద్యోగాల తొలగింపు కన్న తీవ్రమయిన శిక్ష మరొకటి కార్మికులకు విధించే అవకాశం యాజమాన్యానికి లేదు. ఉద్యోగంలో తప్పు చేసినందుకు మరణశిక్ష విధించే అవకాశం లేదు. ఒకవేళ అంత తీవ్రమయిన శిక్ష విధిస్తే న్యాయస్థానం దిగ్భ్రాంతి చెందడం సాధ్యం కావచ్చు. గరిష్ఠమయిన తొలగింపు శిక్ష కూడా న్యాయస్థానాన్ని దిగ్భ్రాంతి చెందించేంత తీవ్రమయిన అతి శిక్ష కాకపోతే, ఇక కార్మికులకు న్యాయం దొరికే అవకాశమే ఉండదు. పారిశ్రామిక వివాదాల చట్టం సెక్షన్ 11 ఎ ప్రకారం కార్మికుల తప్పులకు యాజమాన్యం విధించిన సందర్భంలో ఆ శిక్షతో జోక్యం చేసుకునే అధికారం కార్మిక న్యాయస్థానాలకు ఉంటుంది. దానికిందనే కార్మిక యాజమాన్య వివాదాలన్నీ లేబర్ కోర్టులు వింటున్నాయి. అయితే ప్రతికేసును సుప్రీంకోర్టు దాకా తీసుకు వెళ్లే ఆర్థిక స్తోమత యాజమాన్యాలకు ఉంటుంది. చాలా పెద్ద లాయర్లతో పోరాటం సాగిస్తారు కూడా. కింది కోర్టులో, హైకోర్టులో గెలిచిన కార్మికుడు, సుప్రీంకోర్టులో గెలవలేకపోవచ్చు. కొన్ని సంవత్సరాలపాటు ఈ న్యాయపోరాటాన్ని ఉద్యోగం లేకుండా తట్టుకోగల శక్తి ఒంటరి కార్మికుడికి ఉండదు. రెండు అనుకూలమయిన తీర్పులు వచ్చిన తరువాత కూడా వివాదం ఎడతెగకుండా కొనసాగి, చివరకు అగ్రస్థాయిలో పరాజయం పాలై కార్మికుడు అన్ని విధాలా నష్టమయ్యే కొత్తవిధానం ఇది.

జనరల్ మేనేజర్ హర్యానా రోడ్‌వేస్ వర్సెస్ రుధం సింగ్ కేసులో 2005(1) సుప్రీం 726 ఒక కార్మికుడు 264 రోజులు పనిచేశాడు. ఏడాదిలో 240 రోజులు పనిచేస్తే అతన్ని తొలగించకూడదని, ఒకవేళ తొలగించినా సెక్షన్ 25 ఎఫ్ కింద రిట్రెంచ్‌మెంట్ ప్రయోజనాలు ఇవ్వాలని పారిశ్రామిక వివాదాల చట్టం చెప్తున్నది. ఒక కార్మికుడు 264 రోజులు పనిచేసిన తరువాత అతన్ని తొలగించారు. కార్మిక న్యాయస్థానం అతన్ని తిరిగి నియమించాలని, జీతం బకాయిలు సగం చెల్లించాలని ఆదేశించింది. ఈ కేసు కూడా సుప్రీంకోర్టు దాకా పోయింది. అదృష్టవశాత్తూ అతని తొలగింపు చెల్లదనే అంశంపై సుప్రీంకోర్టు దాకా

ఒక కార్మికుడిని వేధించిన ఈ కేసులో యాజమాన్యం ఖర్చు పెట్టిన దానిలో సగం ఇచ్చినా అతనికి వేతనం బకాయిలు పూర్తిగా దక్కి ఉండేవి. కాని ఏ మాత్రం మానవతా దృష్టి లేకుండా యాజమాన్యం ఒక సామాన్య కార్మికుడిపైన యుద్ధభేరి మోగించడం సుప్రీంకోర్టులో లాయర్ల ఫీజులు ఇచ్చుకోవడానికి వెనుకాడకుండా అమానుషంగా కార్మికుడికి అన్యాయం చేయడం చాలా దారుణం.

ఎపిఎస్ఆర్టిసి వర్సెస్ అబ్దుల్ కరీం 2005(3) సుప్రీం 293 కేసులో ఒక ఉద్యోగి తొలగింపు అన్యాయమని అతన్ని తిరిగి ఉద్యోగంలో నియమించాలని కార్మిక న్యాయస్థానం ఆదేశించింది. దాంతోపాటు అతనికి ఇంక్రిమెంట్లు కూడా ఇవ్వాలన్న డిమాండ్ను సానుకూలంగా పరిశీలించాలని హైకోర్టు ఇచ్చిన ఆదేశాన్ని సుప్రీంకోర్టులో యాజమాన్యం సవాలు చేసింది. న్యాయమూర్తులు శ్రీ అరిజిత్ పసాయత్, శ్రీ హెచ్‌సి సీమాలతో కూడిన ధర్మాసనం ఇంక్రిమెంట్లు ఇవ్వాల్సిన అవసరం లేదని తేల్చి చెప్పింది.

కాంట్రాక్టు కార్మికుల నియామకాన్ని నిషేధించే చట్టం మనకు ఉంది. ఏడాదిలో 240 రోజుల పాటు పనిచేసిన కార్మికుడిని పూర్తి స్థాయి కార్మికుడిగా పరిగణించాలని కూడా చట్టాలు చెప్తున్నాయి. కాని ఈ చట్టాలకు కూడా తూట్లు పడుతున్నాయి. కాదు పడ్డాయి. చీఫ్ ఇంజనీర్ (కన్‌స్ట్రక్షన్స్) వర్సెస్ కేశవరావ్ 2005(2) సుప్రీం 604 కేసులో ఒక కార్మికుడు 240 రోజులకు పైగా పనిచేసాడు. అతన్ని తొలగించారు. అతను రెండువారాల పాటు రాలేదని కనుక తొలగించామని యాజమాన్యం చెప్తున్నది. తనను అన్యాయంగా పనిలోకి రానివ్వలేదని, ఇది తొలగింపు అని అతను కార్మిక న్యాయస్థానాన్ని ఆశ్రయించాడు. ట్రిబ్యునల్ కార్మికుడి వాదాన్ని తోసిపుచ్చింది. హైకోర్టులో రిట్ పిటిషన్ వేసుకున్నాడు. తొలగింపు అన్యాయం అని అతన్ని వెనుక తేదీ నుంచి వేతనాలు ఇచ్చి పనిలోకి తీసుకోవాలని హైకోర్టు ఆదేశించింది. కేసు సుప్రీంకోర్టుకు తీసువెళ్లారు. జస్టిస్ బి.పి. సిన్హా, జస్టిస్ ఎస్.బి. సిన్హాతో కూడిన ధర్మాసనం ఆ కార్మికుడు 240 రోజులు పనిచేసాడా లేదా అని రుజువు చేసుకునే బాధ్యత, భారం కార్మికుడి మీదే ఉంటుందని, లేబర్ కోర్టులో 240 రోజులు పనిచేసాడా అన్న విషయం వివాదాస్పద అంశంగా నమోదు కాలేదని, ఆ విధంగా ఒక అంశాన్ని నమోదు చేసే విచక్షణాధికారం కార్మిక న్యాయస్థానానికి లేదని, 240 రోజులు పనిచేసినట్టు రుజువు చేయలేకపోతే అతన్ని తిరిగి పనిలోకి తీసుకోవలసిన అవసరం లేదని తీర్పు చెప్పింది. హైకోర్టు తీర్పును పక్కన బెట్టింది.

కేవలం 240 రోజులు పనిచేసినంత మాత్రాననే కార్మికుడి ఉద్యోగం శాశ్వత ఉద్యోగంగా క్రమబద్ధం కాదని సుప్రీంకోర్టు మరో తీర్పులో చెప్పింది. మేనేజర్ ఆర్‌బిఐ వర్సెస్ ఎస్. మణి 2005(2) సుప్రీం 589 కేసులో న్యాయమూర్తులు ఎన్. సంతోష్ హెగ్డే, బి.పి. సిన్హా, ఎస్.బి. సిన్హా గార్లు, 240 రోజులు పనిచేసిన ఉద్యోగిని తొలగించిన వెంటనే సెక్షన్ 25 ఎఫ్ కింద రిట్రెంచ్‌మెంట్ బెనిఫిట్ పొందడానికి అర్హత ఆటోమేటిక్‌గా రాదని అతను నిజంగా 240 రోజులు పనిచేసినట్టు లిఖిత పత్రాల ద్వారా నిరూపించుకోవాల్సిన భారం కార్మికుడిపైనే ఉందని వివరించారు. ఈ భారం యాజమాన్యంపైన ఉందని కిందికోర్టు అభిప్రాయపడడం తప్పని సుప్రీంకోర్టు తేల్చింది. కిందికోర్టు అతనికి రిట్రెంచ్‌మెంట్ తేదీ నుంచి వేతనాలు ఇవ్వాలని ఆదేశిస్తే దాన్ని హైకోర్టు మరో తేదీ నుంచి ఇస్తే సరిపోతుందని మార్చింది. సుప్రీంకోర్టు అసలు వేతనాలు ఇవ్వవలసిన అవసరమే లేదని తీర్పు చెప్పింది. యాజమాన్యం ఆ కార్మికుడు 240 రోజులు పనిచేసాడని లేదా పనిచేయలేదని చెప్పడానికి పత్రాలు, హాజరీ పట్టిక కోర్టులో సమర్పించనంత మాత్రాన అతను 240 రోజులు పనిచేసినట్టు కోర్టు భావించడం సాధ్యం కాదని, ఆ కార్మికుడు స్వయంగా పత్రాలతో, సాక్ష్యాలతో సహా 240 రోజులు పనిచేసినట్టు రుజువు చేస్తేనే రిట్రెంచ్‌మెంట్ బెనిఫిట్ పొందడానికి అర్హుడవుతాడని సుప్రీంకోర్టు వివరించింది. యాజమాన్యం పత్రాలు ఇవ్వదు. రిజిస్టర్ చూపదు. కోర్టులో సమర్పించదు. కార్మికుడు ఎక్కడినుంచి అవన్నీ తెస్తాడు. అసలు రుజువు భారం యాజమాన్యంమీద ఉంది మొర్రో అని కింది కోర్టు, హైకోర్టు అంటూ ఉంటే, లేదు లేదు ఆ భారం కార్మికుడిదే అనడం ఎంత సమంజసం, ఏ న్యాయసూత్రం ప్రకారం సరయినది? ఈ కేసులోనే మరో సూత్రాన్ని కూడా రూపొందించారు. ఒక కార్మికుడు నేరారోపణకు గురయితే ఆ నేరం క్రిమినల్ కోర్టులో రుజువు కానందుకు లేదా సందేహ లాభం కింద విడుదలయితే యాజమాన్యం దాన్ని పట్టించుకోకుండా అతని మీద క్రమశిక్షణా చర్య తీసుకోవచ్చునని ఆ సూత్రం. కార్మికుల పట్ల వారి పేదరికం పట్ల, వారి ఉద్యోగ హక్కు పట్ల సానుభూతి, మానవతా దృక్పథం అవసరమయిన దశలో, ప్రపంచీకరణ పెట్టుబడులే లక్ష్యంగా ప్రభుత్వాల దృక్పథాన్ని మారుస్తున్న యుగంలో ప్రపంచ బ్యాంకు డబ్బు సంక్షేమ రాజ్యాంగ లక్ష్యాలనే మార్చేస్తున్న దశలో కార్మికులను ఎవరు ఆదుకుంటారు? సుప్రీంకోర్టు మానవతా హృదయంతో స్పందించకపోతే ఎవరు వారికి అండగా నిలబడతారు? ◆

# ఇటీవలి తీర్పులు రాజ్యాంగానికి అనుకూలమేనా?

- సాక్షి

ప్రపంచీకరణ ప్రభావం అన్ని రంగాల్లో పడింది. ప్రభుత్వం ప్రపంచీకరణని ఆమోదించే ముందు, కొత్త చట్టాల్ని చెయ్యవల్సి వచ్చింది. పాత చట్టాలకీ, రాజ్యాంగానికీ కొత్త భాష్యాలు చెప్పించుకోవాల్సి వచ్చింది. యీ క్రమంలో కార్పొరేట్ సెక్టర్ లాభపడింది. పేదలు మట్టికొట్టుకు పోయారు. ప్రభుత్వరంగ సంస్థలూ, జాతీయ వాణిజ్య సంస్థలూ మూతపడ్డాయి.

మా ప్రమేయం లేకుండా మా గోచీలు ఊడలాక్కోవడానికి వీల్లేదని శ్రామికులు పెట్టిన పేచీల్లో మీరెవరు అడగడానికి, అది ప్రభుత్వ విధానం, దాన్ని కాదనే అధికారం మాకు లేదు పొమ్మన్నాయి న్యాయస్థానాలు. దీనికొక క్లాసిక్ ఎగ్జాంపుల్ బాల్కో పరిశ్రమ కేసులో సుప్రీంకోర్టు చెప్పిన తీర్పును ఉదహరించవచ్చు. బాల్కో ప్రభుత్వరంగ సంస్థ. ఆ సంస్థ నష్టాల్లో నడుస్తోందన్న కారణంగా ప్రభుత్వం పెట్టుబడుల ఉపసంహరణలకి ఉపక్రమించింది. దాన్ని ప్రశ్నిస్తూ ఆ సంస్థలో పనిచేసిన కార్మికులు కోర్టుకెక్కారు. పెట్టుబడుల ఉపసంహరణ ప్రభుత్వ విధాన నిర్ణయంలో భాగమని దాంట్లో తాము చేయగలిగిందేమీ లేదని సుప్రీం కోర్టు తేల్చి చెప్పింది. అంతేకాక ఈ విషయంలో కార్మికుల వాదనలని వినాల్సిన అవసరం లేదని కూడా కోర్టు స్పష్టం చేసింది. పరిశ్రమలు మూసేస్తేనో, ప్రయివేటీకరిస్తేనో రోడ్డున పడేది కార్మికులే. అంచేత విధిగా ప్రభుత్వం పెట్టుబడులు ఉపసంహరించదలచినపుడు కార్మికుల వాదనని వినాల్సిన అవసరం ఉంది. వాళ్ల బతుకులు వీధిన పడకుండా చూడాల్సిన బాధ్యత ప్రభుత్వానికుంది. సంక్షేమ ప్రభుత్వం అని చెప్పుకొనే ఏ ప్రభుత్వం కూడా ఇందుకు భిన్నంగా వ్యవహరించడానికి వీల్లేదు. అలా చేసినపుడు కోర్టులు జోక్యం చేసుకోపోతే రాజ్యాంగాన్ని రక్షించేది ఎవరు?

గతంలో రోహిత్ ఇండస్ట్రీస్ కేసులో పరిశ్రమల్ని మూసేట్లయితే యాజమాన్యం ఇతర బకాయిదార్లకి బాకీలు చెల్లించడానికి ముందు కార్మికుల జీతభత్యాలు చెల్లించాలని ఆ తర్వాత మాత్రమే ఇతర బాకీలు తీర్చాలని తీర్పు చెప్పింది. సంస్థల ఆస్తులు కార్మికుల శ్రమతో ఏర్పడ్డాయని కనుక వారి హక్కుల్ని కాదనడానికి వీల్లేదని అప్పట్లో కోర్టు ప్రకటించింది. ఈ తీర్పుని అనుసరించి కంపెనీ చట్టంలో తగిన సవరణ కూడా అప్పట్లో కేంద్ర ప్రభుత్వం తీసుకు వచ్చింది. మరో కేసులో సుప్రీంకోర్టు కంపెనీల్ని మూసివేయమని క్రెడిటర్స్ కోరినపుడు కార్మికుల వాదనల్ని కూడా విధిగా విని పరిగణించాల్సిన అవసరం ఉందని తీర్పు చెప్పింది. పరిశ్రమల్ని తిరిగి పునరుద్ధరించడానికి అవసరమైతే జాతీయ బ్యాంకులు పెట్టుబడి పెట్టి కార్మికుల భాగస్వామ్యంతో తిరిగి ప్రారంభమయ్యేలా చూడాలని ఆదేశించిన సందర్భాలు ఉన్నాయి. తీర్పులన్నీ రాజ్యాంగ లక్ష్యమైన సమానత్వ సాధన, సోషలిస్టు వ్యవస్థ స్థాపనని దృష్టిలో పెట్టుకొని ఇచ్చినవే. రాజ్యాంగ లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకోకుండా చట్టాల్ని, రాజ్యాంగాన్ని విశ్లేషించడానికి వీల్లేదని అప్పట్లో కోర్టులు తీర్పు చెప్పాయి. బాల్కో కేసులో తీర్పు గతంలో సుప్రీం కోర్టు ఇచ్చిన అనేక తీర్పులకి భిన్నం. రాజ్యాంగ లక్ష్యానికి, ఉద్దేశానికి వ్యతిరేకం. ఈ తీర్పు రాజకీయ వ్యవస్థలో వచ్చిన మార్పుని దృష్టిలో పెట్టుకొని పెట్టుబడిదారీ ప్రపంచీకరణ ప్రభావంతో చెప్పిన తీర్పు.

ఈ తీర్పే కాక ఇటీవల సుప్రీం కోర్టు చెప్పిన అనేక తీర్పుల్లో పరోక్షంగా ప్రపంచీకరణని సమర్థించింది. ఢిల్లీ పరిశ్రమల కాలుష్య కేసులో తీర్పు చెప్పిన సుప్రీంకోర్టు పరిశ్రమల యాజమాన్యానికి ప్రత్యామ్నాయం చూపించమని నిర్దేశించింది. మూసివేత కారణంగా రోడ్డుమీద పడే కార్మికుల గురించి కోర్టు పట్టించుకోలేదు. అలాగే నర్మదా డ్యాం కేసులో కూడా సుప్రీంకోర్టు నిర్వాసితుల పునరావాసానికి సంబంధించి నిర్దిష్టమైన దేశాలు ఏవీ జారీ చేయలేదు. పైపెచ్చు ఈ రెండు తీర్పుల్ని పరిశీలిస్తే న్యాయవ్యవస్థ సామాన్యులకు దూరమౌతోందని స్పష్టమవుతుంది. అంతే కాక సామాన్యుల అణచివేతలో న్యాయవ్యవస్థ కీలక పాత్ర పోషిస్తోంది.

ట్రేడ్ యూనియన్ చట్టం రావడానికి అనేక ఉద్యమాలు కారణమయ్యాయి. అలాగే ఎనిమిది గంటల పనిదినం కూడా ఉద్యమాల ఫలితమే. గ్రాట్యుటీ, బోనస్ లాంటి హక్కులు కూడా కార్మికులు ఉద్యమాల ద్వారానే సాధించుకున్నాయి. ప్రజాస్వామ్యం అని చెప్పుకుంటున్న ప్రస్తుత వ్యవస్థ కూడా స్వాతంత్ర్యోద్యమ ఫలమే. ఇందుకు గానూ అనేక స్ట్రయిక్‌లు, ఉద్యమాలు జరిగాయి. ఏనాడు ప్రొటెస్ట్‌ని న్యాయవ్యవస్థ తప్పుపట్టలేదు. అయితే ఇటీవల స్ట్రయిక్ చేయడం రాజ్యాంగ విరుద్ధమని తీర్పు చెప్పిన సుప్రీంకోర్టు రాజ్యాంగ మౌలిక సూత్రాలకు భిన్నంగా వ్యవహరించింది. ఊరేగింపులు, ధర్నాలు, నిరసనలు ప్రాథమిక హక్కుల్లో భాగం. సమ్మె చేయడానికి వీల్లేదన్న న్యాయవ్యవస్థ ప్రపంచీకరణకి వ్యతిరేకంగా వెల్లువెత్తిన నిరసనని పరోక్షంగా తొక్కిపెట్టాలని చూస్తోంది. ఇటీవల జూనియర్ డాక్టర్లు సమ్మె చేసినపుడు మన హైకోర్టు ఆ సమ్మెని అడ్డుకొంది. వాళ్లు లేవనెత్తిన సమస్యని గురించి కోర్టు పట్టించుకోలేదు. వాళ్ళు సమ్మె చేయడం వల్ల రోగులకి అసౌకర్యం కలుగుతుందని ఆందోళన చెందింది. అసలు జూనియర్ డాక్టర్లు నేరుగా వైద్యం చేయడానికి వీల్లేదు. వాళ్ళు కేవలం ట్రైనీలు మాత్రమే. ప్రభుత్వాసుపత్రుల్లో వైద్యనిపుణుల వద్ద. హౌస్‌సర్జన్‌లుగా వాళ్లు వైద్యాన్ని అభ్యసిస్తారు. అయితే జూనియర్ డాక్టర్ సమ్మె వలన వైద్యసేవలు నిలిచిపోయాయన్న ప్రభుత్వ వాదన హాస్యాస్పదమైంది. నిపుణులతో కాక అప్రెంటిస్‌ల తోటి ట్రైనీల తోటి రోగులకు వైద్యం చేయించడం చట్ట విరుద్ధం. ప్రజలకు వైద్యం అందించడం రాజ్యాంగ ధర్మం. అట్టి ధర్మాన్ని విస్మరించినందుకుగాను

ప్రభుత్వాన్ని తప్పు పట్టాలి. కానీ ఇందుకు భిన్నంగా న్యాయస్థానం జూనియర్ డాక్టర్లని సమ్మె చెయ్యొద్దని ఆదేశించింది. జూనియర్ డాక్టర్లు లేవనెత్తిన సమస్యని పరిగణనలోకి తీసుకోలేదు.

సమ్మె చేసినప్పుడు ఆ సమస్యని పరిష్కరించాల్సింది ప్రభుత్వమే. అంతేగాని న్యాయవ్యవస్థ జోక్యం చేసుకోవడానికి వీల్లేదు. న్యాయవ్యవస్థ జోక్యం వల్ల ప్రజలకి ఆ వ్యవస్థ మీద ఏవగింపు కలిగే ప్రమాదం ఉంది. ఈ విషయాన్ని న్యాయస్థానాలు గుర్తించాలి.

ప్రయివేటు విద్యాసంస్థల్లో వసూలు చేసే ఫీజుల విషయంలో ప్రభుత్వ జోక్యానికి వ్యతిరేకంగా సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు ప్రయివేటు విద్యాసంస్థలు యథేచ్ఛగా ఫీజులు పెంచుకోవడానికి దోహదపడుతుంది. అంతేకాక అడ్మిషన్స్ కూడా ప్రయివేటు విద్యాసంస్థలు ఇష్టం వచ్చినట్లు చేసుకొనే ప్రమాదం ఉంది. యీ విషయాలు దృష్టిలో పెట్టుకొన్నప్పుడు ఆయా విద్యాసంస్థలపై నియంత్రణ అవసరమని కోర్టు పరిగణించకపోవడం దురదృష్టకరం. ఇటీవల సుప్రీంకోర్టు ప్రయివేటు విద్యాసంస్థలకి సంబంధించి వెలువర్చిన తీర్పు విద్య ప్రయివేటీకరణకి పరోక్షంగా అనుమతించినట్లయింది.

కాంట్రాక్టు ఉద్యోగులకి సంబంధించి 1992లో వెలువడిన తీర్పు ఆయా కాంట్రాక్టు ఉద్యోగులకి రెగ్యులరైజేషన్ హక్కు లేకుండా చేసింది. రెగ్యులర్ పోస్టుల్లో కాంట్రాక్టుపై ఉద్యోగుల్ని తాత్కాలికంగా నియమించడం అంటే పరోక్షంగా వారి సర్వీసుల్ని ఎక్స్ప్లాయిడ్ చేయడమే అవుతుంది. అంతేకాక అట్టి ఉద్యోగుల్లో అభద్రతాభావం పెరిగి వారు బానిసలుగా మారుతారు. ప్రభుత్వం ఒక ఆదర్శ యజమానిగా నడుచుకోవాలని తీర్పుచెప్పిన సుప్రీంకోర్టు ప్రభుత్వమే కాంట్రాక్టు పేరిట ఉద్యోగుల్ని బానిసలుగా మార్చుకోవడానికి ఎలా సమర్ధించగలిగిందో ఆశ్చర్యం కలిగిస్తుంట

భారత రాజ్యాంగం ఆస్తిహక్కుని రద్దుచేసింది. ప్రభుత్వ ప్రజా కంపెనీల అవసరాలకి ఎవరి భూములనైనా సేకరించే అధికారం ప్రభుత్వానికి భూసేకరణ చట్టం క్రింద ఉంది. ఆ చట్టాల్ని అడ్డం పెట్టుకొని ప్రజల బూముల్ని ప్రభుత్వం సేకరించి పరిశ్రమల్ని స్థాపిస్తామని ముందుకొచ్చిన కార్పొరేట్ సంస్థలకి అప్పగిస్తోంది. దీనివలన అనేకమంది ప్రజలు భూముల్ని కోల్పోతున్నారు. బహుళజాతి సంస్థలు, కార్పొరేట్ రంగాలు బలపడుతున్నాయి. పరిశ్రమలకి సబ్సిడీల పేరిట ప్రభుత్వం చౌకగా బూముల్ని అమ్ముతోంది. అంతేగాక ఆయా పరిశ్రమలు ఉపయోగించే విద్యుత్తు ముడిసరుకులపై ప్రభుత్వం సబ్సిడీ ఇస్తోంది. అదే రైతులకిచ్చే సబ్సిడీని, వంటగ్యాసువంటి వాటిపై సబ్సిడీల్ని ఇంకా సామాన్యులకి ఉపయోగపడే అనేక రంగాల్లోని సబ్సిడీల్ని ప్రభుత్వం క్రమంగా ఎత్తివేస్తోంది. దీంతో సామాన్యులకి జీవితం భారంగా తయారైంది. కార్పొరేటర్ సెక్టర్‌కి లాభాల పంటగా మారింది. కార్పొరేట్ రంగానికి, పరిశ్రమలకి సబ్సిడీ ఇవ్వడం ప్రభుత్వ విధానంలో భాగమని అట్టి విధానంలో కోర్టులు జోక్యం చేసుకోవడానికి వీల్లేదని సుప్రీంకోర్టు తీర్పు చెప్పింది. ఇట్టి తీర్పుల వల్ల ప్రభుత్వ విధానాలకి రాజ్యాంగబద్ధత లభించింది. కోర్టుల ఆమోదముద్ర పడినట్లయింది.

విధాన నిర్ణయాల పేరిట (పాలసీ డిసిషన్స్) ప్రభుత్వం ప్రయివేటీకరణని సమర్థించడం పెట్టుబడిదారీ, ప్రపంచీకరణకి తలుపులు తీయడం వలన దేశంలో ఆర్థిక వ్యత్యాసాలు ముదిరిపోయాయి. జాతీయ సంపదని విదేశాలు దోచుకుంటున్నాయి. ప్రజలకు ఉద్యోగ భద్రత లేకుండా పోయింది. కాస్తో కూస్తో ఉన్న ఆస్తుల్ని దక్కించుకోలేని పరిస్థితి ఏర్పడింది. ఈ విషయాల్ని న్యాయస్థానాలు పట్టించుకోకపోవడంతో న్యాయవ్యవస్థకి, ప్రభుత్వానికి వ్యత్యాసం లేదన్న అభిప్రాయం ఏర్పడుతోంది. ఉపాధి కోల్పోయిన కార్మికులు చేస్తున్న అలజడి పైకి ప్రభుత్వ విధానాలకి వ్యతిరేకంగా కన్పించినప్పటికీ పరోక్షంగా కోర్టు తీర్పుల్ని శిరసావహించలేకపోవడమేనని కూడా అర్థం చేసుకోవాలి. ప్రభుత్వ విధానాలు జీవించే హక్కుకి, విఘాతం కల్పించేప్పుడు కూడా కోర్టులు జోక్యం చేసుకోకపోతే ప్రజలు తమ జీవించే హక్కు కాపాడుకోవడానికి తప్పనిసరిగా ఉద్యమిస్తారు. అప్పుడు కోర్టుల ఉనికి ప్రశ్నార్థకమవుతుంది. న్యాయస్థానాలు తమ స్వతంత్రతని కాపాడుకోవాలంటే చట్ట ప్రకారంగానూ, రాజ్యాంగబద్ధంగానూ ప్రజల హక్కుల్ని కాపాడాలి.

నాకు తెలిసిన ఒక పోలీస్ ఆఫీసర్ "మీరెప్పుడు పోలీసుల్ని తిడతారు కానీ పోలీసులు ఒక ఇనెవిటబుల్ ఈవిల్ అన్న సంగతి మర్చిపోతున్నారు. ట్రాఫిక్ కానిస్టేబుల్స్ లేకపోతే రోడ్లెంత బీభత్సంగా తయారౌతాయో ఊహించుకోండి" అన్నాడు. హైదరాబాదు లాంటి ప్రాంతంలో ట్రాఫిక్‌ని చూసినప్పుడల్లా ఆయన అన్నమాటల్లో కొంత నిజముందేమోననిపించేది నాకు. ఈ పోలీసుల్లోని ఈవిల్ నించి తప్పించుకోవడానికి న్యాయస్థానాలు ఉపయోగపడతాయనిపించేది. అయితే యీ మధ్యన కోర్టులు చెప్తున్న తీర్పులు చూస్తున్నప్పుడు న్యాయస్థానాలు కూడా ప్రజలకి మరొక ఇనెవిటబుల్ ఈవిల్‌లా అనిపిస్తున్నది. అయితే అది కొందరి బ్రతుకుదెరువు. మరికొందరికి లాభాల పంట. ప్రభుత్వానికి రౌండ్ సీల్. ◆

**వచ్చే సంచికలో.....**

ఫోకస్ : ప్రాంతీయ అసమానతలు - తెలంగాణ, ఉత్తరాంధ్ర, రాయలసీమ
సింగరేణిలో సాంస్కృతిక అణచివేత
ఐదేళ్ల డిగ్రీ కోర్సు ఎవరికోసం?
భగత్‌సింగ్ శతజయంతిలో భాగంగా....వ్యాసం

# న్యాయస్థానాల తీర్పులు - విద్యారంగం

- ఎం. శ్రీనివాస్

ఆరు దశాబ్దాల స్వతంత్ర భారతావనిలో ఆకలి, అవిద్య రాజ్యమేలుతూనే ఉంది. యాభై ఆరేండ్ల గణతంత్ర రాజ్యంలో రాజ్యాంగం కల్పించిన విద్యా, ఉపాధి అవకాశాలకు సామాన్య వర్గాలకు చెందిన విద్యార్థులు, యువత నోచుకోలేకపోతున్నారు. సామాజిక లక్ష్యం, సామాజిక వర్గాల విద్యా ప్రయోజనాలు అన్న ఉద్దేశ్యంతో ఏర్పరచిన అత్యున్నత సాంకేతిక విద్యా సంస్థల్లో దళిత, గిరిజన, బలహీన వర్గాల పిల్లలకు లభించిన అవకాశాలు అంతంత మాత్రమే. రాజ్యం కల్పించిన హక్కులకు, వివిధ సెక్షన్ల ప్రజల ప్రయోజనాలకు రక్షణగా నిలవాల్సిన న్యాయస్థానాలు అందుకు భిన్నంగా వ్యవహరిస్తున్నాయి. న్యాయస్థానాలు వెలువరిస్తున్న తీర్పులు ప్రధానంగా ఇటీవల ఉన్నత న్యాయస్థానం వెల్లడించిన తీర్పులు విద్యారంగాన్ని ప్రగాఢంగా ప్రభావితం చేశాయి. సామాజిక వర్గాలపై విస్తారమైన ప్రభావం పడింది. పేద, మధ్యతరగతి వర్గాల విద్యార్థుల విద్యా భవిష్యత్‌ను, ప్రయోజనాలను దెబ్బతీసేవిగా ఉన్నాయి. విద్యను పొందే హక్కును, ఇతర ప్రజాస్వామిక హక్కులను కోల్పోవడానికి దోహదం చేసేవిగా ఉన్నాయి.

న్యాయ వ్యవస్థ విద్యా రంగంలో ప్రదర్శిస్తున్న ఉత్సుకత గురించి ముందుగా అర్థం చేసుకోవల్సి వుంది. 90వ దశకం మధ్య భాగంలో 'న్యాయవ్యవస్థ క్రియాశీలత' గురించి చర్చ ముందుకు వచ్చింది. సకల రంగాలకు సంబంధించిన విషయాలలో కోర్టులు తరచుగా జోక్యం చేసుకుంటున్న స్థితి నుండి ఆ చర్చ ప్రారంభమైంది. ఈ చర్చల సారాంశం ఏమైనప్పటికీ ఒక విషయం గమనించవలసినది ఏమిటంటే 'న్యాయవ్యవస్థ క్రియాశీలత'కు గల మూలాలు డబ్ల్యూ.టి.ఒ., ప్రపంచ బ్యాంకు విధానాల న్యాయస్థానాల తీర్పులకు మధ్యగల పరస్పర సంబంధాలపై ఆధారపడి ఉన్నాయి. ఈ అంతర్గత సంబంధాన్ని అవగాహన చేసుకొన్నప్పుడే న్యాయవ్యవస్థ క్రియాశీలతను అర్థం చేసుకోగలుగుతాం. ఎందుకంటే చట్టాలు రూపొందించటంలోనూ, వాటిని అమలు చేయటంలోనూ లొసుగులు, లోపాలుంటే వాటిని సమీక్షించటం, నిర్వచించటం మాత్రమే న్యాయవ్యవస్థ విధి. బాధ్యత కూడా. ఈ విషయాన్నే లోక్‌సభలో రాజ్యాంగంలోని నాల్గవ సవరణ బిల్లుపై జరిగిన చర్చ సందర్భంలో భారత తొలి ప్రధాని నెహ్రూ మాట్లాడుతూ "దేశ ప్రజల ఆర్థిక, సామాజిక, సంక్షేమ బాధ్యత పార్లమెంట్‌దే. కోర్టులది కాదు. ప్రభుత్వ విధానాలకు ప్రాథమిక హక్కుల, ఆదేశిక సూత్రాలకు మధ్య అంతర్గత వైరుధ్యాలు ఉన్నాయని కోర్టులు కనుక చూపిస్తే ఆ వైరుధ్యాలను తొలగించాల్సింది పార్లమెంటే. దీనిని బట్టి మనకు అర్థమౌతున్న విషయం ఏమిటంటే ప్రభుత్వాలు రూపొందించే చట్టాలు గాని, విధానాలు గాని సవరించే, రద్దు చేసే అధికారం న్యాయస్థానాలకు లేదని. తనకు లేని అధికారాన్ని న్యాయస్థానాలు స్వీకరించటం సబబు కాదు. అయితే ఇందుకు కారణాలు లేకపోలేదు. ఇది సామ్రాజ్యవాద ప్రపంచీకరణ కాలం. డబ్ల్యూ.టి.ఒ., ప్రపంచబ్యాంకు విధానాలు అమలవుతున్న కాలం. ఈ విధానాల మీద ఆధారపడే ప్రభుత్వ విధివిధానాలు రూపొందుతున్నాయి. వాటి మార్గదర్శక సూత్రాల వెలుగులోనే వివిధ రంగాలలో సంస్థాగత మార్పులు చోటుచేసుకొంటున్నాయి. సంస్కరణలు అమలవుతున్నాయి. ఇందుకు జ్యుడిషియరీ మినహాయింపు కాదు. అందుకే ఉత్పాదక శ్రమజీవులైన అసంఖ్యాక వర్గాల పక్షాన నిలవాల్సిన కోర్టులు అందుకు భిన్నంగా వ్యవహరిస్తున్నాయి. ప్రభుత్వ విధానాలను ప్రతిబింబించేవిగానే కోర్టుతీర్పులుంటాయనడంలో సందేహం లేదు. జస్టిస్ చిన్నపరెడ్డి అన్నట్లుగా ఏ దశలోనైనా న్యాయ వ్యవస్థ తీరుతెన్నులను పాలక పక్ష ప్రయోజనాలు, విధానాలే నిర్ణయిస్తాయి. కనుక విద్యారంగానికి సంబంధించి ఉన్నత న్యాయస్థానాల తీర్పులను ఈ కోణం నుంచే పరిశీలించవలసి ఉంటుంది.

ఇటీవల ఉన్నత న్యాయస్థానాలు ప్రధానంగా భారత సర్వోన్నత న్యాయస్థానం విద్యారంగానికి సంబంధించి వెల్లడించిన తీర్పులు సామాజిక న్యాయాన్ని విఘాతపరుస్తున్నాయి. సమానత్వ సూత్రానికి విరుద్ధంగా ఉన్నాయి. వర్గ వైషమ్యాలు, సామాజిక తారతమ్యాలను పెంచేదిగా ఉన్నాయి. పాఠ్యాంశాల రూపకల్పన, మైనారిటీ విద్యార్థుల హక్కులు, ఫీజుల విధానం, రిజర్వేషన్లు వంటి అంశాలలో 2000-2006 మధ్యకాలంలో ఉన్నత న్యాయస్థానం వెల్లడించిన తీర్పులు ఈ పరిస్థితినే సూచిస్తున్నాయి.

బ్రహ్మాండమైన కాపిటేషన్ ఫీజు వ్యతిరేక ఉద్యమం ఫలితంగా 1993లో సుప్రీంకోర్టు ప్రైవేట్ ప్రొఫెషన్స్ విద్యాసంస్థలపై సామాజిక అదుపునకు వీలు కల్పిస్తూ ఇచ్చిన ఆదేశాన్ని, 2002 అక్టోబర్‌లో సుప్రీంకోర్టు రద్దు చేస్తూ తీర్పునిచ్చింది. గత తీర్పు కాపిటేషన్ ఫీజు విషయంలో వెల్లడించిన అభిప్రాయాలను కూడా ఈ తీర్పు త్రోసిపుచ్చింది. చట్టం అనుమతించిన దాని కన్నా అదనపు మొత్తాన్ని స్వీకరించటం తప్పుగా ఉన్నికృష్ణన్ వర్సస్ స్టేట్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ (1993) కేసు సందర్భంగా సుప్రీంకోర్టు పేర్కొంది". ఈ తీర్పును మైనారిటీ విద్యాసంస్థలకు సంబంధించి టి.ఎం.పాయ్ ఫౌండేషన్ వర్సెస్ స్టేట్ ఆఫ్ కర్నాటక కేసు విచారణ సందర్భంగా సుప్రీంకోర్టు తిరగదోడింది. అదేవిధంగా విద్యాసంస్థ స్థాపనను వ్యాపారం లేదా ప్రొఫెషన్‌గా పరిగణించరాదు. విద్యాబుద్ధులు నేర్పడం అనే దాన్ని ఎట్టిపరిస్థితుల్లోను వాణిజ్యంగా చూడరాదని 1993 ఉన్ని కృష్ణన్ కేసు సందర్భంగా తానిచ్చిన ఆ తీర్పుని రాజ్యాంగ విరుద్ధమని ప్రకటించింది. దీనితో విద్య అనేది వ్యాపారం కాబోదన్న భావననే తిరస్కరించినట్లయ్యింది. సామాజిక

న్యాయం, సాంఘిక నియంత్రణల ఆధారంగా ఉన్ని కృష్ణన్ కేసు తీర్పులో క్యాపిటేషన్ ఫీజు విషయంలో ఇచ్చిన తీర్పును తిరస్కరించటమే కాక దానిని తప్పుబట్టింది. చట్టం అనుమతించిన దానికన్నా అదనపు మొత్తాన్ని స్వీకరించటం, లాభాలను దండుకోవటం తప్పుగా గత తీర్పును పునరుద్ఘాటిస్తూనే ఈ తీర్పు సంస్థ విస్తీరణ- సౌకర్యాల మెరుగుదలకు అదనపు సొమ్మును వసూలు చేయటం సబబే అని వివరణ ఇచ్చింది. సంస్థ అభివృద్ధి కోసం సమంజసమైన రీతిలో నిధులు వసూలు చేయటం వ్యాపారం కిందికి రాదని, దాని లాభాలు ఆర్జించుకోవటంగా పరిగణించరాదని పేర్కొన్నారు. సుప్రీంకోర్టు ఈ వివరణ ఇవ్వటం ద్వారా 'న్యాయమైన మిగులు' అనే కొత్త సిద్ధాంతాన్ని ప్రబోధించటానికి పూనుకున్నది. ప్రైవేట్ యాజమాన్యాలకు విచ్చలవిడిగా లాభాలు దండుకోవటానికి ఈ తీర్పు ద్వారా స్వేచ్ఛ లభించింది. నూతన రూపాల్లో అధిక డొనేషన్లు వసూలు చేసుకోవడానికి, కాపిటేషన్ ఫీజు పునరుద్ధరణకు అవకాశం ఏర్పడినది.

ఫీజుల వసూలు నిర్ణయించే అంతిమ అధికారం రాష్ట్ర ప్రభుత్వాలదే అన్న విషయాన్ని సుప్రీంకోర్టు తన తీర్పులో భాగంగా ప్రకటించింది. దీర్ఘకాలిక ప్రయోజనాల దృష్ట్యా తన తీర్పులో ఈ విషయాన్ని జోడించిందన్న విషయాన్ని గమనించాలి. సంస్థ విస్తరణ-సౌకర్యాల మెరుగుదల అవగాహన ఫీజుల వసూలుకు ప్రాతిపదికగా ఉన్నందున ఫలానా మొత్తం అని ఇప్పుడే నిర్ణయించటం సరికాదని కోర్టు భావించింది. అంతేకాదు పాలకులు ఎప్పుడూ సంపన్న వర్గాల పక్షాన, పెట్టుబడికి కాపలాగా ఉంటారన్న విషయం ఉన్నత న్యాయస్థానానికి తెలుసు. కనుకనే అంతిమ నిర్ణయం ప్రభుత్వానికి ఇచ్చినా ప్రైవేట్ యాజమాన్యాలకు ఇబ్బందిగా ఉండదని భావించబట్టే తన తీర్పులో ఈ విషయాన్ని జోడించింది. విద్యా వ్యాపారమే లక్ష్యంగా గల ప్రభుత్వాలు, విద్యకు అయ్యే ఖర్చును విద్యార్థి నుండే రాబట్టాలన్న ప్రపంచబ్యాంకు నియమాన్ని విధిగా పాటించే ప్రభుత్వాలు అంతిమంగా ఏ నిర్ణయాలు చేస్తాయో మనకు తెలియంది కాదు.

వృత్తి విద్యా కోర్సులలో ముఖ్యంగా ఇంజనీరింగ్‌లో ఫ్రీ, పేమెంట్ సీట్ల విధానం ఈ తీర్పుతో రద్దయింది. కామన్ ఫీజు విధానం ముందుకు వచ్చింది. దీనితో విద్యార్థులు 29వేల ఫ్రీ సీట్లను కోల్పోయారు. కామన్ ఫీజు విధానం వలన తీర్పు రావటానికి ముందు ఫ్రీ సీటు పొందిన విద్యార్థులు 8వేలు చెల్లించేవారు. ఇప్పుడు 22వేల చెల్లించవలసి వస్తుంది. అంటే రిజర్వేషన్, మెరిట్‌తో సంబంధం లేకుండా నిర్ణీత కామన్ ఫీజు మొత్తాన్ని చెల్లించినవారికే సీటు లభిస్తుంది. దీనివలన రిజర్వేషన్ కేటగిరి విద్యార్థులు ముఖ్యంగా బి.సి. విద్యార్థులు తీవ్రంగా నష్టపోతారు. మైనారిటీ విద్యాసంస్థలలో యాజమాన్యాలకు కల్పించిన స్వేచ్ఛ వలన మైనారిటీ కమ్యూనిటీలో కూడా ఆర్థికంగా ఉన్నత స్థాయి కలవారికే ఇంజనీరింగ్, మెడికల్ విద్య లభిస్తుంది.

సుప్రీంకోర్టు తీర్పులో బోధన-బోధనేతర సిబ్బంది వ్యతిరేక ధోరణి ఉన్నది. బోధన-బోధనేతర సిబ్బంది విధానాలు, సిబ్బంది తొలగింపు, జీతభత్యాలు, క్రమశిక్షణా చర్యలు వంటి విషయాల్లో పూర్తి అధికారం ప్రైవేట్ వృత్తి విద్యాసంస్థలే కలిగి ఉండాలని తీర్పు వెల్లడించింది. ఈ తీర్పు ఉద్దేశ్యం ప్రైవేట్ అన్‌ఎయిడెడ్, వృత్తి విద్యా సంస్థల్లో పనిచేసే సిబ్బంది సేవా నిబంధనలలో ప్రభుత్వ జోక్యం తప్పనిసరి అని నిర్దేశించే 'ఆంధ్రప్రదేశ్ ఎడ్యుకేషన్ యాక్ట్-1982' అందుకు వ్యతిరేకమైంది. అంటే అన్‌ఎయిడెడ్, నాన్ మైనారిటీ వృత్తివిద్యా సంస్థలపై ప్రభుత్వ నియంత్రణ, తనిఖీలను తొలగించటమే. దీనివలన ఆ విద్యాసంస్థల అనైతిక, అక్రమ కార్యకలాపాలకు అడ్డూ అదుపు లేకుండా పోతుంది. ఉద్యోగుల, ఉద్యోగ భద్రత, ఇతర ప్రజాస్వామిక హక్కులకు అభద్రతా భావం ఏర్పడుతుంది.

జాతీయ పాఠశాల విద్య పాఠ్యాంశాల ఫ్రేం వర్క్ చట్టబద్ధతను సవాలు చేస్తూ దాఖలైన పిటీషన్‌పై సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు విద్యాకాషాయీకరణకు పచ్చజెండా ఊపినట్లయింది. ఈ తీర్పు లౌకిక ప్రజాతంత్ర వాదులను కలవరపరిచింది. రాజ్యాంగంలోని లౌకిక విలువల మౌలికత్వాన్ని ప్రశ్నించింది. జాతీయ విద్యా విధానంలోని ప్రాథమిక సూత్రాలకు, చవాన్ కమిటీ నివేదికలోని ప్రాధాన్యతలకు విరుద్ధమైనది. శాస్త్రీయ ప్రమాణాలు, లౌకిక విధానాలతో కూడిన విద్యా బోధనకు విరుద్ధమైనది. నిజానికి ఈ పాఠ్యాంశాల రూపకల్పనకు ముందే బిజెపి పాలిత రాష్ట్రాలలో విద్య కాషాయీకరణకు ప్రయోగాలు జరిగాయి. ఈ ప్రయోగానికి అఖిల భారతస్థాయిలో శ్రీకారం చుట్టాలన్న లక్ష్యంతో జాతీయ పాఠశాల విద్య, పాఠ్యాంశాల ఫ్రేం వర్క్‌కు అప్పటి ఎన్.డి.ఎ. ప్రభుత్వం పూనుకున్నది. సి.ఎ.బి.ఇ. బోర్డును పూర్వపక్షం చేయడం కాని, చరిత్ర పాఠాలను వక్రీకరించడానికి ఉన్న నేపథ్యం కూడా ఇదే. సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పులో ప్రభుత్వ నిధులతో నిర్వహింపబడే విద్యాసంస్థల్లో కూడా మతాల గురించిన విద్యను బోధించవచ్చును అని ప్రకటించింది. మతాల గురించిన విద్య రాజ్యాంగంలోని అధికరణ 28(1)ను ఉల్లంఘించదని చెప్పింది. వాస్తవానికి ఈ అధికరణకు భిన్నంగా విద్యాసంస్థల నిర్వహణ మొత్తంలో మతతత్వ ధోరణులు కనబడుతూనే ఉన్నాయి. దేశంలో వివిధ తరగతుల పాఠ్యాంశాలలో వివిధ మతాలకు సంబంధించిన సమాచారం ఉన్నది. మతపరమైన పండుగల గురించి మతగురువుల, వ్యక్తుల గురించి పాఠ్యాంశాలు చేర్చారు. మతానికి సంబంధించిన ప్రార్థనలు, వివిధ మత స్థాపకుల జీవితచరిత్రలు వారి ప్రధాన బోధనలు ఇప్పటికే ఉన్నాయి. సమాజంలోనూ, కుటుంబంలోనూ మతసంబంధమైన కార్యకలాపాలు చూస్తూనే ఉన్నాం. వాటి ప్రతికూల ప్రభావాల గురించి వింటూనే, అనుభవిస్తూనే ఉన్నాం. రాజ్యం తాలూకు ప్రభుత్వ అండదండలతో దేశం నలుమూలల మత మారణహోమాలు చెల్లరేగిన ఘటనలను చూశాం. మతసంబంధమైన విద్యా కార్యక్రమం మొత్తంలో దానిపై సుప్రీంకోర్టు మత దుర్వినియోగం గురించి కనీస ప్రస్తావన లేదు. పాఠశాల విద్యా పాఠ్యాంశాల ఫ్రేం వర్క్‌లో మతతత్వం హిందూ ఆధిక్యత ధోరణులే ఉన్నాయి. ఇందుకు సానుకూలంగా తీర్పు ఇవ్వటమంటే విద్యాసంస్థల్లో మతతత్వ ధోరణులు ప్రబలటానికి అవకాశం కల్పించటమౌతున్నది. మత ప్రాతిపదికన విద్యార్థుల విభజనకు దోహదపడటమే అవుతుంది.

ఇంట్లో ఎలుకలు ఉన్నాయనే పేరుతో ఇల్లు తగులబెట్టుకొన్న చందంగా చట్టంలో లోపాలు, లొసుగులు ఉన్నాయన్న సాకుతో ఆ చట్టాలనే పూర్వపక్షం చేయటానికో, రద్దుచేయటానికో దోహదపడే విధంగా తీర్పులు ఇవ్వటం సరికాదు. చట్టపరమైన సాంకేతిక లోపాల కారణాలతో కాకుండా సామాజిక న్యాయ దృష్టితో తీర్పులు వెల్లడించటం సముచితంగానూ, సమంజసంగానూ ఉంటుంది. రిజర్వేషన్ల వర్గీకరణ, ముస్లిం రిజర్వేషన్ వంటి విషయాలలో న్యాయస్థానాలు ప్రదర్శించిన వైఖరి ఇందుకు నిదర్శనంగా ఉంది. షెడ్యూల్డు కులాల ఉమ్మడి రిజర్వేషన్ వర్గీకరణ చట్టం రాజ్యాంగ విరుద్ధమంటూ 2004 నవంబర్‌లో సుప్రీంకోర్టు తీర్పునిచ్చింది. రిజర్వేషన్లు జనాభా నిష్పత్తి ప్రకారం ఉప వర్గాలుగా విభజించి ఇవ్వటం రాజ్యాంగంలోని సమన్యాయానికి భిన్నమైనది అని పేర్కొన్నది. ఈ తీర్పు రిజర్వేషన్ వర్గీకరణ వలన విద్యా ఉపాధి రంగాల్లో లబ్ది పొందుతున్న వేలాది మంది దళితులకు నష్టదాయకమైనది. రిజర్వేషన్ల వర్గీకరణ వలన అంతకు ముందు అవకాశాలు పొందని దళితులు రిజర్వేషన్ల వర్గీకరణ చట్టం అమల్లో ఉన్న నాలుగేళ్ల కాలంలో విద్య, ఉపాధిరంగాలలో మాదిగ, మాలలు పొందిన అవకాశాలు 60:40 శాతంగా ఉన్నాయి. ఈ విషయంలో సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు సమగ్రమైనది కాదు. రాజ్యాంగంలోని అన్ని అంశాలను, దళిత వర్గాల భౌతిక వాస్తవ పరిస్థితులను పరిగణలోకి తీసుకొని ఇచ్చిన తీర్పు కాదు. అందుకే ఈ తీర్పులో సామాజిక న్యాయం కొరవడింది. రిజర్వేషన్ల ద్వారా షెడ్యూల్డు కులాలన్నీ సమాన అవకాశాలతో సమగ్రాభివృద్ధిని సాధించాలన్న అంబేద్కర్ ఆశయ స్ఫూర్తి వెలుగులో దళిత వర్గాల వాస్తవిక సామాజిక జీవన విధానంలో నుండి ఇచ్చిన తీర్పు కాదు ఇది. రాష్ట్రం లేదా కేంద్రం బలహీనవర్గాల విద్య, ఆర్థికస్థాయి పెంపొందించటానికి ప్రత్యేక శ్రద్ధ చూపాలని, సాంఘిక అన్యాయం, వివక్షతల నుండి అన్ని రూపాలలో ఉన్న దోపిడీ పీడనల నుండి రక్షించాలన్న అధికరణ 46 ప్రకటనా సారాంశాన్ని ఉన్నత న్యాయస్థానం పరిగణనలోకి తీసుకోలేదు. 1978లో అధికరణ 38 రెండవ క్లాజుకు 44వ రాజ్యాంగ సవరణ చట్టంలో 'వివిధ సందర్భాలలో వ్యక్తులే కాక సమూహాల మధ్య ఉన్న ఆదాయ అసమానతలు, హోదాలలో, అవకాశాలలో, సౌకర్యాలలో ఉన్న అసమానతలు, అంతరాలను తొలగించటానికి రాజ్యం నిర్దిష్టమైన చర్యలు తీసుకోవాలన్న' అంశాన్ని కూడా సుప్రీంకోర్టు పట్టించుకోలేదు. నిజానికి రిజర్వేషన్ల వర్గీకరణ సామాజిక సమానత్వానికి సానుకూలమైనది. రాజ్యాంగ విలువలకు, ప్రజాస్వామిక హక్కుల సాధికారతకు అనుకూలమైనది. రిజర్వేషన్ల పంపిణీలో దళిత వర్గాలన్నీ తమకు రావాల్సిన న్యాయబద్ధమైన వాటాను అనుభవించటానికి వీలు కల్పిస్తుంది.

రాష్ట్ర జనాభాలో 11శాతంగా ఉన్న ముస్లింల వెనుకబాటు తనానికి గల చారిత్రక కారణాలను, వారి జీవన స్థితిగతులను పరిగణనలోకి తీసుకోకుండా ముస్లిం రిజర్వేషన్ల ఉత్తర్వులను రాష్ట్ర హైకోర్టు కొట్టివేసింది. ముస్లింల ఆర్థిక, రాజకీయ, సామాజిక వెనుకబాటు తనానికి చారిత్రక కారణాలు ఉన్నాయి. ఆ కారణాలు ఇక్కడ చర్చించటం స్థలాభావం వలన సాధ్యంకాదు. కారణాలు ఏమైనప్పటికీ రాష్ట్ర ప్రభుత్వం ముస్లింలకు 5% రిజర్వేషన్లు కల్పిస్తూ ఉత్తర్వులు జారీ చేసింది. వాస్తవానికి ఈ ఉత్తర్వులకు పూర్వమే వెనుకబడిన కులాలు, తరగతుల కోసం నియమించబడిన కాకాకలేల్కర్, బిపి మండల కమీషన్లు, కేవలం ముస్లింల వెనుకబాటు తనాన్ని అధ్యయనం చేయటానికి 1978లో ఇందిర ప్రభుత్వం నియమించిన గోపాల్‌సింగ్ కమిటీ ముస్లింలను ఇతర వెనుకబడిన తరగతులు (ఒబిసి)గా గుర్తించి వారికి రిజర్వేషన్ సౌకర్యం కల్పించాలని సూచించాయి. మూడు దశాబ్దాలకు పైగా ముస్లింలు తమకు రిజర్వేషన్లు కల్పించాలంటూ దేశవ్యాప్తంగా డిమాండ్ చేస్తూనే ఉన్నారు. ఎస్.సి., ఎస్.టిల తర్వాత విద్యలో బాగా వెనుకబడిన వారు ముస్లింలేనని యన్.సి.ఇ.ఆర్.టి. సర్వే వెల్లడించింది. కనుక పేదరికం దారిద్ర్యంలో మగ్గుతున్న లక్షలాది కుటుంబాలలోని వేలాది మంది యువతీ, యువకులు విద్యకు, ఉపాధికి చాలా దూరంగా ఉన్నారు. అందువలన అరాకొరగానైనా ముస్లింలను విద్య, ఉపాధిపరంగా రిజర్వేషన్లు మినహా ఇతరత్రా సౌకర్యాలు అభివృద్ధి చేయలేకపోయినప్పుడు వారికి రిజర్వేషన్లు కల్పించటం న్యాయం, అవసరం అత్యంత ప్రజాస్వామికమైనది కూడా.

ఉన్నత న్యాయస్థానం ఇచ్చిన తీర్పులు విద్యారంగంలో వృత్తివిద్యను పూర్తిగా మార్కెట్ శక్తులకు దారాదత్తం చేసేవిగా ఉన్నాయి. విద్యా వ్యాపారీకరణను బాహాటంగా సమర్థించేవిగా ఉన్నాయి. ప్రైవేట్ విద్యాసంస్థల, యాజమాన్యాల లాభాపేక్షను ప్రోత్సహించేవిగా ఉన్నాయి. స్థూలంగా సంపన్నవర్గాలకు, సాంఘిక ఆధిపత్య వర్గాలకు విద్యను పూర్తిగా పరిమితం చేయటానికే ఉపయోగపడతాయి. క్రమంగా రిజర్వేషన్ల విధానం నిర్వీర్యం కావటానికి దోహదపడతాయి. గాట్స్ ఒప్పంద విధానాలు స్వేచ్ఛగా, నిరాటంకంగా అమలు అయ్యేందుకు చట్టపరమైన చిక్కులు లేకుండా ఉన్నాయి. విద్యారంగం పట్ల ప్రభుత్వ బాధ్యతను, జోక్యాన్ని, నియంత్రణలను పూర్తిగా తొలగించి ప్రైవేట్ విద్యాసంస్థల యాజమాన్యాలకు పూర్తి హక్కును దాఖలు పరచటానికి ఉపయోగపడతాయి. కావున ఉన్నత న్యాయస్థానం తీర్పులు సామాజిక వర్గాల ప్రాథమిక హక్కుకు విరుద్ధమైనవి కనుక ఆ వర్గాలు సంఘటితంగా తగిన రీతిలో ఒత్తిడి తేవటం ద్వారానే విద్యా హక్కుతో పాటు ఇతర ప్రజాస్వామిక హక్కులను కాపాడుకోగలుగుతారు. ◆

**వీక్షణంకు ఉత్తరాలు రాసేవాళ్ళు, మనీఆర్డర్లు పంపేవాళ్లు తమ వివరాలను పూర్తిగా రాయవలసిందిగా కోరుతున్నాం. అలాంటి వివరాలు లేనందువల్ల ఉత్తరాలకు జవాబు రాయడంగాని, మనీ ఆర్డర్ల మేరకు పుస్తకాలు, పత్రికలు పంపడం గాని వీలు కావడం లేదు.**

5వ పేజీ తరువాయి...

నియంతృత్వాన్ని అమలుపరచే సంస్థలుగా ఉంటాయి. ఇటువంటి నేపథ్యం కల్గిన ప్రభుత్వాలు ప్రజల మౌలిక సమస్యల పరిష్కారానికి, చర్చల ప్రక్రియ వంటి ప్రజాస్వామిక పద్ధతిని ఇచ్ఛికంగా ఎప్పుడూ ఆమోదించవు. అయితే పీడిత ప్రజానీకం తమ ప్రజాస్వామిక ఆకాంక్షలను నెరవేర్చుకోవడానికి విప్లవపార్టీల నాయకత్వంలోనో, జాతి ఆకాంక్షలకు ప్రాతినిధ్యం వహించే మిలిటెంట్ సంస్థల నాయకత్వంలోనో సమీకృతులై తీవ్రమైన సాయుధపోరాటం నిర్వహించి, శతృబలగాలపై పైచేయి సాధించే క్రమంలో దోపిడీ ప్రభుత్వాలు అనివార్యంగా చర్చల ప్రక్రియలోకి ఈడ్చబడతాయి. కొన్ని సందర్భాలలో ఫాసిస్టు ప్రభుత్వాలు విప్లవోద్యమంపైనా, ప్రజా పోరాటాలపైనా అమలు జరిపే దమనకాండ పరాకాష్టకు చేరి, ప్రజల సాధారణ జీవితం తీవ్రమైన సంక్షోభానికి గురైనప్పుడు - ప్రజలు, ప్రజాస్వామిక వాదుల నుండి ముందుకు వచ్చే శాంతిచర్చల వంటి ప్రజాస్వామిక డిమాండ్‌కు దోపిడీ ప్రభుత్వాలు తలవంచక తప్పదు. ఇటువంటి సందర్భాల్లో మినహా, సాధారణ సమయంలో దోపిడీ వర్గ ప్రభుత్వాలు నిజాయితీగా, ఇచ్ఛికంగా ప్రజల మౌలిక సమస్యల పరిష్కారానికి చర్చల వంటి ప్రక్రియను ఆమోదించవు. పైన చెప్పినటువంటి సందర్భాలు ఎప్పుడైనా తటస్థిస్తే, అంటే ప్రభుత్వాలు చర్చలలో పాల్గొనవలసి వస్తే, ప్రారంభం నుండి చర్చలను విచ్ఛిన్నం చేయడానికి మార్గాలు అన్వేషిస్తాయి. తప్పదనుకుంటే అన్ని ఒప్పందాలను, విలువలను బహిరంగంగా, మొరటుగా వుల్లంఘించి, చర్చల ప్రక్రియకు తూట్లు పొడుస్తాయి. లేదా తమ దీర్ఘకాలిక వ్యూహంలో (ఎల్.ఐ.సి-లో ఇన్‌టెన్సిటీ కాన్‌ఫ్లిక్ట్ వార్‌ఫేర్) భాగంగా పోరాటకారుల్ని, ప్రజల్ని నిరాయుధుల్ని చేసి తమ దోపిడీ ఆధిపత్యాన్ని యధావిధిగా కొనసాగించడానికి కుటిల ఎత్తుగడలు రూపొందిస్తాయి. మరో పక్షమైన విప్లవ పార్టీలకు ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షల సాధనే ప్రధానం కనుక చర్చల ప్రక్రియను అవి వ్యతిరేకించవు. ఈ ప్రక్రియ ద్వారా ప్రజలకు ఏ కొద్ది ఉపశమనం లభిస్తుందన్నా, దాన్ని సాధించడానికి ప్రయత్నిస్తాయి. అయితే ప్రజల ప్రజ్వామిక ఆకాంక్షలు ప్రస్తుత వ్యవస్థలో చర్చల వంటి సులువైన మార్గంలో పరిష్కారం కావనే స్పష్టత విప్లవ పార్టీలకు ఉన్నప్పటికీ, ఈ విషయాన్ని విశాల ప్రజానీకం అర్థం చేసుకోవడానికి, చర్చల ప్రక్రియలో నిజాయితీగా, బాధ్యతాయుతంగా పాల్గొంటాయి. ప్రజల ప్రయోజనాలకు హాని కల్గనంత వరకు, చర్చల ప్రక్రియను గాడిలో ఎక్కించడానికి, దాన్ని సాఫీగా కొనసాగించడానికి పట్టుదలగా కృషి చేస్తాయి. అంతేకాకుండా దోపిడీ వర్గ ప్రభుత్వాల స్వభావం యెడల ఒక స్పష్టత వున్నా విప్లవ పార్టీలు ప్రారంభం నుండి ప్రజాయుద్ధ ప్రత్యామ్నాయాన్ని ప్రజల ముందు వుంచుతాయి. అంతేగానీ సుధాకర్‌గారు ప్రస్తావించినట్లు, విప్లవకారులు తమ బంధువులను చూడటానికో, ఏ కొద్ది అటవీ ప్రాంతంపై తమ పట్టు నిలబెట్టుకోవడానికో తమ అమూల్యమైన సమయాన్ని ఆషామాషీగా వినియోగించరు.

ఈ విషయాలను మరింత లోతుగా అర్థం చేసుకోవడానికి సుధాకర్‌గారు ప్రస్తావించిన వర్తమాన చరిత్రలోకే వెళ్దాం. మే 2004లో జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో నక్సలైట్ సమస్య సామాజిక ఆర్థిక సమస్య అనీ, నక్సలైట్లతో శాంతి చర్చలు జరుపుతామనీ ప్రచారం చేసి ప్రజల సానుభూతిని గెల్చుకొన్న కాంగ్రెస్ పార్టీ ఎన్నికలలో విజయం సాధించింది. ఈ నేపథ్యంలోనే అధికారంలోకి వచ్చిన రాజశేఖరరెడ్డి ప్రభుత్వానికి చర్చలలో పాల్గొనక తప్పలేదు. అయితే పైన చెప్పినట్లుగానే, నిరంకుశ దళారీ బూర్జువా భూస్వామ్య వర్గాల ప్రతినిధి అయిన వైఎస్ఆర్ ప్రభుత్వం, చర్చల ప్రక్రియకు ప్రారంభంలోనే అనేక ఆటంకాలు కల్పిస్తూ వచ్చింది. వడ్డుగూడెం కోవర్టు కుట్రకు పాల్పడి శాంతియుత వాతావరణాన్ని విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నించింది. మరోవైపు విప్లవ పార్టీలను, ప్రజానీకాన్ని నిరాయుధం చేసే కుట్రలో భాగంగా పై స్థాయి పోలీసు అధికారుల నేతృత్వంలో 7వ క్లాజును (జనావాసాలలో విప్లవకారులు ఆయుధాలతో తిరగకూడదు) రూపొందించి కాల్పుల విరమణ ఒప్పంద నియమ నిబంధనలలో జొప్పించింది. ప్రభుత్వం అనుసరిస్తున్న ఈ కుటిల ఎత్తుగడలను, విప్లవపార్టీలు ఎప్పటికప్పుడు ప్రజలకు అర్థం చేయిస్తూ ప్రజల ఆకాంక్షగా ముందుకు వచ్చిన శాంతి చర్చల ప్రక్రియను పట్టాలెక్కించడానికి ఓపిగ్గా కృషి చేసాయి. 7వ క్లాజ్ విషయంలో ప్రభుత్వ కుట్రను బహిర్గతపరుస్తూనే, దాన్ని చర్చల ఎజెండా అంశంగా ప్రతిపాదించి, చర్చల ప్రక్రియకు తెరలేపాయి. విప్లవ పార్టీలు, ప్రజలు, ప్రజాస్వామిక వాదులు చేసిన ప్రయత్నపూర్వక కృషివల్లనే చర్చలు ప్రారంభమయ్యాయి. ఈ విషయాలన్నీ చర్చల ప్రక్రియను, ప్రారంభం నుండి అధ్యయనం చేసిన ఎవరికైనా అర్థమవుతాయి. కానీ సుధాకర్‌గారు మాత్రం 'సర్వరోగ నివారణి చర్చలు' అనే సిద్ధాంత గందరగోళంలో కూరుకుపోవటం వల్ల పై వాస్తవాలను స్వీకరించడానికి సిద్ధపడలేకపోయారు. పైగా విప్లవ పార్టీలకు, చర్చల ప్రక్రియ యెడల చిత్తశుద్ధి లేదన్న విషయాన్ని తాను మాత్రమే ప్రకటించగలిగాననీ, మేధావులెవరూ ఆ సాహసం చేయలేకపోయారని తెగ ఆక్రోషపడిపోయారు.

ఇక చివరగా, కనీసం అక్టోబర్ 15 నుండి 18 వరకు నాలుగు రోజులపాటు, మర్రి చెన్నారెడ్డి మానవ వనరుల భవనంలో జరిగిన మొదటి విడత చర్చలలో భాగస్వాములైన ప్రభుత్వం, విప్లవపార్టీలు అనుసరించిన వైఖరులను అధ్యయనం చేయగల్గినా సుధాకర్‌గారు ఇటువంటి స్వీయాత్మక నిర్ధారణలకు వచ్చివుండేవారు కాదు. మొదటి విడత చర్చల సందర్భంగా విప్లవ పార్టీలు, ప్రజలపై గత ప్రభుత్వం పెట్టిన తప్పుడు కేసులు ఉపసంహరించాలనీ, ప్రభుత్వ ప్రేరేపిత సాయుధ ముఠాలను అరికట్టాలనీ, విప్లవకారుల తలలకు అప్రజాస్వామికంగా కట్టిన వెలలు రద్దు చేయాలనీ, అక్రమ కేసులు బనాయించబడి, సుదీర్ఘకాలం జైలులో మగ్గుతున్న విప్లవకారులను విడుదల చేయాలనీ - వంటి డిమాండ్స్‌తో పాటు, ప్రజలు పోరాడి సాధించుకున్న భూములను ప్రజల పరం చేస్తూ, మహిళలు, దళితులు కేంద్రబిందువుగా దున్నేవారికే భూమి లభించే విధంగా భూ పంపిణీ జరగాలనీ - ప్రభుత్వం ముందు తమ డిమాండ్లను వుంచాయి. ఈ కనీసమైన ప్రజాస్వామిక డిమాండ్ల సాధన కోసం నాలుగు రోజుల పాటు విప్లవ పార్టీల ప్రతినిధులు, మధ్యవర్తులుగా చర్చలకు హాజరైన మేధావులు వివిధ కోణాలలో ప్రభుత్వంతో చర్చించారు - ఆ డిమాండ్లు ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షలను వ్యక్తీకరిస్తున్నాయనే విషయాన్ని అర్థం చేయించడానికి తీవ్రంగా కృషి చేసారు. అయితే వారి కృషి అంతా చెవిటివాడి ముందు శంఖం ఊదినట్లైంది. ప్రభుత్వం ఏ ఒక్క డిమాండ్‌కు సానుకూలంగా స్పందించలేదు. ఒక్క విషయంలో కూడ నిర్దిష్ట హామీని ఇవ్వలేకపోయింది.

చర్చల ముగింపుగా ప్రభుత్వం రూపొందించిన అసమగ్రమైన హామీపత్రంపై విప్లవ పార్టీల ప్రతినిధులు తమ అసంతృప్తిని వ్యక్తం చేస్తూనే, రెండోవిడత చర్చలకు తమ సంసిద్ధతను వ్యక్తం చేసారు. ఈ సందర్భంగా భూమి పంపిణీ విషయంపై జరిగిన చర్చలలో ప్రభుత్వం అనుసరించిన వైఖరికి మధ్యవర్తులలో ఒకరైన శంకరన్‌గారు కూడా తమ అసంతృప్తిని వ్యక్తం చేసినట్లు తెలుస్తోంది. కానీ, సుధాకర్‌గారికి మాత్రం విప్లవపార్టీల ప్రతిపాదనలు గొంతెమ్మ కోర్కెల్లా కనబడ్డాయి. మొత్తంగా మొదటి విడత చర్చలలో ప్రభుత్వం అనుసరించిన వైఖరి విప్లవపార్టీ ప్రతినిధులలోనూ, మధ్యవర్తులలోనూ అసంతృప్తిని మిగిల్చినప్పటికీ ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షగా ముందుకు వచ్చిన చర్చల ప్రక్రియను కొనసాగించే విషయంలో విప్లవపార్టీలు బాధ్యతాయుతంగా వ్యవహరించాయి. రెండో విడత చర్చలకు తేదీలను కూడా ప్రతిపాదించాయి. అయితే అప్పటికే విప్లవ రాజకీయాల ప్రచారం ఊపందుకుని ప్రజలు విప్లవ పార్టీలతో తమ బాధలను కలబోసుకుంటూ, వారిని ప్రత్యామ్నాయంగా గుర్తిస్తున్న క్రమం పెరుగుతుండటంతో బెంబేలెత్తిన ప్రభుత్వం డిసెంబర్ నాటికి ఆయుధాలు వదిలితేనే రెండో విడత చర్చలంటూ షరతును విధించి చర్చల ప్రక్రియకు తూట్లు పొడిచింది. మరోవైపు తన పోలీసు హంతక ముఠాలను విప్లవ పార్టీల పైన, ప్రజలపైన ఉసిగొల్పింది. మరోసారి ఈ వాస్తవాలు దోపిడీ పాలకవర్గ ప్రభుత్వాల నైజాన్ని బహిర్గతం చేసాయి. ప్రజల మౌలిక సమస్యలు సామరస్యపూర్వకంగా పరిష్కారం కావని మరోసారి వర్తమాన చరిత్ర రుజువు చేసింది. ఈ విషయాలను ప్రజలు గుర్తించినప్పటికీ సుధాకర్‌లాంటి మేధావులు గుర్తించకపోవటం శోచనీయం.

ప్రస్తుత ప్రపంచ పరిస్థితులలో మనదేశం లాంటి వెనుకబడిన దేశాల పాలకవర్గాలకు తమ ప్రభువులైన సామ్రాజ్యవాదుల ఆదేశిత ఎల్.పి.జి (లిబరలైజేషన్, ప్రైవేటైజేషన్, గ్లోబలైజేషన్) విధానాలను అమలు జరపటమే శిరోధార్యం. ఈ విధానాలను వ్యతిరేకించే ప్రజలెవ రైనా టెర్రరిస్టులవుతారు. వారిని అణచివేయడానికి ప్రభుత్వాలు ఫాసిజాన్ని అమలు చేస్తాయి. ఇదే రాజ్య, విధాన అంతస్సారంగా వుంటుంది. అయితే ప్రజల ప్రతిఘటన సాయుధ పోరాట రూపం తీసుకొని విజృంభించినప్పుడు శాంతి చర్చలనేవి ఎజెండాలోకి వస్తాయి. శ్రీలంక లోనైనా, నేపాల్‌లోనైనా పోరాటకారులు అక్కడి శతృసైన్యాలపై దిమ్మ తిరిగే దెబ్బలు కొట్టటం వల్లనే చర్చలనేవి ఎజెండాలోకి వచ్చాయి. అంతే తప్ప అక్కడి ప్రభుత్వాలకు ప్రజల సమస్యలను పరిష్కరించాలనే చిత్తశుద్ధి ఉండి కాదు. ఎక్కడైనా చర్చల ద్వారా సాధించుకునే కనీస ఫలాలు ఏమైనా వుంటే అవి ప్రజా ఉద్యమాల విప్లవోద్యమాల బలంపైన ఆధార పడి వుంటాయి తప్ప ఓపిగ్గా, నైపుణ్యంగా చర్చించటం ద్వారా కాదు. ప్రస్తుత వర్తమాన పరిస్థితుల్లో చర్చలకు అంతకన్నా ప్రాధాన్యత ఏమీ లేదు.

మిత్ర

కరీంనగర్

# ఒకేపార్టీ - రెండు విధానాలు

('వీక్షణం' ప్రధాన సంపాదకులు వి. హనుమంతరావు చిరునామాకు అందిన ఈ వ్యాసానికి రచయిత పేరు రాయడం మరిచిపోయినట్టున్నారు. వీక్షణం రచనల ఎంపికలో ఎప్పుడూ విషయానికే ప్రాధాన్యతనిస్తామే తప్ప రచయితల పేర్లకు కాదు. అందువల్ల విషయ ప్రాముఖ్యత దృష్ట్యా ఈ వ్యాసాన్ని ప్రచురిస్తున్నాం. ఈ సంచిక చూసిన తర్వాతనైనా రచయిత తమ వివరాలు తెలియజేస్తే వచ్చే సంచికలో ప్రచురిస్తాం. - సం.)

మేము చెప్పిందే చేస్తాం, నమ్మండి అనడం కాకుండా చేతల్లో రుజువు చేస్తాం అన్నారు బెంగాల్ ముఖ్యమంత్రి. గోల్ఫ్ క్లబ్బులు పెడతాం, వినోద కేంద్రాలు ఏర్పాటు చేస్తాం అంటూ దిగింది ఇండోనేషియా నుండి సలీం అనే పెద్ద సంస్థ. ఐదువేల ఎకరాల భూమి కేటాయించండి రు. 44 వేల కోట్ల పెట్టుబడి పెడ్తాం, 30 వేల మందికి ఉపాధి కల్పిస్తాం అన్నారు. ముఖ్యమంత్రికి అందులో పురోగమన మార్గం దొరికింది. కంపెనీని ఆహ్వానిస్తూ, దాని ప్రతిపాదనలను ఒప్పుకుంటూ సంతకం చేశారు కూడా.

బహుళజాతి సంస్థలకు ద్వారాలు తెరిచిన ఈ సంతకాన్ని సహజంగానే ప్రతిపక్ష రాజకీయవేత్తలు ఉపయోగించుకోజూచారు. తిట్టిన తిట్టు తిట్టకుండా బినయ్‌కోనార్ 2005 నవంబరున పీపుల్స్ డెమోక్రసీలో రెండు పేజీల వ్యాసం రాశారు. అందులో మార్క్సిస్టు సిద్ధాంతాన్ని, బూర్జువా, సోషలిస్టు విప్లవాల పట్ల లెనినిజాన్ని, 1967 నుండి బెంగాల్ అనుభవాన్ని, కాంగ్రెస్ చరిత్రను, కమ్యూనిస్టు పార్టీ చరిత్రను, పెట్టుబడిదారీ విధానాన్నీ, ఇప్పటి పెట్టుబడిదారీ విధాన స్వరూపాన్నీ, చైనా అభివృద్ధి మార్గాన్నీ - ఇది కలదదిలేదు అనకుండా అన్ని ఆయుధాలను ప్రయోగించారు. ఇంత పెద్ద వ్యాసంలో సారంగా ఆయన తేల్చిందేవిటీ?

1. ప్రాజెక్టును ఆమోపెంచడం బుద్ధదేవ్ భట్టాచార్య, నిరుపమసేన్‌గార్లు చేసిన పాపం కాదు అందరం కలిసే చేశాం. కేంద్ర కమిటీ తీర్మానం ప్రకారం చేశాం. సమకాలీన పరచిన పార్టీ కార్య క్రమంలో ఈ ప్రాజక్టుకు దారివేసి వుంది అని సెక్షన్లలో పేర్కొన్నారు.
2. రైతులు సేద్యం మానేసి, సలీం కంపెనీ యిచ్చే డబ్బు బ్యాంకులో వేసుకొని, సేద్యాన్ని మించి వచ్చే ఆదాయంతో కాలిమీద కాలేసుకొని బతకొచ్చు. రైతులు రెంటియర్స్‌గా మారితే సుఖపడిపోతారు. (బ్యాంకు వడ్డీలు, కంపెనీ డివిడెండ్లతోనూ బ్రతకచూచే వారిని, రెంటియర్స్ అంటున్నది నేను కాదు - లెనిన్. సోమరులను అలా వర్ణించారు.)

కాని అప్పటికి రాజకీయ ప్రత్యర్థుల నుండి కాక, మరొకవైపు నుండి విమర్శ ఎదురైంది. దీనిని లేవనెత్తింది అశోక్‌మిత్రా. మార్క్సిస్టుగా ఆయనకు ఎవరి సర్టిఫికేట్ అవసరం లేదు. బుద్ధదేవులు, బినయ్ కోనార్లు, నిరుపమసేన్‌లు, రాజకీయాల్లోకి అరంగేట్రం చేసేనాటికే ఆరితేరిన ఆర్థికాచార్యుడు. ఈ ప్రాజెక్టుకు ఆమోదం తెల్పడం ఇతరుల బిడ్డకు జన్మనిచ్చేందుకు గర్భకోశాన్ని అద్దెకిచ్చే తంతుగా వర్ణించారు. (ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ 2005 సెప్టెంబరు 3 సంచిక). ఈ ప్రాజెక్ట్ రాష్ట్ర పారిశ్రామికీకరణకు, ఉపాధికల్పనకు ప్రభుత్వ వనరులను పెంచేందుకు తోడ్పడదని అన్నారు. స్థూల జాతీయోత్పత్తి అంకె పెరగవచ్చునేమోగాని జాతీయ వస్తూత్పత్తికి తోడ్పడదు అనేది ఆయన విమర్శ సారాంశం.

ఈ ప్రాజెక్టుపేరు చెప్పకున్నా, ప్రాజెక్టుకు అనుసరించిన పద్ధతిని పొరపాటని పరోక్షంగా ప్రభాత్ పట్నాయక్ సహితం పేర్కొన్నారు. భూమికి భూమి యివ్వడం బెంగాల్‌లో సాధ్యంకాదు. నష్టపరిహారం అందుకు సరైన ప్రత్యామ్నాయం కాదు అన్నారు పట్నాయక్. (ఫ్రంట్‌లైన్ 2006 జూన్ 2)

అశోక్‌మిత్రాపై సమరానికి సుహాస్ చక్రవర్తి సాయుధులైనారు. ఆయన ప్రధాన వాదన రైతు రెంటియర్‌గా మారడమే. (అదే పత్రిక 2006, ఫిబ్రవరి-11)

పశ్చిమ బెంగాల్ విస్తీర్ణం 88,572 చదరపు కిలోమీటర్లు. ఎకరం లక్షా 20 వేలకు అమ్మితే 1500 బిలియన్ రూపాయల పరిహారం వస్తుంది. దీన్ని బ్యాంక్‌లో 8 శాతం వడ్డీకి దాచిపెడితే ఏడాదికి రు. 120 బిలియన్లు వస్తాయి. ఇందుకు వారు ఒప్పుకుంటారా?" అని ఒక చిన్న జాబులో సమాధానం అడిగారు. (అదే పత్రిక 2006 మార్చి 4).

మార్క్స్, లెనిన్‌లు ఇలాంటి పనిచేయలేదు. అందువల్ల వారి రచనలలో సమాధానం యిచ్చేందుకు కొటేషన్లు దొరికినట్లు లేదు. ఇంకా సమాధానం యివ్వలేదు.

చైనా ప్రత్యేకతలలో ఆధునీకీకరణకు చైనా పూనుకున్నది. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో చైనా ప్రభుత్వం వున్నందున సోషలిజానికి ఎలాంటి ప్రమాదం లేదని పార్టీ అభిప్రాయం. చైనా సంస్కరణలకు సిద్ధాంతరీత్యా ఎదురైన ప్రశ్నలకు నాయకత్వం చెప్పిన సమాధానం. పార్టీనే పెట్టుబడిదారులు స్వాధీనం చేసుకుంటే అనేది చైనా విప్లవ 50వ వార్షికోత్సవం సందర్భంగా ఫ్రంట్‌లైన్ ప్రత్యేక సంచికలో మేధావులు వేసిన ప్రశ్న.

లుముంబా యూనివర్సిటీ వెనుకబడిన దేశాల విద్యార్థులకు సీట్లు అమ్ముకోలేదు. లాటిన్ అమెరికా దేశాల ఆరోగ్య తర్ఫీదుకు క్యూబా ఉచితంగా సహకరిస్తున్నది. రష్యా, చైనాలు పశ్చిమదేశాలతో పోటీపడి మెడికల్‌సీట్లు అమ్ముకుంటున్నాయి. పుటిన్ రష్యా, డెంగ్ చైనాలకు తేడా ఏమిటి? అని ఈనాటి మేధావుల ప్రశ్న. ఇంత చిన్న ప్రశ్నకు పార్టీ ఇంకా సమాధానం చెప్పవలసే వుంది.

రెండు సంవత్సరాలు వేచి చూచి పశ్చిమ బెంగాల్ టీ తోటల కార్మికులు సమైక్యంగా పోరాడారు. ఇలాంటి పోరాటాలలో వారు గతంలో సాధించుకున్న విజయాల కన్నా, తక్కువ ఫలితాలతో సమ్మె ముగిసింది. ముఖ్యంగా 21 మాసాలు బకాయిలు కార్మికులు వదులుకోవలసి వచ్చింది. ఉత్పాదనతో ముడివడిన జీతాలకు ఆ పరిశ్రమలో మొదటిసారి కార్మిక సంఘాలు ఆమోదించాయి. ప్రధాన యూనియన్లుగా

ఐ.ఎన్.టి.యు.సి., సి.ఐ.టి.యు.లు గట్టిగా నిలబడలేదని మేధావుల వ్యాసాలు. పరిశ్రమ నష్టాలలో వుందనే యజమానుల వాదనకు ప్రభుత్వం తలొగ్గడమే కారణమని ప్రచారం జరుగుతోంది. కొన్ని కంపెనీలు 130 శాతం డివిడెండ్లు ప్రకటించాయి. పరిశ్రమ నష్టాలలో వుందనేందుకు ఇది నిదర్శనమా అనేది అసలు ప్రశ్న.

చిల్లర వర్తకంలో విదేశీ పెట్టుబడిని అనుమతించరాదని మార్క్సిస్టు పార్టీ తీర్మానించింది. కేంద్ర ప్రభుత్వానికి ఒక నివేదిక ఇచ్చింది. వామపక్ష పార్టీలన్నీ దీనిని బలపరుస్తూ వ్యాసాలు ప్రచురించాయి. ఒకే బ్రాండ్ షాపులకు కేంద్రం అనుమతించింది. దీనికీ పార్టీ యధావిధిగా 'వాచ్‌డాగ్' పాత్ర వహించింది. అలా తీర్మానించగా పశ్చిమబెంగాల్‌లో రిలయన్స్ సంస్థ నాలుగువేల కోట్ల రూపాయల పెట్టుబడితో రిటైల్ వ్యాపారంలో ప్రవేశించదలచింది. ముఖ్యమంత్రి స్వాగతించారు. చిల్లరవర్తకంలో ఉపాధుల కరువు చేసేది దాలరేనా, రూపాయలు పోగొట్టవా? అని ఒక కాంగ్రెసు నాయకుడు ప్రశ్నించాడు. పశ్చిమబెంగాల్‌లో మధ్యతరగతి పట్టణవాసులు పార్టీకి పూర్వం కన్నా ఎక్కువ శాతం ఓటేశారు. వీరి కోరికలు వినిమయదారీ సంస్కృతిని పెంచేవిగా వుంటాయి. షాపింగ్ మాల్స్ వంటివి వారి కోర్కెలు. అది ప్రజలకు నష్టం. ఆ నష్టం జరిగితే సాంప్రదాయ మద్దత్తు క్షీణిస్తుంది. ఈ వైరుధ్య పరిష్కారం పశ్చిమబెంగాల్ కొత్త ప్రభుత్వం ఎదుర్కొనే అసిధారావ్రతమని ఫ్రంట్‌లైన్ వ్యాసంలో ప్రభాత్ పట్నాయక్ హెచ్చరించారు.

పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం వినిమయదారీ సంస్కృతికి ఓటేసింది. రాజకీయ అర్ధశాస్త్రానికి, శాస్త్రజ్ఞుల శల్యపరీక్షలకు వ్యతిరేకంగా బెంగాల్ ప్రభుత్వం వ్యవహరిస్తున్నది.

కేరళలో సరిగ్గా ఇలాంటి సమయంలో ముంబాయిలోగల టాటా సోషల్‌సైన్స్ ఇన్‌స్టిట్యూట్‌లో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా వున్న ఆర్. రామకుమార్ కేరళ ప్రభుత్వ బడ్జెట్ గురించి ఒక వ్యాసం ప్రచురించారు. (2006 జూలై 5 హిందూ). ప్రత్యామ్నాయం కోసం కేరళ నూతన బడ్జెట్ స్వచ్ఛమైన గాలి వీచినట్లుంది." అని దాని శీర్షిక. అందులో పేర్కొన్న విషయాలు సంక్షిప్తంగా చెప్పాలంటే సరళీకృత విధానాలు ప్రవేశపెట్టిన తరువాత రాష్ట్ర ప్రభుత్వాల వనరులను కేంద్రం కుదించి వేస్తున్నది. రాష్ట్రాలకు పాత బాధ్యతలు తొలగలేదు. ఇలాంటి ఇబ్బందికర పరిస్థితులు కలిగించేందుకు ఫైనాన్స్ కమిషన్ వంటి చట్టబద్ధ సంస్థలను వాడుకుంటున్నది. సరళీకృత విధానాలకు సాధనంగా ద్రవ్య సర్దుబాటు చట్టం చేసింది. 'వాట్'తో రాష్ట్రాల హక్కులను హరించింది అని పూర్వరంగాన్ని పేర్కొన్నారు.

ద్రవ్య సర్దుబాటు చట్టం బడ్జెట్‌లో ద్రవ్యలోటు శాతం ఎంతవరకు వుండవచ్చును అని సంవత్సరాల వారీగా నిర్ణయించి నిర్ణీత కాలానికి అసలు లోటే లేకుండా చేయాలని నిర్దేశిస్తుంది. అంగీకృతశాతాల్లో ద్రవ్యలోటు తగ్గిస్తేనే కేంద్రం నుండి రావలసిన నిధులను రాష్ట్రాలకు లాభిస్తాయి. ఇదీ షరతు; 12వ ఫైనాన్స్ కమిషన్ రూపొందించిన విధానం. దీనిలో ఒక మతలబు వుంది. బడ్జెట్ మొత్తంలో వుండే లోటును రెవెన్యూ లోటు, కాపిటల్ లోటుగా వేర్వేరుగా పేర్కొంటారు. రెవెన్యూ లోటు లేకుండా చేసుకున్నా మొత్తం ద్రవ్యలోటు తగ్గించుకోవచ్చు. పన్నుల ద్వారానో, ప్రభుత్వ ఆస్తుల మీద ఆదాయం పెంచుకొనో, శాంతి భద్రతలు, ఉద్యోగుల జీతాలు, వడ్డీ చెల్లింపులు, పాత పెట్టుబడులకు నిర్వహణ ఖర్చులు తగ్గించుకోవడం ద్వారానో రెవెన్యూ లోటు తగ్గించుకోవచ్చు. ఆస్తులపై, ఆస్తిపరులపైన పన్నులు పెంచితే ప్రైవేట్ వ్యక్తులకు లాభాలు తగ్గి, పెట్టుబడులు పెట్టాలనే వారి ఆసక్తి తగ్గిపోతుంది. కాబట్టి ప్రత్యక్ష పన్నులు పెంచకూడదు. కాని పరోక్ష పన్నులు పెట్రోలు, డీజిల్ లాంటి వాటి మీద పన్నులు పెంచవచ్చు. పోలీసు యంత్రాంగంపై- 'పవిత్ర గోవు' అది తగ్గరాదు. వడ్డీలు తగ్గిస్తే కలవారు అలిగి అప్పులివ్వరు. పి.ఎఫ్. సేవింగ్స్ వంటి వాటిపై తగ్గించవచ్చు. తగ్గించారు కూడా గదా! ఉద్యోగుల జీతాలు తగ్గిస్తే ప్రభుత్వ యంత్రం కదలదు. అందువల్ల రిక్రూట్‌మెంట్ ఆపేసి ఖర్చు తగ్గించారు. ఐ.ఏ.ఎస్.; ఐ.పి.ఎస్. రిక్రూట్‌మెంట్లు తగ్గాయా అనకండి. యూజర్ ఛార్జీలు పెంచి పెట్టుబడి నిర్వహణ ఖర్చు తగ్గించవచ్చు. కాని రాష్ట్రాలకు గల వనరుల సేకరణ అవకాశాలే తక్కువ. కేంద్రం గురించి చట్టబద్ధంగా రావలసిన భాగం తగ్గుతోంది. కేంద్ర ప్రభుత్వ పథకాలకు మాచింగ్ గ్రాంట్ యిచ్చి వారు చెప్పినట్లు చేసే ఏజెన్సీలుగా రాష్ట్ర ప్రభుత్వాలు మారుతున్నాయి. ఈ చట్టాన్ని రద్దు చేయాలని మార్క్సిస్టు పార్టీ కోరుతోంది. వాట్ సహితం రాష్ట్రాల ఆర్థిక పరిస్థితికి ఉరితాడు అవుతోందని చెప్పింది. 11వ ప్రణాళికపై పార్టీ కేంద్ర ప్రభుత్వానికి యిచ్చిన పత్రంలో దీనిని పేర్కొన్నారు.

'వాట్' అమలును పర్యవేక్షించే కమిటీకి పశ్చిమ బెంగాల్ ఆర్థికమంత్రి అధ్యక్షులు. అధికారానికి రాగానే 'వాట్' వల్ల నష్టమని రాష్ట్ర ఆర్థిక శాఖా మంత్రి రోశయ్య విమర్శించారు. కాంగ్రెస్‌వాదిగా క్రమశిక్షణతో అమలు జరుపుతున్నారు. వంటగ్యాస్ అమ్మకం పన్నును రాష్ట్ర అధికారం నుండి తొలగించి, కేంద్రం పరిధికి మార్చింది కేంద్ర ప్రభుత్వం. సిలెండరుకు రు. 23 తగ్గుతుందని మూడురోజులు పత్రికలన్నీ వినిమయదార్లను ఊరించాయి. అది కాస్తా కంపెనీల ఖాతాకు పోయింది. రోశయ్య పెదవి కొరుక్కున్నారు. వినిమయదార్లు లబోదిబోమన్నారు. ఇవీ వాట్ లీలలు. కొత్తగా 'వాట్'లో చేరిన తమిళనాడు రు. 2400 కోట్లు ఆదాయం కోల్పోతుందని జూలై 23 బిజినెస్ లైన్ వివరించింది.

'వాట్ నిర్ణయించే పన్ను రేట్లు శిరోధార్యం' అంటుంది కేంద్రం. అవి కనిష్టరేట్లుగా ఒప్పుకుంటాం తప్ప, గరిష్టరేటును నిర్ణయించే హక్కు రాష్ట్రాలకే వుండాలంటుంది కేరళ బడ్జెట్. ఒకే రేటుతో దేశమంతటా తమ సరుకులను అమ్ముకోవాలనుకునే ఉత్పత్తిదారులతో ఘర్షణ పడడం గదా ఇదీ ! బడ్జెట్ ఉపన్యాసం ధీమాగా 2010 నాటికి రాష్ట్ర స్థూల ఉత్పత్తిలో రాష్ట్ర ప్రభుత్వ వనరులను 13 నుండి 17.5 శాతానికి పెంచుతామంటుంది. ఈ తికమకల మధ్య రాష్ట్రాలు పెట్టుబడి వ్యయం తగ్గించుకుంటున్నాయి. పెట్టుబడి బాధ్యత, వాటిపై అపారమైన లాభాలు పొందే హక్కు ప్రైవేట్ పెట్టుబడికి ఒప్పగించారు. హైదరాబాద్ విజయవాడ మధ్య ఆర్.టి.సి. టికెట్ ధరతో పాటు రు. 10లు టోల్ టాక్స్ మనమే కడుతున్నాం. ఈ చట్టంపై బెంగాల్ అలక వహించినట్లైనా మనకు తెలియదు. కాని అచ్యుతానందన్ ప్రభుత్వం ఆర్థిక సంక్షోభాన్ని రెవెన్యూ పెంచి తీర్చుకోవాలి తప్ప, లోటు శాతం అమలు పరచడం ద్వారా కాదని స్పష్టం చేసింది. ఇది కేంద్ర ప్రభుత్వ సరళీకృత విధానాల మూలాన్ని సవాలు చేయడమే గదా! ఇదొక చారిత్రక అడుగు అంటారు

రామకుమార్. బడ్జెట్ బహుళజాతి సంస్థలతోనూ తలపడుతోంది. హెల్త్ డ్రింకులు, మినరల్ వాటర్, పెప్సీల వంటి సాఫ్ట్ డ్రింకుల మీద పన్నును వాట్ 12.5 శాతానికి తగ్గిస్తే బడ్జెట్‌లో 20 శాతానికి పెంచారు. ఈ పెంపు రు. 693 కోట్ల తేడాను పూడుస్తుంది.

ఉల్లాసానికి క్లబ్బులకొచ్చేవారిపై తలసరి పన్ను కొత్తగా విధించారు. క్లబ్‌లో వారు కొనే విలాస సామాగ్రి మీద, బయటకన్నా మించి పన్ను విధించారు. బంగారం కొనుగోలుపై పన్నువేశారు.

తాజా సమాచారం ప్రకారం గత కాంగ్రెస్ ప్రభుత్వం దుబాయ్ ఇంటర్‌నెట్ సిటీతో కొచ్చిన్‌లో స్మార్ట్‌సిటీ ప్రాజెక్టు నిర్మాణానికి చేసుకొన్న ఒప్పందాన్ని గురించి తిరిగి సంప్రదింపులు జరపాలని కేరళ ప్రభుత్వం నిర్ణయించి దుబాయ్ కంపెనీ ప్రతినిధులను చర్చలకు ఆహ్వానించింది. గత ఒప్పందాన్ని అమలు పరిస్తే కష్టించి నిర్మించిన ఐటి మౌలిక సౌకర్యాలను ఈ విదేశీ కంపెనీకి బంగారుపళ్లెంలో పెట్టి అప్పగించినట్లవుతుందనే విమర్శలను దృష్టిలో వుంచుకొని కొచ్చిన్‌లోని ఇన్ఫోసిటీని విదేశీ కంపెనీకి అప్పగించే సమస్య లేదని కేరళ ప్రభుత్వం తెలియచేసింది. ఆ కంపెనీకి నూరు ఎకరాల స్థలాన్ని ఇచ్చే సమస్యలేదని నిర్ణయించింది. విదేశీ కంపెనీ నిర్మించబోయే స్మార్ట్‌సిటీ ప్రాజెక్టు పరిసర ప్రాంతాల్లో ఇతర ఐటి పార్కుల నిర్మాణాన్ని అనుమతించబోమని గత ప్రభుత్వం చేసిన ఒప్పందాన్ని అమలుపరచడానికి నిరాకరించింది. కక్కనాడులో ఇన్ఫోపార్కు భవనం అప్పగించే ప్రసక్తి లేదని తేల్చి చెప్పింది. విదేశీ కంపెనీకి ఇచ్చే భూమికి మార్కెట్ రేటు ప్రకారం చెల్లించాలని తెగేసి చెప్పింది. అయితే, రేపు నిర్మించబోయే స్మార్ట్‌సిటీలో పనిచేసే ఐటి ప్రొఫెషనల్స్‌కు గృహనిర్మాణంకోసం స్థలాన్ని వాడుకోవడానికి అంగీకరించింది. కేరళ, పశ్చిమ బెంగాల్ ప్రభుత్వాల విధానాల మధ్య ఎంత తేడా!

వ్యవసాయరంగంలోనూ కేంద్రంతో భిన్నమైన విధానాలకు బడ్జెట్ నాందీ పలికింది. ఆ రంగంలో సంక్షోభం తెచ్చిపెట్టింది కాంగ్రెస్ విధానాలు. జాతీయ కమిషన్ నియమించి చేతులు కడిగేసుకుంది కేంద్ర ప్రభుత్వం. అందుకు భిన్నంగా కేరళ

ఎ. వ్యవసాయ రుణాలపై రాయితీలు అమలు జరిపేందుకు ఒక కమిషన్‌ను నియమించింది. అసాధారణ వడ్డీలను రద్దుచేసే అధికారం కూడా ఈ అర్ధన్యాయ ట్రిబ్యునల్‌కు యిచ్చారు. అలాగే ఏ ప్రాంతంలోనైనా పంటలు దెబ్బతింటే ఆదుకునే చర్యలను కమిషన్ ఆదేశిస్తుంది.

బి. వ్యవసాయరంగంలో పెట్టుబడి పెంచే విధానాలను రూపొందించేందుకు, ధరల స్థిరీకరణ చర్యలను సూచించేందుకు మరొక కమిషన్‌ను నియమించారు.

సి. టీ, కాఫీ, మిరియాలు వంటివి పండించే రైతులకు ఒక ఏడాది ఆదాయపు పన్నునుండి, కొబ్బరి, కొబ్బరి ఉత్పత్తులకు అన్ని పన్నులనూ ఏడాదిపాటు మినహాయింపు యిచ్చారు.

డి. అత్యంత సమర్థవంతంగా అందరికీ లభ్యమయ్యే సరఫరాల్లో బియ్యం ధరను కె.జి. మూడు రూపాయలుగా నిర్ణయించారు.

కేంద్రం ఏమి చెయ్యాలని వామపక్షాలు కోరుతున్నాయో ఆ చర్యలను తన పరిధిలో చేపట్టిన ఆదర్శం యిది అంటారు రామకుమార్.

కేంద్ర ప్రభుత్వంతో ఘర్షణకే కేరళ ప్రభుత్వం సిద్ధమౌతోందని, అందుకు ప్రజా సమీకరణే కీలకాంశమని తేల్చేశారు.

నిజమే స్వపక్షమే అచ్యుతానందన్‌ను 'అభివృద్ధి' నిరోధకుడని పేర్కొంది. మైనారిటీ భక్షకుడుగా ముద్రవేసింది. ఆయనకు శాసనసభకు టిక్కెట్టు యివ్వడం కుదరదు అని తేల్చేసింది.

సెక్సు స్కాండల్స్ నుండి, సారా రాజుల చర్యలు, హైవే వంటి, స్మార్ట్‌సిటీ వంటి హంగులను, ఎండో సల్ఫర్ వంటి రసాయనాల విచక్షణా రహిత వినియోగం వంటి చర్యలను ఆయన ప్రతిపక్ష నాయకుడిగా ఎండకట్టారు.

ఈ చర్యలు ప్రజల మన్ననలు పొందాయి. పార్టీలో అనర్హత వేటుకు కారణమైనాయంటారు – 2006 ఏప్రిల్ ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీలో శ్రీ కె. హరిదాస్ గారి వ్యాసంలో.

ఏమైనా ప్రజలు ఆయనకు శాసనసభ్యత్వం, ముఖ్యమంత్రిత్వం గూడ కట్టబెట్టారు. ఆ ప్రభుత్వ మొదటి బడ్జెట్ గోదావరిపై నుండి వీచే తెమ్మెర్లలో కలిసిన చల్లగాలి యిచ్చింది.

కేంద్ర ప్రభుత్వంతోనేనా ఆయన పోరాటం ?

విధానాలలో ఉత్తర దక్షిణ ధృవాలుగా సాగుతున్న బెంగాల్, కేరళ ప్రభుత్వాలు పార్టీలో మాత్రం దుమారం లేపవా?

ప్రజలముందు ఓడినట్లు కనిపించిన కేరళ పార్టీ రాష్ట్ర కమిటీ గతంలో అచ్యుతానందన్‌కు కార్యదర్శులుగా పనిచేసిన వారిద్దరినీ పార్టీనుండి సాగనంపింది. రెండు జిల్లాలో విస్తృతంగా క్రమశిక్షణా చర్యలకు పూనుకుందట. పొలిట్‌బ్యూరో కఠినంగా ఆ చర్యలను అడ్డుకుందట. ఇదీ జూలై 22 ది హిందూ పత్రిక ఇచ్చిన వార్త.

ఇది రాబోయే తుఫానుకు చిహ్నామా?

తుఫాను తర్వాత ఆదుకుందామా, ఇప్పుడే అండదండలిచ్చి తుఫానునే ఎదిరిద్దామా? మార్క్సిస్టు పార్టీ అంతరంగిక విషయమేనా?

ఇది కూడా ప్రపంచబ్యాంక్ విధానాలకు వ్యతిరేకంగా జరిగే పోరాటంలో భాగమే గదా! ●

# అమెరికా బంటుకు అనుకోని ఓటమి

- జి ఎస్ రామ్మోహన్

ఇస్లాం ప్రపంచానికి మరో హీరో దొరికాడు. అమెరికా తన విదేశీ పోలీసుబలగం ఇజ్రాయెల్ ద్వారా సుదీర్ఘకాలంగా సాగిస్తున్న దుర్భర అణచివేతల, దుర్మార్గమైన ఆక్రమణల, దుస్సహమైన దాడుల కింద అణగారిపోతున్న పశ్చిమాసియా ప్రపంచానికి మరో హీరో దొరికాడు. ఆ మాటకొస్తే ఒక్క పశ్చిమాసియా వాసులే కాదు. మొత్తంగా వారి పట్ల సహానుభూతో సానుభూతో ఉన్న ప్రజాస్వామిక వాదులకు, అమెరికా- దాని బంటు ఇజ్రాయెల్ దుర్మార్గాలను ఎవరు ఎదిరించి నిలబడినా హమ్మయ్య అనుకునే ఆశాజీవులకు ఊరటనిచ్చిన హీరో అతను. అతనిపేరు హసన్ నస్రుల్లా. కేవలం నాలుగైదువేల మంది గెరిల్లాలతో అత్యాధునికమైన ఇజ్రాయెల్‌ను 33 రోజుల పాటు నిలువరించిన హిజ్‌బుల్లా సేనాని అతను. నాజర్ తర్వాత యాసర్ అరాఫత్ తర్వాత ఎవరెవరా అని ఆశగా ఎదురుచూస్తున్న పశ్చిమాసియాకు లభించిన ఆశాకిరణం. అప్పుడే కొందరు అతన్ని ఈజిప్టు మాజీ అధ్యక్షుడు నాజర్‌తో పోలుస్తున్నారు. ఇజ్రాయెల్‌లో అతను అవలంబించిన ఎత్తుగడలను కొందరు వియత్నాం ఎత్తుగడలతో పోలుస్తున్నారు. ఇది అత్యుత్సాహమా, లేక తిరుగులేక విర్రవీగుతున్న మదపు ఆంబోతును ఎవడో ఒకడు ఎంతో కొంత నిలువరించినందుకు కలిగిన ఆశ్చర్యానందపు వ్యక్తీకరణ మాత్రమేనా అనేది పక్కన బెడితే హిజ్‌బుల్లా సాధించింది నిజంగానే విజయం. దీనికి నైతిక అనే పదం జోడించనక్కర్లేదు కూడా. యుద్ధాన్ని కేవలం శవాల లెక్కలతో అంచనా వేయకూడదు. యుద్ధం ఏ లక్ష్యంతో ఎవరు మొదలెట్టారు. ఆ లక్ష్యం నెరవేరిందా లేక తల్లకిందులయ్యిందా అనేది ప్రధానం. రాజకీయంగా విజయం సాధించింది ఎవరు అనేది ప్రధానం. నిజమే. 33 రోజుల పాటు ఇజ్రాయెల్ సాగించిన దుర్మార్గమైన దాడిలో లెబనాన్ దక్షిణ ప్రాంతం స్మశానాన్ని తలపిస్తున్న మాట వాస్తవం. విచక్షణారహితంగా గ్రామాలపై దాడులు చేసి వందల మంది సాధారణ పౌరులను ముఖ్యంగా చిన్నపిల్లలను ఇజ్రాయెల్ పొట్టనపెట్టుకున్న మాట వాస్తవం. లెబనాన్ దక్షిణప్రాంతం ఇప్పట్లో కోలుకోలేని విధంగా కార్యాలయాలు, రహదార్లు, ఆస్పత్రులు, వంతెనలను నాశనం చేసిన మాట వాస్తవం. ఈ 33 రోజుల దాడులు-ప్రతిఘటన పర్వంలో లెబనాన్ దాదాపు 1000 మంది వరకూ కోల్పోయింది.(ఆశ్చర్యకరంగా లెబనాన్ ప్రభుత్వం ఈ సంఖ్య 891 అని చెపుతుంటే బిబిసి, ఎపి, రాయిటర్స్, తదితర వార్తా సంస్థలు మాత్రం ఈ సంఖ్య 1000పైనే అని చెపుతున్నాయి). కచ్చితమైన సంఖ్యను చెప్పలేక



పోయినా ఇందులో అధికం సాధారణ పౌరులే అని చెపుతున్నాయి. ఇజ్రాయెల్ రక్షణ బలగాలు( ఐడిఎఫ్) పేర్కొన్న ప్రకారం 114 మంది ఇజ్రాయెల్ సైనికులు, 43 మంది పౌరులు మరణించారు. ఐక్యరాజ్యసమితి నివేదికల ప్రకారం, లెబనాన్ ప్రభుత్వం చెపుతున్నదాని ప్రకారం 7 లక్షలనుంచి 9 లక్షల మంది లెబనాన్ పౌరులు తమ గ్రామాలను వీడి కట్టుబట్టలతో పారిపోవాల్సివచ్చింది. హూమన్ రైట్స్ వాచ్ నివేదిక ప్రకారం ఇజ్రాయెల్‌లో ఈ సంఖ్య ఐదు లక్షలు. లెబనాన్‌కి 2.5 బిలియన్ డాలర్ల నష్టం( లెబనాన్ ప్రభుత్వ నివేదిక) వాటిల్లితే ఇజ్రాయెల్‌కి 1.1 బిలియన్ డాలర్ల(ఇజ్రాయెల్ ప్రభుత్వ నివేదిక) నష్టం వాటిల్లింది. ఐక్యరాజ్యసమితి నివేదికల ప్రకారం(యునైటెట్ నేషన్స్ త్రెట్ అసెస్‌మెంట్) ఇజ్రాయెల్ దళాలు రోజుకు సగటున 400 నుంచి 600 బాంబులు(500 పౌండ్ల నుంచి 2000 పౌండ్ల మోతాదువి) జారవిడిచాయి. రోజుకు 200నుంచి 300 క్షిపణులతో లెబనాన్ గ్రామాలపై విరుచుకుపడ్డారు. ఇజ్రాయెల్ ముఖ్యంగా పౌరప్రాంతాలపై దాడులు చేసి భీతావహ వాతావరణం సృష్టించగలిగింది ముఖ్యంగా అనేకమంది చిన్నపిల్లలను బలిగొంది. లితానీ నదిపై ఉన్న అన్ని వంతెనలను నేలకూల్చింది. దాడుల గురించి ముందుగా కరపత్రాలు జారవిడిచి పౌరులకు సమాచారం అందించానని చెపుతున్నది గానీ యుద్ధ విమానాలు అటు వంతెనలను, రహదారులను అన్నింటిని నాశనం చేసి వస్తూ వస్తూ బాంబులు జారవిడిస్తే పౌరులు ఎటు వెళ్లేను? లితానీ నదిపైన ఉన్న అన్ని వంతెనలను కూల్చిన ఫలితంగా దానికి దక్షిణం వైపున లక్షమంది మిగిలిపోయారు. ఆ వెన్వెంటనే ఆ నదికి దక్షిణం వైపున ఎటువంటి కాన్వాయ్ అయినా దాడిచేసే తీరతామని హెచ్చరిస్తూ క్షిపణుల వర్షం కురిపించింది. అందులో చివరకు ఐక్యరాజ్యసమితి సిబ్బంది కూడా కొంతమంది మరణించారు. ఓ వైపు దారిలేకుండా చేసి మరోవైపు భారీ క్షిపణులతో పౌరప్రాణాలను బలితీసుకుంటూ మేం ముందుగానే దాడుల గురించి హెచ్చరించాం అని చెప్పుకోవడం బలమదాంధుల క్రూర పరిహాసంగా తప్ప మరో రకంగా అర్థం చేసుకోలేం. పౌర కాన్వాయ్‌లపై దాడులు చేయడం నైతికంగానే కాదు, సమితి సూత్రాల ప్రకారం కూడా యుద్ధ నేరమే. పౌరాఆవాసాలున్న చోట క్లస్టర్ బాంబులు వేయడం మరో తీవ్రమైన యుద్ధనేరం. ఇజ్రాయెల్ పాల్పడిన యుద్ధనేరాల చిట్టా పేర్కొనడానికి ఈ వ్యాసపరిధి సరిపోదు కాబట్టి అది గొంగడిలో వెంట్రుకలు వేరడం అవుతుంది కాబట్టి వాటినలా వదిలేద్దాం. పేలకుండా



మిగిలిన క్షిపణి భాగాలతో ఆడుకుంటూ ఇప్పటికీ చిన్నారులు అక్కడ ప్రాణాలను కోల్పోతూనే ఉన్నారు. ఏతావాతా దక్షిణ లెబనాన్‌లో ఇజ్రాయెల్ అంతులేని విషాదాన్ని మిగిల్చింది. అయితే రాజకీయంగా మాత్రం నిస్సందేహంగా ఓటమి చవిచూసింది. సైనికంగా కూడా ఓడిపోయినట్టేనని నిపుణులు పేర్కొంటున్నారు. 30 వేలమంది సైనికులు 33 రోజుల పాటు వందలాది ట్యాంకులు, యుద్ధవిమానాలతో 33 రోజుల పాటు దాడులు చేసినా హిజ్‌బుల్లా అనే "చిన్న సంస్థ"ను ఏమీ చేయలేకపోవడం ఓటమి కాక మరేమవుతుందని వారి ప్రశ్న. ఇజ్రాయెల్ చరిత్ర(!)లో ఇదే సుదీర్ఘమైన యుద్ధం. ఇంతకంటే తక్కువ సమయంలో అది ఈజిప్టు, సిరియాల సైన్యాలనే ఓడించగలిగింది. ఇవేవో బయటినుంచి వస్తున్న విమర్శలు కావు. ఇజ్రాయెల్‌లోనే ఇపుడీ చర్చ ఊపందుకుంది. జియోనిస్టుల సర్కారు తీవ్రమైన ఒత్తిడిని ఎదుర్కొంటోంది. ఇజ్రాయెల్ త్రివిధ దళాల చీఫ్(చీఫ్ ఆఫ్ స్టాఫ్) జనరల్ డాన్ హలూజ్ పదవీ గండం ఎదుర్కొంటున్నారు. యుద్ధ వైఫల్యానికి బాధ్యున్ని చేస్తూ అతన్ని తొలగించాలని కొందరు ఎంపీలు డిమాండ్ చేస్తున్నారు. దీనికి తోడు సదరు జనరల్ గారు దాడుల నిర్ణయం జరిగిన రెండు గంటల లోపే ఒక బ్యాంకు దగ్గరకు వెళ్లి అక్కడ షేర్లు అమ్మకానికి



పెట్టారు. ఆ షేర్ల విలువ 27, 500 అమెరికన్ డాలర్లు. ఆ తర్వాత అదేరోజు అక్కడి షేర్ ఇండెక్స్ 10 శాతం పడిపోయింది. ప్రపంచంలో ఏ సైనిక దళాల చీఫ్ అయినా యుద్ధం ప్రకటించిన కొద్ది సేపటికి ఇతరత్రా బాధ్యతలు వదిలేసి బ్యాంకు అకౌంట్లను చూసుకుంటారా అని అక్కడి ఎంపీలు ప్రశ్నిస్తున్నారు. యుద్ధ నిర్వహణలో వైఫల్యాలపై ఇజ్రాయెల్ రక్షణ శాఖ తొలుత సమీక్షకు నిర్ణయం తీసుకున్నా తర్వాత దానిని తాత్కాలికంగా విరమించుకుంది. ఈ సమీక్ష స్థానంలో పూర్తిస్థాయి దర్యాప్తుకు నిర్ణయం తీసుకోవచ్చని వార్తలు తెలియజేస్తున్నాయి. 1973 యూమ్ కిప్పూర్ యుద్ధం తర్వాత అప్పటి ఇజ్రాయెల్ ప్రధాని, చీఫ్ ఆఫ్ స్టాఫ్ రాజీనామా చేయవలసి వచ్చింది. ఇపుడు హలూజ్‌కు అది తప్పక పోవచ్చని సమాచారం. హిజ్‌బుల్లాను ఓడించివుంటే ఇరాన్‌పై అమెరికా దాడికి అవసరమైన వ్యూహాత్మక, మానసిక బలం లభించివుండేదని, ఈ విషయంలో తన మీద అమెరికా పెట్టుకున్న నమ్మకాన్ని ఎల్మర్ట్ నేతృత్వంలోని ఇజ్రాయెల్ ప్రభుత్వం వమ్ము చేసిందని వాషింగ్టన్ పోస్ట్‌లో చార్లెస్ క్రాత్‌మెర్( ఆగస్టు4) రాశారు. ఇజ్రాయెల్ సైనిక పరంగా రక్తదాహమైతే తీర్చుకోగలిగిందేమో కానీ విజయం సాధించలేకపోయిందన్న విషయాన్ని ఈ కలవరపాటు స్పష్టం చేస్తున్నది. రక్తదాహం అనే పదం ఊర్కే ఇజ్రాయెల్‌పై ఉన్న వ్యతిరేకత వల్ల వాడడం లేదు. ఒక టన్ను బరువున్న బాంబును పౌర ఆవాసాలపై విడిచినపుడు మీకెలా అనిపిస్తుంది అని ఒక ఇంటర్వ్యూలో ఈ జియోనిస్టు జనరల్ హలూజ్ గారిని అడిగితే ఆయన ఇచ్చిన సమాధానం ఏంటో తెలుసా..."కొద్దిగా విమానం రెక్క ఊగుతుంది. రాత్రి హాయిగా నిద్రపోతాను." అదీ సంగతి. ఇక రాజకీయపరమైన ఓటమి గురించి చర్చించుకుందాం.

హిజ్‌బుల్లాను పూర్తిగా నామరూపాలు లేకుండా చేయడం ఇజ్రాయెల్ ప్రధాన లక్ష్యం. తమ సైనికులను ఇద్దరిని హిజ్‌బుల్లా కిడ్నాప్ చేసిందన్న దాన్ని సాకుగా చూపుతూ వారు దాడులకు దిగారు. హిజ్‌బుల్ ఎక్కడైతే బలంగా పాతుకుని ఉందో ఆ దక్షిణ లెబనాన్ ప్రాంతంలో విపరీతమైన జననష్టం సృష్టించడం ద్వారా ఆ ప్రాంతవాసుల్లోనూ మొత్తంగా లెబనాన్ ప్రభుత్వంలోనూ హిజ్‌బుల్లా వ్యతిరేకత వ్యాపింపజేయవచ్చని ఇజ్రాయెల్ భావించింది. మీ వల్లే ఇదంతా అని జనమూ, ప్రభుత్వమూ హిజ్‌బుల్లాపై విరుచుకుపడతారని భావించింది.

తాము నిర్మూలించగలిగినంతవరకు నిర్మూలించగా మిగిలిన హిజ్‌బుల్లా బలాన్ని లెబనాన్ ప్రభుత్వమే తనంత తానుగా నిర్మూలించక తప్పనిసరి పరిస్థితి కల్పించగలమని భావించారు. అందుకోసమే ఒక వ్యూహం ప్రకారం లితానీ నదికి దక్షిణప్రాంతంలో భయానక వాతావరణం సృష్టించారు. ఒక రకంగా అమెరికా దళాలు ఇరాక్‌లోని ఫల్లూజా నగరంపై ఎలా బాంబుల వర్షం కురిపించాయో అదే మాదిరి వారి బంటు కూడా వ్యవహరించింది. వాస్తవానికి తమ సైనికుల కిడ్నాప్ ఒక సాకుమాత్రమే. అలాంటి కిడ్నాప్‌లకు ఇజ్రాయెల్ సైన్యం ప్రతిరోజూ పాల్పడుతూనే ఉంది. ఆ ఇద్దరు సైనికులు కిడ్నాప్ అయిన రోజే



ఇజ్రాయెల్ బలగాలు ఒక లెబనాన్ డాక్టర్‌ను ఆయన సోదరుడిని కిడ్నాప్ చేసి బందీలు చేశాయి. ఇప్పటికీ వేలాది మంది పాలస్తీనీయన్లు, లెబనాన్ పౌరులు, సిరియా వాసులు ఎటువంటి విచారణ లేకుండా ఏళ్లతరబడి ఇజ్రాయెల్ చెరలో ఉన్నారు.

నిజానికి ఇజ్రాయెల్ ఇలాంటి సాకుకోసం కొంతకాలంగా వేచిచూస్తున్నది. ఏప్రిల్- మే నెలల్లో జరిగిన లెబనాన్ ఎన్నికల్లో తమ ఏజెంట్లను గెలిపించుకుని సౌదీ తరహా సామంత రాజ్యాన్ని స్థాపించుకుని హిజ్‌బుల్లా బెడదను తప్పించుకోవాలని అమెరికా-ఇజ్రాయెల్‌లు తీవ్రంగా యత్నించాయి. ఇరాన్‌పై భవిష్యత్ దాడికి ముందు దానికి అత్యంత సన్నిహితమైన హిజ్‌బుల్లాను ఒక శాంపిల్ కేస్‌లాగా చావుదెబ్బతీయాలని అనుకున్నాయి. తమ నరికొత్త ఆయుధాలను పరీక్షించుకోవాలనుకున్నాయి. చుట్టుపక్క అరబ్ దేశాలకు మరో భయసంకేతం పంపాలనుకున్నాయి. దానికి తోడు ఇరాకీ నిర్వాకం పుణ్యమో మరొకటో గాని "ఎండ్ ఆఫ్ కౌబాయ్ డిప్లొమసీ" అని టైమ్ లాంటి పత్రిక సైతం వ్యాసాలు రాయడం మొదలెట్టడంలో అసహనం పెరిగింది. ఎంత చిన్నదైనా అర్జంటుగా ఏదో ఒక విజయం అవసరమనే స్థాయికి అసహనం పెరిగింది. 1982లో పాలస్తీనా లిబరేషన్ ఆర్మీ(పి ఎల్ ఓ) గెరిల్లాలను లెబనాన్ దక్షిణ ప్రాంతంనుంచి పూర్తిగా తరిమేయగలిగినట్టుగా ఈ సారీ హిజ్‌బుల్లాను తరిమేయగలమని భావించారు. కౌబాయ్ డిప్లమసీ స్థానంలో కండోలిజా రైస్ కౌగర్ల్ డిప్లొమసీ మొదలైంది. అయితే తామొకటి తలిస్తే లెబనాన్ పౌరులు మరొకటి తలిచారు. అమెరికా అభీష్టానికి భిన్నమైన సర్కారు ఏర్పడింది. పైపెచ్చు హిజ్‌బుల్లా అద్భుత విజయాలను సాధించి ఆరుగురు పార్లమెంట్ సభ్యులను గెలిపించుకుంది. సంకీర్ణ సర్కారులో ఇద్దరు హిజ్‌బుల్

మంత్రులు కూడా ఉన్నారు. ఒక రాజకీయపార్టీగా అది గట్టిగా నిలదొక్కుకోవడమే కాకుండా రోజురోజుకు ప్రజాదరణను పెంచుకుంది. షియాల సంస్థగా మొదలైన హిజ్‌బుల్లా ఇతర శ్రేణుల్లో కూడా మద్దతు పెంచుకుంటున్నది. 1982లో హిజ్‌బుల్లా ఏర్పడిన తర్వాత అది ఇంత బలంగా ఎప్పుడూ లేదు. నాజర్ తర్వాత పశ్చిమాసియాలో అంతటి మద్దతుగల నేతగా హిజ్‌బుల్లా నేత హసన్ నస్రుల్లా ఎదిగారని మేధావులు పేర్కొంటున్నారు. సెక్యులరిస్టు విధానాల ద్వారా హిజ్‌బుల్లా చివరకు లెబనాన్ క్రైస్తవుల మద్దతును కూడా గణనీయంగా పొందగలిగి లెబనాన్‌లో అత్యంత బలీయమైన శక్తిగా ఎదిగింది. అందువల్లే ఇజ్రాయెల్ పెంచిపోషించిన సౌత్ లెబనాన్ ఆర్మీ(ఎస్ ఎల్ ఏ) లాంటి సేనలు మళ్లీ అక్కడ తలెత్తే అవకాశం లేకుండా పోయింది. అప్పట్నించే అమెరికా-ఇజ్రాయెల్‌లు దాడులకు సాకును వెతుకుతూ ఉన్నాయి. ఇపుడీ దాడుల్లో హిజ్‌బుల్ మరింత బలపడింది. హిజ్‌బుల్లాకు వ్యతిరేకమైన కసిని ప్రజల్లో కలిగించాలనుకున్న ఇజ్రాయెల్ ఎత్తుగడ తిరగబడి ఇజ్రాయెల్ వ్యతిరేకత మరింత పెరగగా హిజ్‌బుల్లా మొత్తం పశ్చిమాసియాలో బలీయమైన శక్తిగా అవతరించింది. నస్రుల్లా అయితే అరబ్ యువతకు ఆరాధనీయుడిగా మారాడు. తాము ఆక్రమించిన లెబనాన్ ప్రాంతాలనుంచి 2000 సంవత్సరంలో పూర్తిగా వైదొలగాల్సిన పరిస్థితి వచ్చినపుడే హిజ్‌బుల్లా శక్తి ఇజ్రాయెల్‌కి తెలిసివచ్చినా అది మళ్లీ తప్పటడుగు వేసింది. ఇజ్రాయెల్ దాడులు వారు కోరుకున్న దానికి వ్యతిరేక ఫలితాన్ని ఇచ్చాయి. హిజ్‌బుల్లా అగ్రనాయకత్వాన్ని మట్టుబెట్టాలన్న యత్నమూ ఫలించలేదు. హిజ్‌బుల్లాలోకి ఏ స్థాయిలోనూ కోవర్టులను ప్రవేశపెట్టలేకపోవడమే యుద్ధ వైఫల్యానికి ఒక ప్రధాన కారణమని ఇజ్రాయెల్ సైనిక వ్యవహారాల నిపుణుడు యురి అవనేరీ అభిప్రాయపడ్డారు.

జూలై 12న దాడులు మొదలైతే రెండు వారాల పాటు ఐక్యరాజ్యసమితిలో ఎలాంటి యత్నాలు సాగకుండా అమెరికా అడ్డుకోగలిగింది. 61 యేళ్ల ఐక్యరాజ్యసమితి చరిత్రలో ఇలాంటి పరిస్థితి తలెత్తడం, దాని స్థాయిని ఇంతగా దిగజార్చడం ఇదే తొలిసారని పశ్చిమాసియా వ్యవహారాల విశ్లేషకుడు ప్రొఫెసర్ గిల్బర్ట్ ఆచర్ రాశారు. తర్వాత సాగిన యత్నాలను కూడా శ్వేతసౌధం అడుగడుగునా అడ్డుకుంటూ 33 రోజుల పాటు దాడులను సాగదీయగలిగింది. చివరకు ఇజ్రాయెల్ దాడులను ఖండించే వాక్యాలను లేకుండా చేయగలిగింది కానీ పూర్తిగా ఇజ్రాయెల్ అనుకూల తీర్మానం మాత్రం చేయించలేకపోయింది. పౌరప్రాంతాలపై క్లస్టర్ బాంబులు వేయడం లాంటి యుద్ధనేరాలను కూడా సమితి ఖండించలేకపోవడం అది ఎంత నిస్సత్తువగా తయారైందో తెలియజేస్తున్నది. ఇపుడు ఐక్యరాజ్యసమితి చేసిన తీర్మానం 1701(యుఎన్ఎస్‌సి-1701) చాలా సంక్లిష్టమైనది. దీని అమలుపై కూడా అనేకానేక సందేహాలు ఉన్నాయి. ఇజ్రాయెల్ తాను దురాక్రమణ చేసిన షీబా ఫామ్స్‌ని ఎంతమేరకు తిరిగి అప్పగించగలదనేదానిపై దీని అమలు ఆధారపడి ఉండే అవకాశం ఉంది. తాము ఆక్రమించుకున్న అనేక ప్రాంతాలను తిరిగి స్వాధీనం చేస్తామని ఇజ్రాయెల్ కుదుర్చుకున్న అవగాహనను ఇజ్రాయెల్ ప్రధాని ఎల్మర్ట్ ఇప్పటి పరిస్థితుల్లో ఎంతవరకు అమలుచేయగలరనే విషయంపై ఆధారపడి ఉంటుంది. షీబా ఫామ్స్ విషయానికే వస్తే ఇజ్రాయెల్ ఆధీనంలోని ఫామ్స్ రిసార్టులతో ఫౌంటెన్‌లతో పర్యాటక ఆదాయం తెచ్చిపెడుతుండగా లెబనాన్ ఆధీనంలోని ఫామ్స్ బీడుపడిపోయి ఉన్నాయి. ఇతర దేశాల నదులను అక్రమంగా తరలించుకుపోతూ ఇజ్రాయెల్ సొమ్ముచేసుకుంటోంది. కాశ్మీర్‌ను బ్రిటీషర్లు అలా వదిలివెళ్లి ఎంతటి చిచ్చుకు కారకులయ్యారో అలాగే ఈ ప్రాంతాన్నిగతంలో ఏలిన ఫ్రాన్స్ పాలకులు షీబా ఫామ్స్‌ను వివాదంగా మార్చివేశారు. ఇజ్రాయెల్ ఆక్రమణల పర్వం ప్రారంభమవడానికి ముందు అంటే 1978కి మందు వెస్ట్‌బ్యాంక్, షీబాఫామ్స్, గొలాన్‌హైట్స్ ప్రాంతాల్లోని పొలాల్లో పాలస్తీనా, లెబనాన్, సిరియాల రైతులు సరిహద్దులతో సంబంధం లేకుండా వ్యవసాయం చేసుకునే వారు. ఇజ్రాయెల్ ఈ మూడు ప్రాంతాల్లో ఆక్రమణలకు దిగిన తర్వాత కొత్త కంచెలు , సరిహద్దు గోడలు మొలుచుకొచ్చిన తర్వాత వారికి అవకాశం లేకుండా పోయింది. తమ గడ్డమీద పరాయి సైనికుల ఆంక్షలు, అవమానాల బారిన పడాల్సి వస్తున్నది.

నస్రుల్లా గొప్ప అరబ్ నాయకునిగా తలెత్తాడని అంతర్జాతీయ మేధోబృందం భావించడానికి కారణం కేవలం ఆయన సైనిక వ్యూహాలేకాదు. ఆయన పరిపక్వ ధోరణి కూడా. యుద్ధ విజయాలపై ఇంత చర్చ నడుస్తున్న ప్రస్తుత వాతావరణంలో, ఎవరికి వారు మాదే విజయమని ప్రకటించుకునే వాతావరణంలో ఆయన్ను ఈ విషయమై ప్రశ్నిస్తే అదసలు ప్రశ్నే కాదని తేల్చిచెప్పారు. లెబనాన్ పౌరులు ఆత్మగౌరవంతో బ్రతకడమే తమ లక్ష్యమని ఇజ్రాయెల్ దురాక్రమణ అంతమయ్యేవరకూ తాము పోరాడుతూనే ఉంటామని తేల్చిచెప్పాడు. అలాగే ఇజ్రాయెల్ ఉనికినే గుర్తించబోమనే గతకాలపు ధోరణులకు భిన్నంగా దాని అస్తిత్వాన్ని గుర్తిస్తామంటూ ఆచరణాత్మకమైన వైఖరి తీసుకున్నాడు. అన్ని మతాల వారు సమానమైన హక్కులతో సహజీవనం చేసే లెబనాన్‌నే కోరుకుంటున్నట్టు చెప్పాడు. ఎవరెన్ని కుట్రలు పన్నినా లెబనాన్‌లో మళ్లీ అంతర్యుద్ధం రాకుండా ఐక్యతను కాపాడుకోవడానికే తాము సర్వశక్తులూ వినియోగిస్తామని స్పష్టంచేశాడు. లెబనాన్‌లో ఎలాగోలా అంతర్యుద్ధం చెలరేగేలా చేసి సౌదీ తరహా కీలుబొమ్మ ప్రభుత్వాన్ని నెలకొల్పాలని అమెరికా-ఇజ్రాయెల్‌లు సకల యత్నాలూ చేస్తున్న నేపథ్యంలో ఈ అవగాహన కీలకమైనది. ఏమైతేనేం. ఎలాగైతేనేం. గోలియత్ భంగపడ్డాడు. డేవిడ్ విజయం సాధించాడు. కాకపోతే హిబ్రూ బైబిల్‌లోని క్రీస్తు పూర్వపు 11వ శతాబ్ది నాటి గోలియత్ బలగర్వంతో విర్రవీగే పాలస్తీనీయుడైన వస్తాదైతే డేవిడ్ ఇజ్రాయేలీయుడైన బాలుడు. ఇప్పుడూ కథ అదే. కాకపోతే పాత్రల ప్రదేశాలు తారుమారయ్యాయి. (ఇప్పుడు పోరు జరిగిన ప్రాంతం అలనాటి పాలస్తీనాలో భాగం) ●

# విప్లవమంటే....?

- కోర్టులో భగత్‌సింగ్ వాంగ్మూలం

***ఈ సెప్టెంబర్ 27న భగత్‌సింగ్ శతజయంతి సంవత్సరం ప్రారంభమవుతుంది. 1907 సెప్టెంబర్ 27న జన్మించిన భగత్‌సింగ్ జలియన్‌వాలాబాగ్ మారణకాండ (1919) తో రాజకీయాల్లో ప్రవేశించి లాలాలజపతిరాయ్ హత్యకు వ్యతిరేకంగా సాగిన ఆందోళనలో, ఢిల్లీలో కేంద్ర శాసనసభలో బాంబు విసిరిన ఘటనలో, బ్రిటిష్ పోలీస్ అధికారి సాండర్స్ హత్యాప్రయత్నంలో, హిందూస్థాన్ సోషలిస్ట్ రిపబ్లికన్ ఆర్మీ నిర్మాణంలో క్రియాశీలపాత్ర వహించాడు. ఇరవై నాలుగు సంవత్సరాలు నిండకుండానే వలసపాలకుల ఉరికంబం ఎక్కిన భగత్‌సింగ్ జీవితం నుంచీ, రచనల నుంచీ నేర్చుకోవలసింది ఎంతో ఉంది. ఈ సంవత్సరమంతా భగత్‌సింగ్‌ను, సహచర విప్లవకారులను, బ్రిటిష్ వ్యతిరేక స్వాతంత్ర్య సమరయోధులను సంస్మరించుకునే కృషిలో భగత్‌సింగ్ శతజయంతి సంవత్సరాన్ని ప్రారంభిస్తూ ఈ డాక్యుమెంటు ప్రచురిస్తున్నాం. ఈ ఏడాది పొడుగునా ఆ ఉజ్వల గాథలనుంచి ఉత్తేజకర సందర్భాలను ప్రచురిస్తాం. -సం.***

**మా** అర్థంలో విప్లవమంటే ఇప్పుడు అన్యాయ చట్రంలో బిగించబడ్డ పరిస్థితులు మారాలి. వస్తూత్పత్తికి కారకులైన కార్మికులు సమాజంలో కీలకమైన వ్యక్తులుగా ఉండికూడా వారి శ్రమ ఫలితాన్ని యజమానులు దోపిడి చేయడమేకాక ప్రాథమిక హక్కులు కూడా వారికందకుండా చేస్తున్నారు.



ప్రజలందరి ఆహారావసరాలు తీర్చడానికి శ్రమించి పంట పండించే రైతు తన భార్య పిల్లలతోసహా ఆకలికి మాడే దౌర్భాగ్యస్థితి, ప్రపంచానికంతటికి గుడ్డల్ని అందించే సాలెవాడు తన పిల్లల్ని చిరుగులతో కప్పాల్సిన నికృష్టస్థితి, భవంతుల్ని నిర్మించి ఆధునికాలంకారాల్ని వాటిలో సమకూర్చే తాపీ, కమ్మరి, వడ్రంగి తాము నివసించేందుకు పూరి గుడిసెలు కూడా లేక సంసారాలతో సహా మురికి గుంటల పక్క దొర్లాల్సిన హీనస్థితి ఏర్పడింది. ధనికులు, దోపిడీదార్లు సమాజాన్ని జలగల్లా పట్టి, లక్షలకు లక్షలు తమ విలాసాలకు ఇష్టమొచ్చినట్టు ఖర్చు పెడుతున్నారు. దారుణమైన అసమానతలు, అవకాశాల్లో భేదాలు తీవ్ర పరిణామానికి దారితీయక మానవు. ఈ ప్రస్తుత పరిస్థితులు ఇంకెంత కాలం సాగవు. తమ సంపదలతో, వైభవాలతో కన్నుగానక ఆనందంలో మునిగిపోయిన ఈ ధనిక వ్యవస్థ బద్దలుకాబోతున్న అగ్నిపర్వతపు లావాలో మునిగి తీరుతుంది.

ఈ నాగరికతా భవనాన్ని సరైన సమయంలో రక్షించకపోతే తుత్తునియలు కాకమానదు. ఇప్పుడు పెద్ద మార్పు అవసరం. సోషలిజం పంథాలో సంఘాన్ని పునర్నిర్మించదలచిన ప్రతివారూ ఈ సత్యాన్ని తప్పక గుర్తించాలి. మనిషిని మరో మనిషి, దేశాన్ని మరోదేశం దోపిడీ చేయడాన్ని అరికట్టనంతవరకు, నేడు ప్రజల్ని భయంలో ముంచుతున్న బాధలు, యుద్ధంలో దారుణ మరణాలు తప్పవు. నేడు ప్రతి దేశం చిలుక పలుకులుగా వలుకుతున్న యుద్ధ నివారణ, ప్రపంచశాంతి అన్నీ ముసుగులో దాగిన బూటకాలు.

విప్లవమంటే ఈ పై అనర్థాలకు గురికాని, కార్మిక నియంతృత్వాన్ని ఆమోదించగలిగిన వ్యవస్థను స్థాపించడం. సామ్రాజ్యవాదం నుండి, ధన స్వామ్యం నుండి, యుద్ధాలనుండి ప్రపంచ దేశాలన్నిటినీ రక్షించాలు.

ఇదే మా సిద్ధాంతం. ఈ సిద్ధాంతం ప్రేరణతోనే మేం తీవ్రంగా హెచ్చరిస్తున్నాం.

ఒకవేళ ప్రస్తుత ప్రభుత్వం సహజంగా ఉప్పొంగుతూ పారే ఈ ప్రవాహాన్ని ఆపడానికి ప్రయత్నిస్తే, ఆ అడ్డంకుల్ని తోసివేయడానికి శ్రామిక నియంతృత్వాన్ని స్థాపించడానికీ, విప్లవ సిద్ధాంతాన్ని సాధించడానికి తిరుగులేని పోరాటం జరుపుతాం.

విప్లవం మానవుని జన్మహక్కు. స్వాతంత్రం ప్రతి వ్యక్తి స్వంత హక్కు. నిజంగా సంఘాన్ని నిలుపగలిగేది శ్రమశక్తి ఒక్కటే. ప్రజా శ్రేయస్సే కార్యకర్తల అంతిమ లక్ష్యం కావాలి.

ఈ లక్ష్యాల కోసమూ, ఈ నమ్మకాలతోనూ ఎటువంటి బాధలనయినా మేం అహ్వానిస్తాం. ఈ పరమ పవిత్రమైన విప్లవకార్యం కోసమే యువకులమైన మేం, సమిధలుగా మమ్మ మేం అర్పించుకుంటూ, ఈ మహత్తర కార్యక్రమంలో ఎటువంటి త్యాగానికైన సిద్ధంగా ఉన్నాం. రాబోయే విప్లవం కోసం ఎదురు చూస్తున్నారు. ◆

# గ్రామీణ ప్రాంతాలలో పట్టణ సౌకర్యాల కల్పన : 'పుర' పథకం

- తోట సత్యనారాయణ

*(ఆగస్ట్ 2006 సంచిక తరువాయి)*

మొదటిది ఫిజికల్ కనెక్టివిటీ .... ఈ కనెక్టివిటీ కింద 15-25 రోడ్డు ప్రక్కన గల గ్రామాలు ఒక గ్రూపుగా ఉండి, ఒక్కొక్కదానికి సంబంధం కలిగి ఉండాలి. ఈ గ్రామాలకు రింగ్ రోడ్డు కలిగి ఒక్కొక్క గ్రామం దాన్ని ఉపయోగించుకొనేటట్లుండాలి. దీనికి అనుబంధంగా రైలు, రోడ్డు నెట్‌వర్క్, విద్యుత్తు, రవాణా సౌకర్యాలు కల్పించాలి. అన్ని నగర కేంద్రాలు శాశ్వత రోడ్లు వ్యవసాయ క్షేత్రములతో కలుపబడతాయి. అవసరమైనంతగా వ్యవసాయ క్షేత్రాల నుండి నివాస గృహాలకు, నివాసాల నుంచి వ్యవసాయ క్షేత్రాలకు ప్రజా రవాణా ఏర్పాటు ఉంటాయి. వ్యవసాయ క్షేత్రాల రక్షణకు భద్రతా దళాలు ఏర్పాటు చేయబడతాయి. ఇపుడున్న నగరాలను, నగర కేంద్రాలను సూపర్‌కాస్మోపాలిటన్ నగరాలుగా అభివృద్ధి పర్చవచ్చు.

రెండవది డిజిటల్ కనెక్టివిటీ.... దీని ప్రధానోద్దేశ్యం గ్రామాలను అనుసంధానం చేస్తూ ఆధునిక టెలికమ్యూనికేషన్, సమాచార టెక్నాలజీ సర్వీసులు కల్పించడం. ప్రజా ప్రచార మాధ్యమాలు, గ్రామీణ, అజ్ఞానాన్ని అధిగమించుటకు, ప్రతివ్యక్తిని వ్యక్తిగతంగా గుర్తించునట్లుగా ఏర్పాటు చేసి కంప్యూటర్ల ద్వారా గుర్తింపు కార్డులను అందరికి సమకూర్చుట. ఉదాహరణకు, ఈ-సేవా కేంద్రాలు, ఈ-వ్యవసాయం, పబ్లిక్ కాల్ ఆఫీసులు, రాజీవ్ ఇంటర్నెట్ విలేజ్ సైబర్ కేఫ్‌లు మొదలగునవి.

మూడవది నాలెడ్జికనెక్టివిటి, ప్రతి 5 నుండి 7 కి.మీ. పరిధిలో సర్కులర్ రింగ్ రోడ్డులో పాఠశాలలు, ఉన్నత విద్యా సెంటర్లు, ఆసుపత్రులు, ఔషధశాలలు, శిక్షణ సంస్థలు మొ॥ స్థాపించే ప్రయత్నం చేయడం, ఈ కేంద్రాలను పర్యవేక్షించటానికి, నిర్వహణ నిపుణుల సేవలు వినియోగించుకొనబడతాయి. సామాజిక కేంద్రాలు పర్యాటక ప్రాంతాలు, వినోద కేంద్రాలు, క్రీడా కేంద్రాలు, జలక్రీడ వసతులు మొదలైనవి.

నాలుగవది ఆర్థిక కనెక్టివిటి, ఈ తరహాలో కొన్ని గ్రూపులు కలిగిన గ్రామాలకు తేలికగా అమ్మటం, కొనటం రోజు వారి సేవలను ఉపయోగించుకోనే సౌకర్యాలు కల్పించడం. దీంతో వివిధ గ్రామాల ప్రజలకు, వారు ఉత్పత్తి చేసిన అన్ని రకాలైన సరుకులకు మార్కెటింగ్ సౌకర్యాలు, పంటలలోని వివిధ తరగతులు, రసాయన ఎరువులు, విత్తనాలు, నిల్వచేయడం, పంటను శుద్ధి పరుచుటలో శిక్షణ వ్యవసాయ భూముల ఉత్పత్తులకు ఉత్పత్తి జరిగే చోటనే ఉపయోగించటానికి వీలుగా పరిశ్రమల తోడ్పాటు, వివరాల నిధి సమస్యల పరిష్కారం కూడా లభ్యతలో ఉంచడం.

ప్రస్తుత రాష్ట్ర అభివృద్ధిని బట్టి, ప్రాంతాన్ని బట్టి 'పుర'ను మూడు రకాలైన తరగతులుగా విభజించవచ్చు. అవి ఏ, బి, సి తరగతులు వాటి లక్షణాలు ఈ క్రిందివిధంగా ఉంటాయి.

'ఏ' తరహా క్లస్టర్‌లో పట్టణ ప్రాంతానికి దగ్గరలో ఉన్న గ్రామాలలో కనీస రోడ్డు సౌకర్యం, పరిమిత మౌలిక సదుపాయాల సౌకర్యం, పరిమిత మద్దతులో పాఠశాల, ప్రాథమిక ఆరోగ్య కేంద్రం కలిగి ఉండాలి.

'బి' తరహా కస్టర్‌లోని గ్రామాలు పట్టణ ప్రాంతానికి దగ్గరలో ఉండాలి. కాని అవి అదనంగా మౌలిక సదుపాయాల వ్యాప్తి కనెక్టివిటి లేకుండా ఉండాలి.

'సి' క్లస్టర్ లోని గ్రామాలు పూర్తిగా మారుమూల ప్రాంతాలకు చెందినవై, మౌలిక సదుపాయాల కనెక్టివిటి లేకుండా వున్నవి.

'పుర' సంబందిత ఉద్యోగ యంత్రాంగం సహాయంతో గ్రామాలను ఆర్థిక ఉత్పాదక జోన్లుగా రూపాంతరం చెందేందుకు ఉపయోగించు కోవాలి.

## పెట్టుబడులు - నిధులు

భారత ప్రభుత్వం 2003లో ఐదువేల 'పుర'లను (ప్రధానమంత్రి) లాంఛన ప్రాయంగా ప్రారంభించాలని ప్రకటించారు. స్పష్టంగా, దేశంలో ఐదువేల గ్రామీణాభివృద్ధి బ్లాకులున్నాయి. ప్రతి బ్లాకు ఒక లక్ష జనాభా కలిగి ఉంది. ప్రభుత్వ రంగ ఖాతాల్లో 50 శాతం తలసరి పెట్టుబడి రమారమి రు. 20,000 ఉన్నట్లు ప్రస్తుత పదో ప్రణాళిక పోర్కొంది. ప్రభుత్వ రంగంలో భాగమైన 'పుర' కోసం 5 వేల గ్రామీణాభివృద్ధి బ్లాకులకు గాను రు. 5,00,000 కోట్లు హెచ్చించవలసి వుంటుంది. ప్రతి ఒక్క 'పుర'కు రు. 100 కోట్లు కేటాయించవల్సి ఉంది. విజన్ 2020 ప్రాజెక్టు క్రింద 'పుర'ను మూడు పంచవర్ష ప్రణాళికల్లో వ్యాపింప చేసి ఒక్కొక్క అభివృద్ధి బ్లాకుకు లేదా క్లస్టర్‌కు రు. 100 కోట్ల పెట్టుబడితో ప్రారంభించాలని పేర్కొన్నారు.

## 'పుర' పై ప్రభుత్వ చర్యలు.

కేంద్ర క్యాబినెట్ (2004)లో 'పుర'ను అమలుపర్చాలనీ సూత్రప్రాయంగా అంగీకరించారు. గ్రామీణ-పట్టణ విభజన సామాజిక - ఆర్థిక అభివృద్ధిని సమతౌల్యం చేసేందుకు ప్రస్తుత నికర బడ్జెటరీ మద్దతుతో పూరించాలనీ పేర్కొన్నారు. ఇందుకుగాను, ప్రభుత్వం ఊహించి వెనక బడ్డ ప్రాంతాలలో నాలుగువేల గ్రామీణ క్లస్టర్‌లను అభివృద్ధి పర్చాలనీ పేర్కొంది. అయితే, ఒక్కొక్క క్లస్టర్‌కు రు. 3 కోట్లు కేటాయించారు. నాలుగువేల 'పుర'లకు అభివృద్ధి పర్చేందుకు రు. 12,000 కోట్లు వ్యయం చేయవలసి ఉంటుంది.

## ప్రజల వలసలు -ప్రెఫెల్ ఆర్థిక వృద్ధి

ప్రజల వలసలను అరికడుతూ-ప్రెఫెల్ ఆర్థికాభివృద్ధికి 'పుర'ను భాగస్వామ్యం చేస్తూ కమ్యూనిటి అభివృద్ధి ప్రాజెక్టులను ప్రణాళిక ప్రక్రియ

ద్వారా అభివృద్ధి పర్చారనడంలో ఏమాత్రం సందేహం లేదు. గ్రామీణ ప్రజల్లో హరిత విప్లవం ద్వారా వారి తలసరి ఆదాయాన్ని, జాతీయాదాయాన్ని వృద్ధి చేసుకునేందుకు అవకాశం కల్పించారు. కానీ గ్రామీణ-పట్టణ ప్రాంతాల విభజన గ్రామీణ ప్రజల వలసలు పట్టణ ప్రాంతాలకు మాత్రం నేటికి కొనసాగుతునే ఉన్నాయి. 1951 జనాభా లెక్కల ప్రకారం పట్టణ జనాభా 17.3 శాతం, 2001లో 27.8 శాతానికి పెరిగింది. 1951లో 62 మిలియన్ల ప్రజలు పట్టణ ప్రాంతాలలో నివసించేవారు. అది ఈ రోజున 285 మిలియన్లకు చేరుకుంది. పట్టణాలు పరిమాణం, విషయంలో పట్టుగా వుంటాయి. కాని గుణం విషయంలో తగినట్టుగా వుండవు. పట్టణ ప్రాంతాలన్ని 35.7 శాతంలో పెరిగి కిక్కిరిసిన జనంతో నిండిపోయాయి. పట్టణాలు ఆడంబర పూరిత వరల్డ్ ఫెయిర్‌లని, ట్రాఫిక్ జామ్‌లనీ, మరిన్ని కార్లనీ, సాటిలేని రహదార్లనీ, షాపింగ్ కేంద్రాలనీ, లెవిట్ టౌన్లు, భారీ సూపర్ మార్కెట్లనీ తప్పించి మరేమి కాదు. విస్తృత ప్రజానీక ప్రయోజనాలనీ పక్కన బెట్టి, వాళ్ళని నిరాశ నిస్పృహలకు గురిచేస్తున్నాయి.

గతంలో భారత ప్రజలు ప్రపంచవ్యాప్తంగా నాలుగు రకాలైన వలసలకు ప్రాతినిధ్యం వహించేవారు.

ఫస్ట్‌వేవ్ వలస : ఈ వేవ్‌లో బహుశ భారతీయులు యాత్రికులుగా, టీచర్లుగా, వర్తకులుగా అవకాశాల కొరకు వలస వెళ్ళని వారు ఈ కోవకు చెందుతారు.

సెకండ్ వేవ్ వలస : ఈ వేవ్ బలవంతపు వలస స్వభావాన్ని కలిగినది. ఒప్పందపు కార్మికులుగా (లిఖితపూర్వకంగా వలస వాద వీలునామాలు) ఈ తరహా వలసలో భారతీయులు ప్రధానంగా ఆఫ్రికా, వెస్టిండీస్, ఇంగ్లాండు వెళ్లారు.

థర్డ్ వేవ్ వలస : ఈ తరహాలో దేశ విభజన మూలంగా తయారైనవారు. వీరు ఎక్కువగా అభివృద్ధి చెందుతున్న దేశాల్లోకి వలస వెళ్లినవారు.

ఫోర్త్ వేవ్ వలస : ఇది ఇటీవల అభివృద్ధి చెందింది. భారతీయులు విజ్ఞానాన్ని నైపుణ్యం, చైతన్యంతో కూడిన అనేక సవాళ్లను, అవకాశాల కొరకు వలస వెళ్లారు. అమెరికా సంయుక్త రాష్ట్రాలు, కెనడా, ఇంగ్లీష్ మాట్లాడే యూరోపియన్ దేశాలు, పశ్చిమాసియా దేశాలే వీరి గమ్యాలు.

ఒక వేళ, ఫిఫ్త్ వేవ్ ఉంటే, అది 21వ శతాబ్దం చివరిలో భారతీయులు గ్రహాల నాగరికతలో పాలుపంచుకుంటారు. తర్వాత గురుగ్రహంపై నివాసం, చంద్రగ్రహంపై పారిశ్రామిక స్థాపన జరుగుతుంది. ఇది ఫిఫ్త్ వేవ్ వలసలో జరిగే పరిణామం.

పైన పేర్కొన్న ఐదు రకాలైన వలసల వేవ్‌లలో చరిత్రగమన శీల నిర్మాణంలో వివిధ కారణాలు చోటుచేసుకున్నాయి. కానీ వలసల్లో కేంద్ర ఇతివృత్తమంతా వారు మంచి జీవన పరిస్థితుల్లో, శ్రేష్ఠమైన అవకాశాలు దక్కించుకొనేందుకే, ప్రపంచవ్యాప్తంగా వలసదారులున్నారు. భారతీయులు ఎల్లప్పుడు వ్యక్తిగతంగానే వలస వెళతారే గానీ సామూహికంగా ఏనాడు వెళ్ళలేదు. భారతీయులు సముద్రాంతర ప్రాంతాలను దాటి వెళ్లినా వారి జీవన సంస్కృతిని, వారసత్వపు విలువలని ఏనాడు మరచిపోలేదు. ప్రపంచదేశాల్లో ఎంతో మంచి విద్యావకాశాలు పొంది, పెంపొందించుకొని, ఉపాధి పొంది ఎన్నో అద్భుత విజయాలను సాధిస్తూ వస్తున్నారు. వీరు మాతృభూమిని, దేశ సంస్కృతిని, ఆచారాలను, సంప్రదాయాలను, విలువలను ఏనాడు విస్మరించరు. వీరి మధ్య తల్లి బిడ్డల మధ్యన వున్న పేగు సంబంధంగా ఈ వలసలను అభివర్ణించవచ్చు.

ప్రొఫెసర్ ఎ.ఎం.కుస్రో మాటల్లో చెప్పాలంటే, 'ఎక్కడైతే' ప్రజలు వలసలు వెళతారో ఆ గ్రామాలకే మౌలిక సదుపాయాలను కల్పించాలి. 'పుర' ప్రధాన లక్ష్యం సామాజిక, ఆర్థిక, మౌలిక సదుపాయాల సృష్టి, అందుకు, గ్రామీణ ప్రాంతాలలో ప్రైవేటు రంగంచే పెట్టుబడులు పెట్టేందుకు వాతావరణం సృష్టించాలి. పదో ప్రణాళికా కాలంలో వ్యవహారిక వాద దృక్పథంతో ఆలోచించి, వెనకబడిన ప్రాంతాలలోని 600 బ్లాకులను ఎంపిక చేసి, ఒక్కో బ్లాకుకు రు. 25 కోట్లు పెట్టుబడి పెట్టి, అవసరమైన మౌలిక సదుపాయాల కల్పన జరపాలనీ బ్లాకు అభివృద్ధి కమిటీ అభిప్రాయపడింది. మిగిలిన 35 శాతం నుండి 40 శాతాన్ని, 11వ లేదా 12వ ప్రణాళిక కాలంలో పూర్తి చేయాలని పేర్కొంది. ఇందుకుగాను, కేంద్ర ప్రభుత్వం నుండి 80 శాతం గ్రాంట్లను ఇస్తే 20 శాతం గ్రాంట్లను రాష్ట్రాలు భరించాలనీ సూచించింది. ఇది ప్రస్తుతం రు. 12 వేల కోట్లకే పరిమితమైంది. దీని దృష్ట్యా, కేంద్రం తక్షణం అవసర రీత్యా రు. 20వేల కోట్లు విడుదల చేయాలి. అపుడే, 'పుర' లక్ష్యాన్ని వెనకబడిన ప్రాంతాలలో అమలు జరిపిన వారమవుతాం.

'పుర'ను మూడు రకాలైన తరగతులుగా విభజించవచ్చును. రెండవ తరహా 'పుర'కు తక్కువ పెట్టుబడులు పెట్టే అవకాశముంది. అదే మొదటి తరహా 'పుర'కు ప్రైవేటు పెట్టుబడులకు ఆకర్షితమయ్యే అవకాశాలు ఎక్కువగా వున్నాయి. అందుకే, ప్రభుత్వం విజన్ 2020 కొరకు 'పుర' అభివృద్ధి క్లస్టర్స్‌ను విత్త సంబంధిత స్థాయి, గ్రేడులను వాటి పద్ధతులను నిరంతంగా అభివృద్ధి పర్చాలంటే క్లస్టర్స్‌ను ప్రత్యేకంగా అభివృద్ధి పరచక తప్పదు. ఈ సమస్యను అధిగమించాలంటే, మనం పెద్ద ఎత్తున దీన్ని ముందుకు తీసుకెళ్ళాల్సిందే. ఇకపోతే, మూడవ తరహా 'పుర'కు ఉన్నత స్థాయిలో రాజ్య మద్దతు అవసరం. ప్రైవేటు రంగ పెట్టుబడిదారులు సాంఘిక బాధ్యతతో పెట్టుబడులు పెట్టడానికి ముందుకు వస్తే ప్రభుత్వం అవసరమైన మౌలిక సదుపాయాల మద్దతు ప్రోత్సాహకాలు పై ఉద్దేశ్యానికి ప్రకటించాలి.

**'పుర' అమలు తీరు :**

అత్యున్నతస్థాయిలో నున్న ప్రణాళికా సంఘం డిప్యూటి ఛైర్మన్ ఆధీనంలో 'పుర' అమలు బాధ్యతలను అప్పగించాల్సిన అవసరం ఎంతైన వుంది. ప్రతి రాష్ట్రం తప్పనిసరిగా రాష్ట్ర స్థాయిలో 'పుర' కార్పొరేషన్ ఏర్పాటు చేసి దానిలో చిన్న తరహా పరిశ్రమల, ఆర్థిక సంస్థల, సహకార సంఘాల, పంచాయితీ సంస్థల సాంకేతిక సిబ్బందిని, ప్రతినిధులను సభ్యులుగా చేర్చుకోవాలి. దీంతో సంయుక్త కార్యాచరణ ద్వారా 'పుర'

విజయావకాశాలను చేకూర్చిన వారమౌతాం. 'పుర మిషన్'కు ప్రధాన ఆటంకం డిమాండ్‌వైపే ఉంటుంది. దీన్ని సాధించాలంటే కొన్ని కార్యకలాపాలను చేపట్టవలసిన అవసరం ఉంటుంది. ముఖ్యంగా గ్రామీణ జనాభాకు సరిపడే వేతన ఉపాధి కల్పన, సంభావ్య డిమాండ్‌ను కల్పించాలి. తక్కువ సంవృద్ధి కలిగిన రాష్ట్రాలలోని వెనకబడిన గ్రామీణ ప్రాంతాలకు 'పుర' మరో హరిత విప్లవంగా దోహద పడుతుంది.

**టెక్నాలజీ-రూపాంతరీకరణ :**

దేశంలోని ఆరులక్షల గ్రామాలను టెక్నాలజీ ద్వారా మార్పు చేయవలసిన ఆవశ్యకత ఎంతైన ఉంది. ఇందుకుగాను 'పుర' కార్యక్రమాన్ని సృష్టించి భౌతిక కనెక్టివిటి, ఎలక్ట్రానిక్ కనెక్టివిటి, నాలెడ్జ్ కనెక్టివిటి, ఆర్థిక కనెక్టివిటీలతో దేశంలోని వివిధ ప్రాంతాలకు వ్యాపింపచేయాలి. రు. 500 కోట్లతో 100 'పుర' క్లస్టర్స్‌ను అభివృద్ధి పర్చాలి. ఇందుకు 20 నుంచి 30 గ్రామాల విద్యా ఆధారిత సంస్థలను కలిగి ఉండేటట్లు ఏర్పాటు చేసుకోవాలి. అభివృద్ధి గ్రామ విజ్ఞాన కేంద్రాలను, ఆగ్రో క్లినిక్స్, టెలివిద, టెలి ఆరోగ్య కేంద్రాలు వీటితో పాటు ఉపాధి ఆధారిత పథకాలైన బయో-గ్యాస్ ప్లాంట్స్, వాటర్ ట్రీట్‌మెంట్ ప్లాంట్స్ (బ్రాకిష్ టు పొటబుల్ వాటర్), బయోఫ్యుయల్ ఎస్టరీపికేషన్ ప్లాంట్స్, కోల్డ్ స్టోరేజ్‌లు, వినియోగ ఉత్పాదక అభివృద్ధి, వృత్తి విద్యాశిక్షణా కేంద్రాలు మరియు వ్యాపార కేంద్రాలను జాతీయ, అంతర్జాతీయ మార్కెటింగ్ ఉత్పాదకతలను గ్రామీణ ఎంటర్‌ప్రైజెస్ ద్వారా నెలకొల్పాలి.

పైన పేర్కొనబడిన కార్యకలాపాలలో ఎవరైతే ఈ 'పుర' కార్యక్రమం ద్వారా లబ్ధిపొందుతారో స్థానిక ప్రజలతో సంప్రదించి వీటికి కావలసిన కార్యాచరణ ప్రణాళికను విద్యాసంస్థల ద్వారా చేపట్టాలి. ఈ '100 పుర' కార్యకలాపాల్లో పెద్ద ఎత్తున భవిష్యత్తులో పారిశ్రామిక శ్రేణుల్లో ప్రభుత్వ - ప్రైవేట్ భాగస్వామ్యంతో కూడిన అనుభవాన్ని కల్పించాలి. ఈ తరహా అభివృద్ధి ప్రక్రియలో గ్రామీణ భారతీయ ఎంటర్‌ప్రైన్యూర్స్‌ను ప్రోత్సహించి వారిలో సామర్థ్యాన్ని నిర్మించి, అభివృద్ధి పర్చాలి. ఈ ప్రయోగాలు, శాస్త్రీయవిజ్ఞానం అంతా శాస్త్ర-సాంకేతిక విజ్ఞానం కోసమే. దీనితో, సామాజిక రూపాంతరీకరణ జరగాలి. అప్పుడే 'పుర' క్లస్టర్స్‌కు చెందిన విద్యాసంస్థలు, గ్రామీణ ప్రజలు 'పుర' విజేతలుగా నిలుస్తారు. చివరిగా, ఈ 'పుర' క్లస్టర్స్‌ను మూల్యాంకనం చేయడంతో గ్రామీణులు లబ్ధిపొందగలుగుతారు. శాస్త్రజ్ఞులు, సాంకేతిక నిపుణులు, గ్రామీణ ప్రజలు 'పుర' విజేతలుగా నిలుస్తారు. శాస్త్రజ్ఞులు, సాంకేతిక నిపుణులు, గ్రామ సభ్యులు గల సంయుక్త బృందం కలిసి ఈ మూల్యాంకం చేయాలి. ఇది సివిక్ శాస్త్రవేత్తలకు మార్గదర్శకంగా ఉంటుంది. అంతేకాకుండా, శాస్త్రీయ సమూహానికి ప్రభుత్వ బృందానికి ఇది అనుభవాన్నిస్తుంది.

**ముగింపు :**

అనేకమంది తత్త్వవేత్తలు అభివృద్ధిని గురించి తాము భావించిన రీతిలో వివరించారు. వాటి సిద్ధాంతాలు-దృక్పథాలు తీరుతెన్నులు, సామాజికాభివృద్ధి స్థాయిని గురించి, సామాజిక సుస్థితిని, అవలంబించ వలసిన మార్గాన్ని సూచించారు. గాంధేయ దృక్పథంగా 'పుర' పథకాన్ని ఆచరణయోగ్యంగా ఆలోచనను రూపొందించి, ఆర్థికాభివృద్ధిలో భారత్‌ను మరింత ముందుకు తీసుకుపోవడానికి సమగ్ర పట్టణ - గ్రామీణ ప్రాంతాల అభివృద్ధిపై దృష్టిని కేంద్రీకరించాలి. సమానత్వ సూత్ర ఆధారితంగా సామాజిక అభివృద్ధిని సాధించాలి. గ్రామీణ ప్రాంతాలల్లో పట్టణ సౌకర్యాల కల్పనతో గ్రామాల ఆర్థిక పునరుద్ధరణ జరగాలి.

పై నేపథ్యంలో సాధారణంగా భారత్, మరి ప్రత్యేకంగా ఆంధ్ర ప్రదేశ్ నేర్చుకోవలసినది గడచిన కాలంలో చరిత్రపరంగాను, విలువల పరంగానూ సమాజంలో ఎన్నో సమస్యలు నేడు పట్టి పీడిస్తున్నాయి. స్వాతంత్ర్యానంతరం పాలకులు అభివృద్ధికి సంబంధించిన పథక రచనల్లో ఈ సమస్యల పరిష్కారానికి తగినంత ప్రాధాన్యత ఇవ్వలేదు. ప్రపంచీకరణ, సరళీకరణల వంటి తాజా విధానాల వల్ల దేశం ఎదుర్కొంటున్న సామాజిక సమస్యలు పరిష్కారం కావడం మాట అటుంచి, అవి మరింత నిర్లక్ష్యానికి గురి అవుతున్నాయి.

ప్రభుత్వం అమలు చేస్తున్న విధానాల సాయంతో అభివృద్ధి సాధనలో, కులం, వర్గం, లింగ, తదితరాలు మనుషుల మధ్య సృష్టించే అంతరాలను అంతమొందించి సామాజిక పరివర్తనకు దోహద పడేట్లు;

☆ అభివృద్ధికి సంబంధించిన విధానాల రూపకల్పనలోనూ, అమలులోనూ సమానత్వమే కేంద్ర అంశంగా ఉండాలి.

☆ వనరులు, శక్తి, సామర్థ్యాలు కొరవడిన వర్గాల వారికి విస్తృత అవకాశాలు లభించేలా చూసేందుకు ప్రభుత్వం కార్యరంగంలోకి దిగాల్సిన అవసరం ఉంది.

☆ శారీరకంగానే కాదు, మానసికంగాను గ్రామీణులు ఆరోగ్యంగా ఉండేందుకు వారు ఆర్థికంగా పరిపుష్టిని సాధించేందుకు ప్రభుత్వం చర్యలు చేపట్టాలి.

దేశంలో రెండు లక్షల ఇరవై వేల గ్రామాలకు రక్షిత మంచినీటి సౌకర్యం, పక్కా రోడ్లు లేవు. లక్షకు పై చిలుకు ఊళ్లలో పాఠశాలలకు పక్కా భవంతులు లేవు. ఇవన్నీ రెండు రెండున్నరేళ్ల క్రితమే ఎన్.డి.ఏ. సర్కార్ వెల్లడించిన అంచనాలు.

ఇక ఆంధ్రప్రదేశ్ విషయానికొస్తే, రాష్ట్రంలోని మూడు ప్రాంతాల్లో (తెలంగాణా, రాయలసీమ, కోస్తా) వెనుకబడిన జిల్లాల, మండలాల, సామాజికంగా వెనుకబడి వున్న గ్రూపుల స్థితిగతులను మెరుగుపర్చడానికి ప్రాధాన్యతనివ్వాలి. ప్రాంతీయ సామాజిక అసమానతలను తద్వారా తొలగించాలి. వెనుకబాటు తనాన్ని నివేదికలే విపులీకరించనవసరం లేదు. సాధారణ అవగాహన చాలు. గ్రామీణ వికాసానికి, వ్యవసాయాభివృద్ధికి, మౌలిక వసతుల కల్పనపై దృష్టిని సారించాలి. ఈ పథకం శాస్త్ర-సాంకేతిక విజ్ఞానాధారితంగా గ్రామీణ సమాజం రూపాంతరం చెందాలనీ మనందరం కోరుకుంటాం. 'పుర' ఇందుకు 'మణిపూస' లాంటి సాక్ష్యం. ◆

# వ్యవసాయ సంక్షోభానికి మూలకారణం

- వై.వి.కృష్ణారావు

*(ఆగస్ట్ 2006 సంచిక తరువాయి)*

**జి.** డి.పి. రేట్లు పడిపోవడంతో పాటు, నూతనంగా పెట్టుబడులు పెట్టడం తగ్గిపోయింది. లాభాల రేటుపడిపోయింది. దీనితో పెట్టుబడి సంచయన రేటు (క్యాపిటల్ ఎక్యుమిలేషన్) కూడా పడిపోయింది. ఈ పరిస్థితులలో ఈ స్థితి నుండి బయటపడటానికి పెట్టుబడిదారీ దేశాల కార్మిక వర్గంపైన, తృతీయ ప్రపంచదేశాలపైన క్రూరమైన విధానాలు అవలంబించబడ్డాయి. ఈ తీవ్రమైన వ్యవస్థాగత మార్పునే సామ్రాజ్యవాద నూతన దాడి అంటున్నారు. పెట్టుబడిదారీ వ్యవస్థలో సమూల మార్పులు చేసి కొత్త వ్యవస్థా విధానాన్ని ప్రవేశపెట్టడం జరిగింది. దీనినే నియో లిబరల్ ప్రపంచీకరణ అంటున్నాం. నయా సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ విధానం తన కొత్త విధానం అమలుకుగాను అంతర్జాతీయ ద్రవ్యసంస్థను, ప్రపంచబ్యాంకును, అంతర్జాతీయ ద్రవ్య సెటిల్‌మెంట్ బ్యాంకును, అంతర్జాతీయ పెట్టుబడి సంస్థను, గాట్ విధానాన్ని, బహుళ జాతీయ సంస్థలను (ఎం.ఎన్.సి. లను) తన ఏజెన్సీలుగా ప్రయోగించింది. ఈ ధోరణుల వివరాలను కొంత వివరంగా పరిశీలించుదాం.

1975-84 మధ్య, అటు తరువాత కాలంలో స్థూల జాతీయోత్పత్తి పతనాన్ని పట్టిక-1 తెలియజేస్తుంది.

1950-70 మధ్యకాలంలో ప్రపంచ జి.డి.పి. పెరుగుదలరేటు 5 శాతం వరకు వుండగా, 1970 తరువాత అది ఎంతగా పడిపోయిందో పై పట్టికలోని అంకెలు తెలియజేస్తాయి. పారిశ్రామిక దేశాల జి.డి.పి. 1985లో 2.5గా ఉన్నది. అటు తరువాత కాలంలో కొద్దిగా పెరిగి, 1992 నుండి బాగా పడిపోయింది.

**లాభాల రేటు పతనం :**

స్థూల జాతీయోత్పత్తి రేటు పడిపోవడంతో పాటు లాభాల రేటు కూడా పడిపోయింది. 1960 నుండి 1980 మధ్యకాలంలో యూరప్‌లో లాభాలరేటు నూటికి 20 వంతుల నుండి 14 వంతులకు పడిపోయింది. బ్రిటన్, పశ్చిమ జర్మనీ, అమెరికాలలో పారిశ్రామిక, వాణిజ్య కంపెనీల లాభాలరేటు పన్నుల చెల్లింపులకు ముందు 1950-54లో నూటికి 16.5 వంతులుగా వున్నది. 1970లో 9.7 వంతులకు పడిపోయింది. పన్ను చెల్లింపుల తరువాత 1964లో 7.1 వంతులుగా వున్నటువంటిది 1970 నాటికి 4.1 వంతులకు పడిపోయింది. పెట్టుబడిదారి దేశాలలో కార్మికుల నిరుద్యోగము కూడా 1970 తరువాత బాగా పెరిగింది. 1948-1952 మధ్య కాలంలో సగటున నిరుద్యోగుల శాతం నూటికి 3.2 వంతులుగా వున్నది. ఇది 1979-81 మధ్య సగటున సాలుకు నూటికి 4.9 వంతులకు, 1995 నాటికి 7.4 వంతులకు, అటు తరువాత మరింతగా పెరిగింది. కార్మికుతల వేతనాలు పడిపోయాయి. యూరప్‌లో జి.డి.పి. ఉత్పత్తిలో 1970-80 మధ్య కార్మికుల జీతాలు నూటికి 76 వంతులు పెరిగి, అటు తరువాత నూటికి 66 వంతులకు పడిపోయాయి.

ఈ నిరుద్యోగం పెరుగుదల, జీతాల రేటు పతనంతో కార్మికుల జీవన పరిస్థితులు క్షీణించాయి. పెట్టుబడిదారుల దోపిడీ పెరుగుదలను పై అంకెలు తెలుపుతాయి. 1970 నాటికి పెట్టుబడిదారీ వ్యవస్థ బీటలు వారింది. ఉత్పత్తి పెరుగుదల నిలిచిపోవడం, ఉత్పాదకత పతనం వీటికితోడు జీతాల పెరుగుదలకు, సాంఘిక సదుపాయాల పెంపుదలకు, తమ జీవన పరిస్థితుల మెరుగుదలకు కార్మికులు పెద్ద ఎత్తున పోరాటాలు ప్రారంభించడంతో, వర్గ వైరుధ్యాలు పెరిగాయి.

ఈ పరిస్థితిలో సంక్షేమ విధానాలను అమలు జరపడం సాధ్యంకాదని, ఈ విధానాలకు కోతపెట్టడానికి, కార్మికుల జీతాలకోతకు, వారిపై అదనపు భారాన్ని మోపడానికి, అదే సమయంలో తృతీయ ప్రపంచ దేశాలపై తమ దోపిడీని ఎక్కువ చేయడానికి సామ్రాజ్యవాద పెట్టుబడి దేశాలు బరితెగించి నూతన విధానాల అమలుకు పూనుకోవడం జరిగింది.

**(పట్టిక-2) పెట్టుబడి సంచయన రేటు పతనం**

| | 1960 | 1970 | 1980 | 1990 | 2000-04 |
|---|---|---|---|---|---|
| ప్రపంచం | 5 | 5.1 | 4 | 4 | - |
| పారిశ్రామిక దేశాలు | 5 | 4.2 | 3.1 | 3.3 | - |
| అమెరికా | 4 | 3.8 | 2.8 | 3 | 1.8 |

**(పట్టిక-1) సాలుసరి స్థూలజాతీయోత్పత్తి (సగటు)**

| | 1975-84 | 1985 | 1986 | 1987 | 1988 | 1989 | 1990 | 1991 | 1992 | 1993 | 1994 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ప్రపంచం | 3.3 | 3.7 | 3.6 | 3.9 | 4.6 | 3.4 | 2.2 | 0.6 | 1.7 | 2.2 | 3.2 |
| పారిశ్రామిక దేశాలు | 2.5 | 3.3 | 2.9 | 3.2 | 4.3 | 3.2 | 2.3 | 0.5 | 1.7 | 1.1 | 2.2 |
| అభివృద్ధి చెందుతున్న దేశాలు | 4.5 | 5.2 | 4.9 | 5.7 | 5.3 | 4.1 | 3.7 | 4.5 | 5.8 | 6.1 | 5.5 |

| | 1960 | 1970 | 1980 | 1990 | 2000-04 |
|---|---|---|---|---|---|
| యూరప్ | 4.6 | 3.8 | 2.9 | 2.8 | 2.4 |
| జపాన్ | 12.5 | 8.5 | 6.1 | 4 | 3.2 |
| కొరియా | 8.9 | 14.6 | 11.2 | 9.6 | - |
| చైనా | 1.9 | 7.2 | 8.4 | 10.9 | - |
| ఇండియా | 4.5 | 4.1 | 4.9 | 6.2 | - |
| బ్రెజిల్ | 5.8 | 9.6 | 4.1 | 2.2 | - |

ప్రపంచం మొత్తంలోను, పారిశ్రామిక దేశాలలోనూ, వీటిలో ప్రధానమైన అమెరికా, యూరపు యూనియన్, జపానులోను, అభివృద్ధి చెందుతున్న దేశాలైన కొరియా, చైనా, ఇండియా, బ్రెజిల్‌లోను పెట్టుబడి సంచయనం 1960 నుండి 2000-04 మధ్య కాలంలోను ఏవిధంగా వున్నదీ పట్టిక-2 తెలియజేస్తుంది.

పై పట్టికలోని అంకెలను వివరంగా పరిశీలిస్తే, 1970 నుండి ప్రపంచం మొత్తం మీద, ముఖ్యంగా పారిశ్రామిక దేశాలలో పెట్టుబడి సంచయన రేటు పడిపోవడం స్పష్టమవుతుంది. కాగా అభివృద్ధి చెందుతున్న దేశాలలో పెట్టుబడి సంచయన రేటు పెరుగుతుండటం గమనించగలం.

### సామ్రాజ్యవాద దేశాల నూతనదాడి :

1970 దశకంలో ప్రపంచ పెట్టుబడిదారీ విధానం కొత్త పుంతలు తొక్కింది. సరికొత్త స్వరూప స్వభావాలను దాల్చింది. సంక్షేమ పెట్టుబడిదారీ విధానాన్ని తుంగలో తొక్కింది. ఇది పెట్టుబడిదారీ విధానంలో గుణాత్మకమైన మార్పు. ఒక కొత్త దశ. ఆర్థిక ఆధిపత్యాన్ని తిరిగి నెలకొల్పడానికి, పడిపోయిన లాభాలరేటును పునరుద్ధరించడానికి గాను 1980-90 దశకంలలో అమెరికా నూతన రాజకీయార్థిక విధానాలను చేపట్టింది. కార్మికుల సంక్షేమ కార్యక్రమాలకు, కార్మికుల జీతాలకు పెద్ద ఎత్తున కోతబెట్టి, సంక్షోభ భారాన్ని కార్మిక ప్రజలపైన, తృతీయ ప్రపంచదేశాల మీద నెట్టడానికి, పెద్ద ఎత్తున నూతన దాడి ప్రారంభించింది. వాషింగ్టన్ సమష్టి అవగాహన పేరుతో అమెరికా ప్రపంచ దేశాలమీద బలవంతంగా రుద్దినవే నయా-సామ్రాజ్యవాద, నయా ఉదారవాద విధానాలు.

ఈ విధానాలను కార్మికులు, పీడిత ప్రజలు, తృతీయ ప్రపంచ దేశాలమీద రుద్దడానికి అంతర్జాతీయ ద్రవ్య సంస్థ, ప్రపంచబ్యాంక్, అంతర్జాతీయ సెటిల్‌మెంట్ బ్యాంక్ 1995 నుండి ప్రపంచ వాణిజ్య సంస్థ, ప్రపంచ దేశాల ఆర్థికాలలో బలమైన స్థానాన్ని సంపాదించిన బహుళజాతి కంపెనీలు ఏజెన్సీలుగా పనిజేసాయి. ఐ.ఎం.యఫ్, ప్రపంచబ్యాంకులు బ్రెటిన్‌వుడ్ అగ్రిమెంటు నాటి బాధ్యతల నుండి తప్పించి, అమెరికన్ సామ్రాజ్యవాద ఏజన్సీలుగా మార్చబడ్డాయి. బాలెన్సు ఆఫ్ పేమెంట్ ఇబ్బందులలో నున్న దేశాలు అప్పుల కొరకు అంతర్జాతీయ ద్రవ్యనిధి వద్దకు వెళ్లినప్పుడు విషమ షరతులతో కూడిన స్టెబిలైజేషన్ అండ్ స్ట్రక్చురల్ ఎడ్జెస్ట్‌మెంట్ విధానాలను బలవంతంగా ఆయా దేశాలపై రుద్దడం జరిగింది.

ప్రభుత్వరంగ సంస్థల ప్రైవేటీకరణ, ప్రైవేటురంగాధిక్యతను పెంచడం, విదేశీ సరుకుల దిగుమతికి స్వేచ్ఛా మార్కెటు విధానాన్ని అవలంబించడం కార్మికుల హక్కులను హరించడం, తృతీయ ప్రపంచ దేశాలను దోపిడి చేయడం, బహుళజాతి కంపెనీల దోపిడీకి ఎట్టి ఆటంకాలు లేకుండా చేయడం, విదేశీ పెట్టుబడులకు, దేశీయ కవాటాలను బార్లాగా తెరవడం, వీటికి దేశీయ పెట్టుబడులతో సమాన అవకాశాలను కలుగజేయడం, ప్రభుత్వ వ్యయాన్ని తగ్గించటం, విత్తలోటును 3 శాతానికి తగ్గించడం మొదలగు విషమ షరుతులను, ఐ.యం.ఎఫ్., ప్రపంచబ్యాంక్ వలు దేశాలపై రుద్దాయి. నయా-సామ్రాజ్యవాద దేశాలు ప్రారంభించిన నూతన దాడిలోని ముఖ్యాంశాలు ఇవి.

### బ్యాంకు పెట్టుబడుల అంతర్జాతీయకరణ :

నయా-సామ్రాజ్యవాద గ్లోబలైజేషన్ దశలో మనీ మార్కెట్ల సంఖ్య విపరీతంగా పెరిగింది. ఇతరత్రా పెట్టుబడి ప్రవాహాలకన్నా 1970 తరువాత అంతర్జాతీయకరణ చెందిన బ్యాంకు పెట్టుబడి శక్తివంతమైనదిగా తయారయింది. దీనితో ప్రభుత్వాల కార్యకలాపాలకు అప్పు పెట్టడం, అభివృద్ధి చెందుతున్న దేశాలలో అభివృద్ధి కార్యక్రమాలకు బ్యాంకులు అప్పులివ్వడం, విస్తృతస్థాయిలో జరిగింది. ఈ బ్యాంకు అప్పులు ముఖ్యంగా మెక్సికో, అర్జెంటీనా, బ్రెజిల్ దేశాలకు వెళ్ళాయి. ఈ బ్యాంకుల మొత్తం అప్పులు 1972లో 2 బిలియన్ డాలర్ల ప్రమాణంలో వున్నవి. 1981 నాటికి 90 బిలియన్ డాలర్లకు చేరాయి. ఇందులో 58 బిలియన్ డాలర్లు లాటిన్ అమెరికన్ దేశాల అప్పులు.

వలసదాస్యం నుండి విముక్తి చెందిన స్వతంత్రదేశాలు అమెరికా ఏర్పాటు చేస్తున్న యుద్ధ కూటములలో చేరకుండా, ఇటు సోవియట్ రష్యా క్యాంపులోను చేరకుండా అలీన విధానాన్ని అనుసరిస్తూ తమతమ దేశాల ఆర్థికాభివృద్ధిని చేపట్టాయి. మూడవ ప్రపంచ యుద్ధాన్ని వ్యతిరేకిస్తూ ప్రపంచ శాంతి ఉద్యమానికై ఈ అలీన దేశాలు కృషి చేసాయి. అలీన దేశాల బాండింగ్ కాన్ఫరెన్స్ చరిత్రాత్మకమైనది.

ఈ అలీన దేశాలు 1970 దశాబ్దం నాటికి 77 దేశాల కూటమిగా రూపొంది నూతన ప్రపంచ ఆర్థిక విధానం ఏర్పడాలని పిలుపునిచ్చాయి. అమెరికా దీనికి పూర్తి భిన్నంగా నూతన ప్రపంచ వ్యవస్థ ఏర్పడాలని ప్రతిపాదించి, 77 దేశాల కూటమి పిలుపును ఓడించడానికి తన శక్తి యుక్తులనన్నింటిని ఉపయోగించింది. అటు తరువాత 1970 నుండి ప్రైమరీ ఉత్పత్తుల విలువలు పడిపోయాయి. ముడి చమురు ధరలు పెరిగాయి. వీటికి తోడు అమెరికా వడ్డీ రేటు పెరుగుదల వల్ల చాలా తృతీయ ప్రపంచదేశాలు విదేశీ అప్పులలో కూరుకుపోయాయి. ఈ విషమ పరిస్థితులే సామ్రాజ్యవాద దేశాల వత్తిళ్లకు తృతీయ ప్రపంచ దేశాలు లోనయ్యేటట్లు చేశాయి.

ఈ వత్తిళ్లలో తమతమ దేశాలు ఎదుర్కొంటున్న క్లిష్ట పరిస్థితుల నుండి బయటపడటానికి ఏ దేశానికాదేశం ప్రయత్నించడం జరిగింది. దీనితో 77 తృతీయ దేశాల కూటమి కుప్పకూలింది. 1979లో బ్రిటన్‌లో కన్జర్‌వేటివ్ పార్టీ విజయంతో, ఐరన్‌లేడీగా పేరుగాంచిన మార్గరెట్ థాచర్ ప్రధానమంత్రి అయ్యింది. 1980లో అమెరికా అధ్యక్షుడుగా రిపబ్లికన్ పార్టీ అభ్యర్థి రోనాల్డ్ రీగన్ ఎన్నికయ్యాడు. ఈ పూర్వరంగంలో అంతర్జాతీయ ఫైనాన్షియల్ సంస్థలు వాషింగ్‌టన్ సమష్టి అవగాహన

పేరుతో, ప్రపంచకార్మికులు, కష్టజీవులు, తృతీయ ప్రపంచ దేశాలపైన నయా-ఉదారవాద, నయా-సామ్రాజ్యవాద దాడిని అమలు జరిపారు. 1984 రీగన్ రెండవ పర్యాయం ఎన్నికయ్యే ముందుగా ఆరు మాసాల కాలం నేను అమెరికాలో వున్నాను. పలు కార్మిక యూనియన్లు, గత అగ్రిమెంటులోని జీతాలరేటు తగ్గింపు అంగీకరించి నూతన అగ్రిమెంట్లు చేసుకోవడం నేను గమనించాను. ఆనాటి బిజినెస్ వీక్ రీగన్ ప్రభుత్వం అమలు జరుపుతున్న విధానాలపై ఎంతో సమాచారాన్ని పాఠకులకు అందించేది. ఇక థాచర్ కార్మికుల జీతాలు కోత పెట్టడమే గాక, ప్రభుత్వ రంగ సంస్థలను ప్రైవేటీకరణ చేసిన విషయం అందరికి తెలిసినదే.

**నయా ఉదారవాద విధానాలలో ప్రధానాంశాలు :**

సామ్రాజ్యవాద దేశాల పెట్టుబడులకు, ఆ దేశాల సరుకులకు అప్పటివరకు ఉన్న విధి నిషేధాలను ఎత్తివేయాలి. సామ్రాజ్యవాద పెట్టుబడులకు, దేశీయ పెట్టుబడులకు ఇచ్చే రాయితీలన్నీ వర్తింపజేయాలి. ఆర్థికవ్యవస్థలో ప్రభుత్వ జోక్యాన్ని ఎత్తివేయాలి. స్వేఛ్ఛా మార్కెటు విధానానికి పట్టంగట్టాలి. ప్రభుత్వరంగ సంస్థలను ప్రైవేటీకరించాలి. ప్రైవేట్లురంగం పెరుగుదలను ప్రోత్సహించి దాని ఆధిపత్యాన్ని నెలకొల్పాలి. కార్మికవర్గ జీతాలకు ఇతర సదుపాయాలకు కోతపెట్టాలి. ప్రభుత్వాలు తమ వ్యయాన్ని తగ్గించుకోవాలి. ఫిస్కల్ లోటును నూటికి మూడు శాతానికి తగ్గించాలి. రెవెన్యూలోటును పూర్తిగా నిర్మూలించాలి. ఆయా దేశాలు తమ కరెన్సీ విలువలను తగ్గించుకోవాలి. ప్రభుత్వాల వ్యయం పైన, బడ్జెటుపై అదుపు పెట్టాలి. పెట్టుబడులను ఎక్కువగా ఆకర్షించడానికి ఆయాదేశాల కరెన్సీకి డాలరుతో పూర్తిమార్పిడికి అవకాశం కల్పించాలి. రీగన్ ప్రభుత్వం, థాచర్ ప్రభుత్వం కార్మికుల జీతాలకు కోత పెట్టాయి. పలు సౌకర్యాలు ఎత్తివేయబడ్డాయి.

**అంతర్జాతీయ సంస్థల సైంధవపాత్ర :**

పైన వివరించిన నయా ఉదారవాద విధానాలను అమలుజరిపే బాధ్యతను సామ్రాజ్యవాద దేశాల ఆధిపత్యంలో నడుస్తున్న అంతర్జాతీయ ద్రవ్యసంస్థ, ప్రపంచబ్యాంక్, గాట్, అంతర్జాతీయ ద్రవ్య (ఫైనాన్షియల్) సంస్థలు, అంతర్జాతీయ సెటిల్‌మెంటు సంస్థ, బహుళ జాతీయ కార్పొరేషన్లు లాంటి వాటిపై పెట్టడం జరిగింది. ఇంతకు ముందే వివరించినట్లు చాలా తృతీయ ప్రపంచ దేశాలు అప్పులపాలయి, విదేశీ వాణిజ్యలోటు, దానితోపాటు విదేశీ చెల్లింపుల లోటు ఏర్పడి అంతర్జాతీయ వాణిజ్యసంస్థ అప్పులకు, ప్రపంచబ్యాంకు అప్పులకు వెళ్ళక తప్పని పరిస్థితులు ఏర్పడ్డాయి.

**అంతర్జాతీయ ద్రవ్యసంస్థ మార్వాడీ విధానం :**

అప్పులకై వచ్చిన తృతీయ ప్రపంచ దేశాలపై అప్పుఇచ్చేముందుగా అంతర్జాతీయ ద్రవ్యసంస్థ, ప్రపంచ బ్యాంకు అనేక దేశాలపై విషమ షరతులు విధించాయి. ఈ అప్పులనే స్థిరీకరణ, వ్యవస్థాగత సర్దుబాటు అప్పులు అని పిలవడం జరుగుతోంది. ఈ అప్పులు తీసుకున్న దేశాలపై వాషింగ్‌టన్ ఉమ్మడి అవగాహన పేరుతో సామ్రాజ్యవాద దేశాలు రూపొందించి నయా ఉదారవాద విధానాలన్నింటిని రుద్దడం జరిగింది. ఈ విధానాలు ఆయా దేశాల ఆర్థికాభివృద్ధికి ఎంతో తోడ్పడతాయనే తప్పుడు ప్రచారాలు జరిగాయి. అసంబద్ధ ప్రబోధాలు, హితోక్తులు సామ్రాజ్యవాద సంస్థలు, వాటి వందిమాగధులు చేయడం జరిగింది.

**1994 గాట్ ఒడంబడిక :**

1994 గాట్ ముర్రాకేష్ ఒప్పందం తరువాత అభివృద్ధి చెందుతున్న దేశాల వ్యవసాయం, చిన్నతరహా పరిశ్రమల రంగాలు దెబ్బతిన్నాయి. ప్రపంచ వాణిజ్య సంస్థల నిబంధనల మేరకు దిగుబడి సుంకాలు తగ్గించి, విదేశీసరుకుల దిగుమతికి అనుమతించడంతో తృతీయ ప్రపంచ దేశాల వ్యవసాయరంగం పూర్తిగా నష్టపోయింది. 1997 తరువాత అంతర్జాతీయరంగంలో వ్యవసాయ పంటల ధరలు పడిపోయాయి. అభివృద్ధి చెందిన అమెరికా, యూరోపియన్ యూనియన్ దేశాలలో వ్యవసాయ పంటలకు హెచ్చుస్థాయిలో ఇస్తున్న సబ్సిడీలు, ప్రపంచవాణిజ్య సంస్థ నిబంధనలకు భిన్నంగా మరింత పెరిగాయి. అసలే పడిపోయిన వ్యవసాయ పంటల ధరలు, అగ్నికి ఆజ్యం పోసినట్లు అధిక సబ్సిడీలు తోడైనందున అమెరికా, యూరోపియన్ యూనియన్ దేశాల వ్యవసాయ, పాడి పరిశ్రమ సరుకులు కారుచవుకగా తృతీయ ప్రపంచదేశాలకు దిగుమతికావడంతో, ఈ దేశాల వ్యవసాయ సరుకుల ధరలు పడిపోయాయి. గిట్టుబాటు ధర మాట అటుంచి, పెట్టిన ఖర్చులుకూడా రాని దయనీయ పరిస్థితి ఏర్పడింది.

దోహా డెవలప్‌మెంట్ రౌండ్ ప్రపంచ వాణిజ్య చర్చలు 2001లో ప్రారంభమయ్యాయి. అభివృద్ధి చెందుతున్న, వెనుకబడిన దేశాల అభివృద్ధికి దోహదం చేసే దోహా డిక్లరేషన్‌లోని పలు అంశాలను అమెరికా, యూరోపియన్ దేశాలు వెనక్కు నెట్టివేసాయి. ఈమ దేశాలలో వ్యవసాయ రంగానికిస్తున్న మితిమీరిన సబ్సిడీల తగ్గింపును వ్యతిరేకించటమేగాక అభివృద్ధిచెందుతున్న దేశాల పారిశ్రామికీకరణను దెబ్బకొట్టే విధంగానూ, ఈ దేశాల వ్యవసాయరంగాన్ని సర్వనాశనం చేసేటటువంటి సూత్రీకరణలను జనీవా వాణిజ్య చర్చలలో ప్రతిపాదించాయి. ఆ వినాశకర అంశాలకు తృతీయ ప్రపంచ దేశాలు తలొగ్గేటట్లు చేయడానికి అమెరికా, యూరోపియన్ యూనియన్, జపాన్ దేశాలు సామ, దాన, భేదోపాయాలను ప్రయోగిస్తున్నాయి. ఉరుగ్వే విడత గాట్ ఒప్పందంతో నష్టపోయిన అభివృద్ధిచెందుతున్న దేశాల వ్యవసాయరంగం జనీవాలో ప్రస్తుతం జరుగుతున్న వాణిజ్య చర్చలలో అమెరికా, యూరోపియన్ యూనియన్ ప్రతిపాదనలు ఆమోదింపబడితే, అభివృద్ధి చెందుతున్న దేశాల వ్యవసాయం ఇక కోలుకునే పరిస్థితి ఉండదు. వ్యవసాయంపై ఆధారపడి జీవనం సాగిస్తున్న రైతాంగం వ్యవసాయరంగం నుండి గెంటివేయబడతారు. ఈ ప్రమాదాన్ని భారతదేశ వాణిజ్యమంత్రి నివారించాల్సి వుంది.

**ఐ.ఎం.ఎఫ్. షరతులను అమలు జరిపిన దేశాల పరిస్థితి :**

ఐ.ఎం.ఎఫ్. సర్దుబాటు అప్పులకు, ప్రపంచబ్యాంకు అభివృద్ధి అప్పులకు వెళ్ళిన దేశాలన్నింటికీ ఆయా దేశాల పరిస్థితులు, ఆయా దేశాల విదేశీ చెల్లింపులలో ఎదుర్కొంటున్న ప్రత్యేక పరిస్థితుల స్వరూప, స్వభావాన్ని సక్రమంగా పరిశీలించి సరియైన సూచనలు, ప్రతిపాదనలు చేయడం కాక, పిడుక్కి బియ్యానికీ ఒకే మంత్రం అన్న తీరున అన్ని దేశాలకు ఒకే రకమైన మార్పులేని షరతులు విధించడం వల్ల ఆయా దేశాల ఆర్థిక పరిస్థితులు మెరుగుపడకపోగా, క్షీణించి ఆర్థిక సంక్షోభాలకు లోనుగావలసి వచ్చింది.

ఐ.ఎం.ఎఫ్. విధించిన విషమ షరతులలో ఆయా దేశాల అభివృద్ధిని దెబ్బతీసి, ఆ దేశాలలో సంక్షోభం సృష్టించునటువంటి

విధానాలలో ఫైనాన్స్ రంగానికి సంబంధించిన విధానాలు ముఖ్యమైనవి. వీటిని ఇంతకుముందే వివరించటం జరిగింది.

1980 నాటికి ఫైనాన్స్ పెట్టుబడి వేగంగా పెరిగింది. ఉత్పత్తి పెట్టుబడిని రెండవ స్థానానికి నెట్టి, ఫైనాన్స్ పెట్టుబడి మొదటిస్థానం ఆక్రమించింది. ఫైనాన్స్ పెట్టుబడి లక్షణాలే వేరు. ఈ పెట్టుబడికి ఉత్పత్తిరంగంతో సంబంధం లేదు. ద్రవ్య చెలామణి రంగానికే ఇది పరిమితమవుతుంది. సామ్రాజ్యవాద నూతనదాడితో ఫైనాన్స్ పెట్టుబడి పాత్ర మరింతగా పెరిగింది. లాభాల రేటు కూడా ఉత్పత్తిరంగ పెట్టుబడిపై వచ్చే లాభాలరేటు కన్నా ఎన్నోరెట్లు ఎక్కువ. ఫైనాన్స్ పెట్టుబడి 24 గంటలు, రాత్రి, పగలు లేకుండా ప్రపంచ షేరు మార్కెట్‌లో తన పర్యటనను సాగిస్తూ వుంటుంది. ఈ ఫైనాన్స్ పెట్టుబడి జూదస్వభావపూరితమయినది (కాసినో కేపిటల్). ఈ ఫైనాన్స్ పెట్టుబడులు పలు దేశాల స్టాకు మార్కెట్లను తలక్రిందులు చేస్తుంటాయి. ఈ జూద స్వభావ ఫైనాన్స్ పెట్టుబడుల గురించి మరింత లోతుగా పరిశీలించడం అవసరం.

## ఐ.ఎం.ఎఫ్. సంస్థాగత సర్దుబాటు విధానాలు :

1987 నాటికి అంతర్జాతీయ ద్రవ్యనిధి విధించిన షరతుల ప్రకారం, ఆర్థిక సంస్కరణలు అమలు జరుపుతున్న దేశాల సంఖ్య 78కి పెరిగింది. ఈ 78 దేశాలలో ఏ సంస్కరణలు ఎన్ని దేశాలలో ఎంత వరకు అమలు జరిగాయో పట్టిక-3 లో చూడవచ్చు.

**పట్టిక-3**

| క్రమ సంఖ్య | సంస్కరణల వివరం | ఐ.ఎం.ఎఫ్. ఆర్థిక సంస్కరణలు అమలు జరుపుతోన్న మొత్తం దేశాలలో శాతం |
|---|---|---|
| 1. | కేంద్ర ప్రభుత్వ వ్యవకర్తన అమలు | 91 |
| 2. | పరపతి విస్తరణకు పరిమితులు | 99 |
| 3. | స్థూల జాతీయోత్పత్తిలో బడ్జెట్‌ను తగ్గించడం | 83 |
| 4. | వేతన స్తంభన | 65 |
| 5. | కరెన్సీ మారకపు రేటు విధానం | 54 |

ఐ.యం.ఎఫ్ ఆయా దేశాలపై రుద్దిన విషమ షరతుల వల్ల ఆయా దేశాల ఆర్థిక ప్రగతిలో వచ్చిన మార్పులను, సామాజిక మార్పులను మరోసారి పరిశీలించుదాం.

ఐ.యం.ఎఫ్. వ్యవస్థాగత సర్దుబాటు విధానాలు అమలు జరిపిన తరువాత ఆయా దేశాల ఆర్థికాభివృద్ధి ముఖ్యంగా వ్యవసాయ గ్రామీణ రంగాల పరిస్థితి ప్రజల జీవన పరిస్థితులు దిగజారాయి. ఈ విధానాలు అమలుజరపక ముందున్న పరిస్థితులతో పోల్చితే నూతన పరిస్థితి చాలా దయనీయంగా తయారయింది. చాలా దేశాలలో పెట్టుబడులు తగ్గిపోయాయి. స్థూల జాతీయోత్పత్తి రేట్లు సరుకుల ఉత్పత్తి ఆదాయాలు తగ్గిపోయాయి. అక్షరాస్యత అభివృద్ధి వెనకపట్టుపట్టింది. పసిబిడ్డల మరణాల రేట్లు పెరిగాయి. ఆరోగ్య సూచికలు పడిపోయాయి. ఉద్యోగిత రేటు తగ్గిపోయింది. వేతనాలు పడిపోయాయి. దారిద్ర్యం పెరిగింది.

## ద్రవ్య సంక్షోభాలు :

ఐ.యం.ఎఫ్. తన విధానల వల్ల ఆయా దేశాలలో జరుగుతున్న విషమ పరిణామాలను చూడ నిరాకరిస్తూ, తన విధానాలను మొండిగా సమర్థించుకొంటూ, తన విధానాల వల్ల అభివృద్ధి చెందిన దేశంగా మొదట అర్జెంటీనాను చూపడం జరిగింది. కాని అక్కడ పరిస్థితి వికటించిన తరువాత మెక్సికోను తమ విధానాల వలన అభివృద్ధి చెందిందనడానికి నమూనాగా పేర్కొనడం జరిగింది. 1994లో మెక్సికోలో సంక్షోభం వచ్చిన తరువాత ఆసియా టైగరు దేశాలుగా పేరుగాంచిన తూర్పు ఆసియా, ఆగ్నేయాసియాలోని దక్షిణ కొరియా, తైవాన్, హాంకాంగ్, థాయిలాండ్, ఇండోనేషియా, ఫిలిప్పైన్స్, మలేషియా దేశాలను తన విధానాల అపూర్వ విజయంగా ఎత్తిచూపడం జరిగింది. కాని ఈ దేశాలలో 1997లో విదేశీ చెల్లింపుల లోటు, బడ్జెటులోటుతో కరెన్సీల పతనం ప్రారంభమవడంతో, షేరు మార్కెట్ల పతనం జరిగింది. ఆ తరువాత ద్రవ్య సంక్షోభాలుగా మారటం జరిగింది. విదేశీ పెట్టుబడులు ఆదేశాల నుండి వుడాయించాయి. అటు తరువాత కొన్ని దేశాలలో ఆ సంక్షోభం రాజకీయ సంక్షోభంగా మారటం జరిగింది. ఈ ద్రవ్య సంక్షోభం అంటుజాడ్యంగా తయారయింది. అది 1998లో రష్యాకు, అటు తరువాత బ్రెజిల్‌కు పాకింది. ఈ పరిణామాలలో పై దేశాలలో అంతవరకు జరిగిన అభివృద్ధి అంతా అతలాకుతలమై, ఆర్థిక వ్యవస్థ జీవనాడులను కృంగదీసింది. ప్రజల ఆదాయాలు పతనం అయ్యాయి. ఈ సంఘటనలతో ఐ.ఎం.ఎఫ్. విధానాల బండారం కాస్త నగ్నంగా బయటపడింది. ఈ అప్పుల అభివృద్ధి వ్యతిరేకత, ప్రజా వ్యతిరేకత నిజరూపాన్ని ప్రపంచ ప్రజలంతా చూడగలిగారు.

ఇక ఆఫ్రికన్ దేశాల జాతీయాదాయాల పతనం జరిగింది. నూటికి 70మంది ఆధారపడ్డ వ్యవసాయరంగం కోలుకోలేని విధంగా పూర్తిగా దెబ్బతినడం జరిగింది. నిరుద్యోగం, ప్రజలలో దారిద్ర్యం పెరిగాయి. ఇక మనదేశంలో వ్యవసాయం, గ్రామీణ రంగాలు పూర్తి సంక్షోభంలో చిక్కుకున్న విషయం అందరికీ తెలిసిందే.

## కర్తవ్యం :

ఐ.యం.ఎఫ్., ప్రపంచబ్యాంకు మనపై రుద్దిన అభివృద్ధి నిరోధక వ్యవస్థాగత సర్దుబాటు విధానాలను, దాని ద్రవ్యవిధానాలను తిరస్కరించాలి. అంతర్జాతీయ వాణిజ్య సంస్థ దుర్మార్గపు నష్టకోరు విధానాలను వ్యతిరేకించాలి. వాటి అమలు నిలిపివేయాలి. మన దేశాభివృద్ధికి, వ్యవసాయాభివృద్ధికి, గ్రామీణాభివృద్ధికి డా.స్వామినాథన్ అధ్యక్షతన ఏర్పాటయిన జాతీయ వ్యవసాయదారుల కమీషన్ తన నాలుగు నివేదికల లోను సూచించిన పలు సూచనలను అమలు జరపాలి. ఇందుకు అవసరమైన అన్ని చర్యలు తీసుకోవాలి. ఇలా జరిగితేనే మన వ్యవసాయరంగం తిరిగి పుంజుకుంటుంది. రైతుల, గ్రామీణుల ముఖాలపై నవ్వులను చూడగలుగుతాం. అయితే ఈ మార్పులన్నీ పాలకుల దయాదాక్షిణ్యాలకు వదిలితే జరిగేవికావు. బూర్జువా పాలకులు, పార్టీలు ప్రజలను భ్రమ పెట్టడానికి వాగ్దానాలను గుప్పించడం సర్వసామాన్యం. తమ ఆచరణలోని లొసుగులను కప్పిపుచ్చుకోవడానికి నానా తంటాలు పడతాయి. అందువల్ల బలమైన, విస్తృత, మిలిటెంటు ప్రజాపోరాటాలతోనే ప్రభుత్వ విధానాలను మార్చడం జరగాలి. అప్పటికీ ప్రభుత్వ విధానాలలో మార్పురాకపోతే, ప్రభుత్వాలనే మార్చవలసి ఉంటుంది. ◆

# అసహజ మరణాల సూచి

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. ఆ సహజ మరణపు వయోపరిమితి దేశ కాల పరిస్థితులను బట్టి, జీవన ప్రమాణాలను బట్టి అరవైల నుంచి తొంబైల దాకా ఉండవచ్చు. కాని మన సమాజంలో సాధారణ ఆయు ప్రమాణం 63 సంవత్సరాలు అయినప్పటికీ ఎంతోమంది పుట్టుకలోనే మరణిస్తున్నారు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ మరణం అనేక రూపాలలో సంభవిస్తోంది. ఆకలి, అనారోగ్యం, మానసిక ఆందోళనలు, సామాజిక అసమానతలు, వరకట్న మరణాలు, నిర్లక్ష్యం, అంటరాని తనం, వ్యవసాయం, చేనేత వంటి రంగాల్లోని సంక్షోభాలు, పారిశ్రామిక అశాంతి, జీవనోపాధి లేమి అసహజ మరణాలకు లెక్కలేనన్ని కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైనపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా కనీసం పదివేల మంది ఇటువంటి అసహజ మరణాల బారిన పడుతున్నారని ఒక అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త ప్రేమగా వ్యవహరించో, జాగ్రత్తగా వ్యవహరించో మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే, ఆలోచింపజేస్తే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

| తేది | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు/కారణాలు తెలియని | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| 26-7-2006 నుండి 1-8-2006 | - | - | 13 | - | - | - | 8 | 8 | - | 19 | 20 | 2 | - | - | - | 1 | - |
| 2-8-2006 నుండి 8-8-2006 | - | 2 | 26 | 3 | - | - | 9 | 13 | - | 10 | 26 | 1001* | 4 | - | - | 1 | - |
| 9-8-2006 నుండి 15-8-2006 | - | - | 19 | 1 | - | - | 14 | 8 | - | 18 | 22 | 5 | - | - | - | - | 111 |
| 16-8-2006 నుండి 25-8-2006 | 2244** | - | 39 | 2 | - | - | 9 | 5 | - | 40 | 16 | 19 | - | - | 3 | 1 | - |
| మొత్తం | 2244 | 2 | 97 | 6 | - | - | 40 | 34 | - | 87 | 84 | 1027 | 4 | - | 3 | 3 | 111 |

* జనవిజ్ఞానవేదిక క్లినికల్ సర్వే రిపోర్ట్ ప్రకారం ** ప్రస్తుత ప్రభుత్వ హయాంలో



# ఆంధ్రప్రదేశ్ : నాడు - నేడు

ఐ.టి. రంగం :

## ఆంధ్రప్రదేశ్ ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ పెరుగుదల

| సంవత్సరం | ఐ.టి. యూనిట్ల సంఖ్య | ఎగుమతులు కోట్లలో | ఉద్యోగుల సంఖ్య | దిగుమతులపై పెట్టిన పెట్టుబడులు కోట్లలో |
|---|---|---|---|---|
| 1994-95 | 58 | 22 | - | - |
| 1995-96 | 76 | 60 | - | - |
| 1996-97 | 88 | 134 | 4,500 | - |
| 1997-98 | 112 | 284 | 8,700 | 605 |
| 1998-99 | 194 | 574 | 12,000 | 859 |
| 99-2000 | 977 | 1059 | 25,500 | 1423 |
| 2000-01 | 1206 | 1917 | 48,700 | 2025 |
| 2001-02 | 1322 | 2907 | 64,000 | 2350 |
| 2002-03 | 1401 | 3668 | 71,445 | 2849 |
| 2003-04 | 1055 | 5025 | 85,945 | 3533 |
| 2004-05 | 1086 | 8270 | 1,26,920 | - |

విద్యుత్‌రంగం :

## విద్యుత్‌రంగంలో ప్రణాళికా వ్యయం

| ప్రణాళికా కాలం | విద్యుత్‌రంగ వ్యయం | మొత్తం ప్రణాళికా ఖర్చు |
|---|---|---|
| రెండవ ప్రణాళిక | 38.53 | 188.6 |
| మూడవ ప్రణాళిక | 93.61 | 352.41 |
| నాల్గవ ప్రణాళిక | 190.58 | 448.87 |
| ఐదవ ప్రణాళిక | 537.18 | 1444.71 |
| ఆరవ ప్రణాళిక | 745.86 | 3237.07 |
| ఏడవ ప్రణాళిక | 1028.03 | 5978.88 |
| ఎనిమిదవ ప్రణాళిక | 3637.0 | 13,606.52 |
| తొమ్మిదవ ప్రణాళిక | 9191.93 | 30,398.23 |
| పదవ ప్రణాళిక 2002-03 | 2167.96 | 8314.86 |

వ్యవసాయం :

## వివిధ నీటిపారుదల వసతుల కింద పెరుగుదల రేట్లు

| క్రమ సంఖ్య | సంవత్సరం | చెఱువులు | ప్రాజెక్ట్ కాల్వలు | బోరు బావులు | ఇతర బావులు | ఇతర పద్ధతుల్లో |
|---|---|---|---|---|---|---|
| 1. | 1982-83లో (1956-57తో పోల్చి) | -1.34 | 1.46 | 11.34 | 3.0 | 0.11 |
| 2. | 1988-89 (1983-84 తో పోల్చి) | - 1.14 | - 0.78 | 7.08 | 5.73 | 4.36 |
| 3. | 1994-95 (1989-90 తో పోల్చి) | -9.73 | -3.43 | 19.77 | -2.19 | 1.01 |
| 4. | 2003-2004 (1995-96 తో పోల్చి) | -6.19 | -3.38 | 7.42 | -4.48 | -3.24 |
| 5. | 2004-2005 (2003-2004 తో పోల్చి) | -2.57 | 18.41 | 4.91 | -3.75 | 12.24 |

మూలం : *గోల్డెన్ జూబిలి ఆఫ్ ఆంధ్రప్రదేశ్, డైరెక్టరేట్ ఆఫ్ ఎకనమిక్స్ అండ్ స్టాటిస్టిక్స్, హైదరాబాద్*

PRINTED BOOK
RNI Regn. No. APTEL/2003/11482 Published on 27-08-06 Postal Regn. No. LII/RNP/H-HD 1029/2004-06

# పేదరిక నిర్మూలన ధ్యేయం పల్లె, పట్టణాలు ప్రగతిమయం




నిరుపేదల అభ్యున్నతి కోసం చిత్తశుద్ధితో అమలు చేయబడుతున్న ఇందిరమ్మ పథకం ఆశయ సాధనకు ప్రతి ఒక్కరూ భాగస్వాములు కావాలి. ప్రజల స్పందన, భాగస్వామ్యం, సత్వర పేదరిక నిర్మూలనకు దోహదపడుతుంది. అప్పుడే ప్రతి పల్లె, ప్రతి పట్టణం ఆదర్శ ప్రాంతమౌతుంది.

- డా॥ వై.యస్. రాజశేఖర రెడ్డి
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి



రాష్ట్రంలోని అన్ని గ్రామాలలోనూ విద్య, వైద్యం, రోడ్లు, డ్రైనేజి, మంచినీరు, విద్యుత్ సదుపాయాలు, అంగన్‌వాడీ కేంద్రాలు, గ్రామంలోని అర్హులందరికీ పక్కా ఇళ్ళు, మరుగుదొడ్లు, పింఛన్లు అందజేసి ఎంపిక చేసిన ప్రతి జనవాసం పరిపూర్ణాభివృద్ధి చెంది, ఆదర్శప్రాంతంగా తీర్చిదిద్దడానికి ఇందిరమ్మ పథకం రూపొందించడమైనది. రాబోవు మూడు సంవత్సరాలలో రాష్ట్రమంతటా ఇందిరమ్మ పథకంతో ప్రతి పల్లె, పట్టణం మెరుగైన మౌలిక సదుపాయాలతో ప్రజల జీవన సరళిని పెంపొందించడమే ప్రభుత్వ ధ్యేయం.

నిష్పక్షపాతంగా రాజకీయాలకు అతీతంగా గ్రామ పంచాయితీ, మున్సిపాలిటీ స్థాయిలో అమలు చేయబడుతున్న ఇందిరమ్మ పథకం విజయసారధులు .... ప్రజలు. ప్రతి జనవాసాన్ని వారి వారి ఆశయాలకు అనుగుణంగా తీర్చిదిద్దేందుకు ప్రభుత్వ కృషికి ప్రతి ఒక్కరూ చేయూతనివ్వాలి. కలిసికట్టుగా గ్రామ భవిష్యత్తును ఆదర్శవంతంగా తీర్చిదిద్ది, రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికి దోహద పడాలి. గ్రామగ్రామాన్నీ ఆదర్శ గ్రామంగా తీర్చిదిద్ది దేశానికే మార్గదర్శకమవ్వాలి.

**తొలిదశలో భాగంగా 8,026 గ్రామ పంచాయితీలు, 1,371 మున్సిపల్ వార్డుల్లో సుమారు కోటి 82 లక్షల గ్రామీణ ప్రజానీకానికి, 45 లక్షల పట్టణ, నగర లబ్ధిదారుల ఎంపిక.**

## లక్ష్యాలు



**పింఛన్లు :** జీవనోపాధి లేక దారిద్ర్యరేఖ దిగువనున్న అర్హులైన 9.02 లక్షల మందికి నెలకు రూ. 200/- చొప్పున పింఛన్లు - 5.52 లక్షల వయో వృద్ధులకు, 2.28 లక్షల వితంతువులకు, 1.08 లక్షల వికలాంగులకు, 0.14 లక్షల చేనేత కార్మికులకు పింఛన్ల సౌకర్యం



**గృహ నిర్మాణం :** ఇళ్ళు లేని అర్హులైన 18.13 లక్షల మంది బడుగు వర్గాల వారందరికి మౌలిక వసతులు కలిగిన శాశ్వత గృహ నిర్మాణం



**పారిశుద్ధ్యం, వ్యక్తిగత మరుగుదొడ్లు :** 23.87 లక్షల గృహాలకు వ్యక్తిగత మరుగుదొడ్ల నిర్మాణం



**రహదారులు :** సుమారు 1500 మంది జనాభా కలిగిన 795 జనవాసాలకు తారు రోడ్ల సౌకర్యం. ఇంతవరకు రహదార్లు లేని 500 జనాభా కల్గిన 128 జనవాసాలకురోడ్ల సౌకర్యం.



**త్రాగునీటి సౌకర్యం :** 14,916 జనవాసాలలో రోజు ఒక్కొక్కరికి 40 లీటర్ల చొప్పున అందేలా మంచినీటి సౌకర్యం. ఫ్లోరైడ్ లాంటి కలుషిత నీరు వున్న జనవాసాలకు, పాక్షిక సౌకర్యం కలిగిన వాటికి కూడా వర్తింపు.





**గృహ విద్యుత్ :** దారిద్ర్యరేఖ దిగువనున్న కుటుంబాలకు కేవలం రూ. 125/-తో విద్యుత్ కనెక్షన్, ఈ పథకంలో 12 లక్షల గృహాలకు విద్యుత్ సౌకర్యం



**పాఠశాలల్లో మౌలిక సదుపాయాలు :** 14,994 పాఠశాలల్లో అదనంగా తరగతి గదుల నిర్మాణం, 9,771 పాఠశాలలకు త్రాగునీటి సౌకర్యం, 14,262 పాఠశాలలకు మరుగుదొడ్ల నిర్మాణం





**అంగన్ వాడీ కేంద్రాలు :** ఎంపిక చేసిన గ్రామాలలో నూతనంగా 11,747 అంగన్ వాడీ కేంద్ర భవనాల నిర్మాణం. 7,891 కేంద్రాలలో త్రాగునీటి సౌకర్యం, 6,387 కేంద్రాలలో మరుగుదొడ్ల నిర్మాణం.



**ఆరోగ్యం :** ఆసుపత్రి ప్రసవాలకు ప్రోత్సాహం, అంటువ్యాధుల నివారణ చర్యలు, పిల్లలకు పౌష్టికాహార సరఫరా, ఎయిడ్స్‌పై అవగాహన కార్యక్రమాలు.




**ఇందిరమ్మ రాజ్యం - ఇంటింటా సౌభాగ్యం**

జారీ చేయువారు : సమాచార, పౌర సంబంధాల శాఖ

Owned, Printed and Published by V. Hanumantha Rao at 301, Mythri Residency, 3-6-394, Road No. 3, Himayat Nagar, Hyderabad - 500 029. Ph : 66843495. Printed at Charita Impressions, Azamabad, Hyderabad. For Nutan Art Printers, Hyderabad. Working Editor : N. Venugopal

VEEKSHANAM
301, Mythri Residency, 3-6-394, Road No. 3, Himayatnagar, Hyd-29.